సంధి నంగీకరింపదలచిన విధముననే గాంధి మహాత్ముడును కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమును పోలీసువార్యల విచారణను శాంతికి ప్రమాణముగను నిర్ణయించుట సముచితముగ నున్నది. పోలీసుదౌర్జన్యములనుగురించి దౌర్జన్యముల నాజ్ఞాపించిన పోలీసు శాఖాధికారులు విచారించుట కేవలము కపట నాటకము. గతకాలమునందలి వాగ్దానములవలెను నిదియును మృతాతురముగను నుండగలదు. ప్రభుత్వహృదయమునందు గలిగిన పశ్చాత్తాపమునకు పోలీసువారి దురంతములను విమర్శించుటయును నిర్ణయించుటయును నిదర్శనము గాగలదు. శాంతిధర్మములను గోరువారందరును దీనిని హర్షించుట సహజము. ఈ విచారణ జేయుటవలనను అధికార గౌరవము బలపడగలదు గాని క్షీణింపజాలదు. భగవద్భక్తిగల ఇర్విన్‌ప్రభు వధికారాభిమానమును విడిచి ధర్మనిర్వహణమునకు బూనుకొనుట ధర్మవిజయమునకు నిదర్శనము. గాంధి మహాత్ముడు కాంగ్రెసునకు గడించిన ధర్మవిజయ శాంతిధర్మసంస్థాపనములకు ప్రపంచమున ర్శముగ నుండగలదు. గాంధిమహాత కాంగ్రెసుసభ్యులును కోరునటులు విధానమునందు సిద్ధాంత ప్రయోగములు సమానధర్మమును గలిగియుండవలయును. అది సాధ్యమైనపుడు సామాన్యవిషయములు శాంతికిని సహకారమునకును నాటంకములు గాజాలవు. ఈ ధర్మవిజయమునే ఇర్విను గాంధి మహాత్ములకును కుదిరిన యొడంబడిక విశదము చేయుచున్నది. ప్రయత్నముల ఇర్విన్‌ప్రభువు చూపిన నీయము.

* * * *

వర్తమానకాలమునందు ప్రపంచావ్యాప్తమైన దుర్భిక్షము భరతవర్షమునందు ప్రచండరూపమును దాల్చుచున్నది. గతవత్సరమునందు గలిగిన యతివృష్టి అనావృష్టిదోషములును ప్ర ... లును ప్రజల స్థితి గనులను ... టలు చెడిపోయినవి ... ఎ. దేశాదాయము ... భుత్వమునందు 15 కో ... గలిగినది. రాష్ట్ర ప్ర ... గలిగినది. లోటును ప ... న్నులు హెచ్చుగా ... న్నులభారము క్రిందను ... లు హెచ్చుపన్నుల క్రిం పడిపోవుట సహజము. ... తగ్గించుటకు వ్యయమును ... ముగాని పన్నులను హెచ్చు ... ముగాదు. కేంద్ర ప్రభుత్వము ... యమును కోటిన్నర హెచ్చ బడినను వ్యయమునకు నాదాయ ... 14 కోట్లధికమైనది. పన్నుల భారముక్రిందను క్రుంగుచును పరమదరిద్రము ననుభవించుచున్న ప్రజలు హెచ్చుపన్నులను భరింపజాలరనువిషయము సర్వత్ర తెలిసియున్నది. పరదేశసైన్యము పరదేశ పండితులు పరదేశవ్యాపారులు దేశాధికారమును గలిగి

# భారతి

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౮. సంచిక ౬.

ఆంధ్రపత్రికా ముద్రాలయము _ మద్రాసు.

౧౯౩౧

# భారతి - అష్టమ సంపుటము - భా. ౧.

## వ్యాసముల అకారాదిసూచి

---

# చిత్రములు

త్రివర్ణచిత్రములు :—భారతమతసంచయము, బంగాలీ.

సాధారణచిత్రములు:—శ్రీ కీ. శే. దామెర్ల రామారావుగారు ; నందిపూజ ; అంకోరునందు పాడుపడియున్న మహాహిందూదేవాలయము ; మణ్మ్ముఖదైవము ; మార్గరోటా యొహాన్సన్ కన్య ; మాడెలిన్ వెయిల్డ్రిబాల ; శ్రీమతి సరోజినీ కన్య ; శ్రీమతి కుముదినీ కన్య ; అనంతగిరి జలపాతము ; ప్రాతికట్టడములు, గవాక్షముల చిత్రములు ౧౦ ; కాంచీపుర వరదరాజస్వామి యాలయములోని రాతిస్తంభము ; ఇతరచిత్రములు.



చెన్నపట్టణము, జూన్ ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము జ్యేష్ఠమాసము సంఖ్య ౬

# సాత్త్వికనిరోధము

భోగరాజు నారాయణమూర్తి గారు

స్వాంతంబుల్ కరఁగింపఁజాలు మృదువాగ్జాలంబుతో, దీనతా
క్రాంతంబైన మొగంబుతో భుజనటత్క్షాదీసమూహంబుతో
కాంతా! సాత్వికమార్గమూని పురియంగల్లం బ్రసంగించు నీ
శాంతోపేత నిరోధబోధనల నశ్రాంతంబు శ్లాఘించెదన్.

యాతాయాతజనంబు లెల్లరు సమగ్రాశ్చర్యులై చూడ వి
ఖ్యాతింగాంచిన శ్వేతహార్యరుణవర్ణాంచత్పతాకంబు నీ
చేతందాలిచి, యెండ కోర్చి, విదేశీయాంబరస్తోమవి
క్రేతక్రేతల మందలింతువు; నినుం గీర్తింతు సాధ్వీమణీ!

ఆరయఁ జండభానుని సహస్రకరప్రకరప్రతాప మె
ట్లోరుచుకొందువో యెఱుఁగ నోసుమకోమలగాత్రి! నిత్యమున్
భూరికృపాపరత్వమున భూతము లైదును బ్రోచునొక్కొ య
క్రూరతనొప్పు సాత్వికనిరోధమహోద్యమసువ్రతాత్ములన్!

కంటం జూచియెఱుంగ వంగడుల నేకాలంబునం దట్టినిన్
గంటిన్ నీవెనువెంట నీబుడుతలం గైకొంచు బాజారులో
నొంటం జెమ్మట గ్రమ్మ సాత్త్వికనిరోధోద్యోగమందుండ; నేఁ
గంటిన్ దేశహితార్థమూనఁదగు త్యాగంబుం బవిత్రాంగనా.

చిఱుతలు నీకుమారకులు చెచ్చెరఁ జేటలతోడ నిప్పులం
జెఱిగెడు నెండలోన వడఁజెందరు నీడకుఁబోరు వన్నెలం
దఱుగరు; తావకీనధృతదారుణదేశహితార్థసువ్రతం
బరుదుగఁ దోఁచె నింతటిమహత్తరమౌన పతివ్రతామణీ!

ఆరం బంగరురంగు మేనులను ఘర్మాంకూరముల్ గ్రమ్మఁగా
ఘోరార్కోజ్జ్వలతాపతప్తులయి నీకుఱ్ఱల్ మహాభీలకాం
తారోద్వాహ్నిఁ గురంగశాబకములై నారమ్మ! యెవ్వారికిన్
వారింజూచిన దుఃఖవారికణముల్ వర్షించు నవ్వారిగా.

'అన్నా! వద్దు విదేశవస్త్ర' మని నీ వర్థించి కేల్మోడ్చుచో
నిన్నుంజూచి సరోజపాణియుగముల్ నీపుత్త్రిలున్ మోడ్తు; రా
చిన్నారుల్ సుకుమారమూర్తులు చిరంజీవుల్ మహాకీర్తిసం
పన్నుల్ గా నిజదేశవర్ధనులుగా వర్ధిల్ల దీవించెదన్.

నీకుఱ్ఱల్ ఫలముల్ మిఠాయి లచటన్ నిత్యంబు వీక్షించుచున్
మాకుం దెమ్మని వేడ్వ రేమి చెపుమా మాపిల్ల లట్లమ్మరో!
నీకుఱ్ఱల్ విధియైన నాఁడు చెఱకున్ నిశ్చింతమైఁ బోవఁగా
నేకోర్కుల్ మదికోరకుండు నలవా టీనాఁడె గావించితే?

ప్రవిమలశీల! నీకతనఁ బట్టణవర్తకకోటికిన్ విదే
శవసనవాసనల్ కడునసహ్యములయ్యెఁ గదమ్మ! చిత్తముల్
దవులగఁ దెల్పుటన్ ఖదరుధారణకారణమర్మముల్ ప్రజా
నివహ మెఱింగి మెచ్చుకొనె నీయవిరోధనిరోధబోధనల్.

మగువా! ఖద్దరురక్షణార్థమయి యుష్మన్నిష్ఠురాలాపచా
పగుణధ్వానము వర్తకప్రతతిలో వ్యాపించి, తచ్చిత్తముల్
పగులంజేసి, విదేశపట్టణములన్ వస్త్రాళి బస్తాలపై
బిగియంగట్టిన యిన్పరేకులను ద్రెంపెం జుమ్మీ వీరాంగనా!







## స్త్రీలపాలిటి వరప్ర...

గర్భకోశయ సంబంధమగు ముట్టుకట్టు - కుసుమరోగము, సోమరోగము - అకాలబహిష్టి, బహిష్టి నిలిచిపోవుట, గర్భస్రావము, సంతానహీనత మొదలగు వ్యాధులకిది అభయప్రదాత. మేహజ్వరములను, జలుబును, దగ్గును, బలహీనతను, రక్తహీనతను, అజీర్తిని నమ్మకముగ కుదుర్చగలుగు.

వెల పెద్దబుడ్డి రు 3 లు; చిన్నది 1-10-0 అన్ని మందులషాపులలో దొరకును.

**కేసరికుటీరం, ఆయుర్వేద ఔషధశాల, ఎగ్మూర్, మద్రాసు.**

---



## శ్రీ లక్ష్మీ జ్యూయలరీ కంపెనీ

### మాన్యుఫాక్చరింగు జ్యూయలర్సు
### అండు డైమండు వర్తకులు, బెజవాడ

నవరసు బంగారమునకు చావ వెండికి మేలైనపనులకు సుప్రసిద్ధమైన స్థలము.

ప్రొప్రైటరు:—**ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరి.**

---

**గ్రామోద్యోగస్థుల మాన్యువలు:**—అనగా మునసబు—మణియగారు—
కరణము మాన్యువలు. ఇప్పటివరకు సవరింపబడిన క్రొత్తకూర్పు 1-కి రూ. **2—0**

**గ్రామ మునసబు మణియగార్ల స్పెషల్ టెస్టు పరీక్ష:**—
ప్రశ్నోత్తరములు, రెండు భాగములు, క్రొత్తకూర్పు 1-కి రూ. **1—8**

**ఇండియన్ పినల్‌కోడ్:**—అనగా ఇండియాదేశపు శిక్షాస్మృతి; 1860-వ సంవత్సరపు 45-వ ఆక్టు, క్రొత్తకూర్పు 1-కి రూ. **4—0**

**వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,**

తంతి అడ్రసు: 'వావిళ్ల' మదరాసు. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి ఈ.

---

## అ మృ తాం జ న ము

చక్కని డబ్బీతో సహా సీసా 1-కి ౧౦ అణాలు మాత్రమే

## తా మ ర తై ల ము

తామరలకు మంచిమందు. ప్రతియింట నుండదగినది. డబ్బి 1-కి 0-6-0 డజను 1-కి 3-8-0.

బొంబాయి **అమృతాంజనం డిపో,** మదరాసు.

# సాహిత్యరత్నాకరకారుఁడే భాష్యరత్నప్రభాకారుఁడు

మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ ఆపంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు

ఈశీర్షికతోఁ ప్రమోదసంవత్సరమాఘమాస "భారతి" లోఁ బ్రకటింపఁబడిన బ్రహ్మశ్రీ వేమూరి నృసింహశాస్త్రులవారి వ్యాస మెల్లరును సావధానముగాఁ జదువఁదగినది. పండితప్రకాండులగు నృసింహశాస్త్రులవారు సయుక్తికముగాను, సోపపత్తికముగాను "సాహిత్యరత్నాకరకారుఁడే భాష్యరత్నప్రభాకారుఁ" డని స్థిరపఱిచి తమవ్యాసమును బ్రకటించి యాంధ్రలోకమునకు మహోపకార మొనరించిరి. సాహిత్యరత్నాకరాదికృతులను రచించిన సుప్రసిద్ధమహాకవియును షడ్దర్శనపారంగతుఁడగు మహాపండితుఁడును నగు వారణాసి ధర్మసూరి కృష్ణాతీరవాసియగు నాంధ్రబ్రాహ్మణుఁడు. ఈతఁడే తురీయాశ్రమస్వీకార మొనరించినవెనుక బ్రహ్మసూత్రశాంకరభాష్యమునకు భాష్యరత్నప్రభాటీకను రచించెను—అను నీవిషయము తెలిసినంతనే యాంధ్రుఁడైనను సంతోషమును వెలిఁబుచ్చి గర్వపడక యుండఁగలఁడా?

నృసింహశాస్త్రులవారు లోకసంగ్రహముకొఱకుఁ బనిఁబూని ధర్మసూరివిషయమున విశేషాంశములను బ్రకటించినట్లే సుప్రసిద్ధవిద్వత్కవులగు నాంధ్రమహాపురుషులను గూర్చిన విశేషాంశములను బ్రకటించి కీర్తివహింతురుగాక. మల్లినాథసూరి జగన్నాథపండితరాయ ముదలగు నాంధ్రమహాపురుషుల చరిత్రములు కేవల మాంధ్రలోకమునకే కాక సమస్తలోకమునకు నుపకారకములగుటచేత నావశ్యకములు.

నృసింహశాస్త్రులవారి వ్యాసమున ధర్మసూరిని గూర్చి తెలిపిన విషయములను సావధానముగాఁ జదివి వారివ్యాసమున కనుబంధరూపముగా నుపయోగపడవచ్చునేమో యను నభిప్రాయముతో నే నీక్రిందఁ గొన్ని విషయములను తెలుప సాహసించుచున్నాను—ధర్మసూరి రీతిమును దెలిసికొనఁ గోరువారికిఁ బనికివచ్చు ననుతలంపుతో విశదీకరింపుచున్నాను.




ఈవంశానుక్రమణిక సాహిత్యరత్నాకరమునఁ బ్రథమతరంగమునందుఁ దెలుపఁబడియున్నది. ధర్మసుధీనాగాంబికల పుత్రులు ముగ్వురిలో నారాయణావధాని జ్యేష్ఠుఁడు కావున సాహిత్యరత్నాకరకారుఁడగు ధర్మసూరికిఁ బెదతండ్రియగుచున్నాఁడు. నారాయణావధాని పరిక్రమణ క్రతువు యనిపించుకొనుచుండెను. ధర్మగ్రామ శేషాద్రి రాజసభలో సుప్రసిద్ధుఁడగు రామావధానిని నారాయణావధాని వేదవ్యాఖ్యానవిషయమున జయించుటవలన రాజాతనిని మెచ్చి ఛత్రచామరాందోళికలను బహుమానమిచ్చి "అవధానీశ్వరశరభ ఘంటాగండభేరుండ" బిరుదమును సమర్పించెను.

జిత్వా రామావధానిప్రవర మురుమహ
ద్వేగవద్వాదచర్చా
గోష్ఠ్యా నారాయణార్య స్సదసి బుధశతై
శ్లాఘ్యమానావధానః
సంతుష్టా ద్ధర్మభూపా దలభత శిబికాం
చామరచ్ఛత్రపూర్వాం

గర్వాఖర్వావధానీశ్వరశరభఘటా
గండభేరుండచిహ్నమ్॥

—సాహిత్యరత్నాకరము; ప్రథమతరంగము, ౨౧

పైని జెప్పిన ధర్మభూపాలుఁ డెప్పటివాఁడో, యెప్పటివాఁడో చరిత్రకారులవలన దెలియంగఁదగియున్నది

నారాయణాభిధానుల యనుజుఁడగు పర్వతనాథ సూరి సకలశాస్త్రపారంగతుఁడు. అతఁడు పండితసభా ముఖ్యమునందు వాదమున జనార్దనాచార్యుఁడను పండితుని జయించి యాతనికిఁ గల ప్రౌఢమగు "వాదికేసరి" బిరుదమును స్వయముగా సంపాదించెను; మఱియు వానిని "మాయావాదభయంకర" బిరుదమును యొప్పు మాపి కీర్తి వహించెను.

తస్యాఽనుజః పర్వతనాథసూరి
రాసీ దశేషాగమపారదృశ్వా
..............................

సా. ర. ప్రథమతరంగము, ౨౨.

యో వాదేన జనార్దనాహ్వయబుధం
మధ్యేవిపశ్చిత్సభం
జిత్వాఽవిందత వాదకేసరిపదం
ప్రౌఢం తదీయం స్వయమ్।
మాయావాదిభయంకరాఖ్యబిరుదా
దత్యూర్జితా దూర్జితా
త్కీర్తిం చోదంచయతిస్మ కీర్తిమతులాం
ప్రచ్యావయ న్వైష్ణవమ్॥

సా. ర. ప్రథమతరంగము, ౨౩.

చరిత్రకారులే జనార్దనాచార్యులెవ్వరో తెలియఁదగియుండును.

పర్వతనాథసూరితమ్ముఁడగు రామపండితుఁడును షడ్దర్శనీపారంగతుఁడు; మహావక్త.

పర్వతనాథసూరిపుత్రుఁడగు ధర్మసుధి (ధర్మసూరి ధర్మాంతర్వాణి ధర్మభట్టు మున్నగునవి యీతని పేళ్లు) సన్న్యాసాశ్రమమును స్వీకరింపక పూర్వము

1. కృష్ణాస్తుతి,
2 బాలభాగవతము (మహాకావ్యము),
3. రవిశతకము

అనుకావ్యములను,

౧. నరకాసురవధము
౨. కంసవధము

అను నాటకములను హంససందేశము ప్రాకృతకావ్యమును, బ్రహ్మసూత్రార్థతరంగిణి (గురువృత్తి) యను బ్రహ్మసూత్రవివరణమును రచించినపిమ్మట సాహిత్యరత్నాకరమును రచించినట్లు తలంపవలసియున్నది.

* * * *

వ్యాఖ్యావిఖ్యాతకీర్తే ర్వివరణగురువా
క్సాంఖ్యముఖ్యాగమానాం
తస్యాఽలంకారశాస్త్రే
..............................

—సా. ర. ప్రథమతరంగము ౩౭.

కావ్యాలంకారకృష్ణాస్తుతిరవిశతకో
న్నాటకాదిప్రణేతు
స్తస్యాఽలంకారశాస్త్రే
..............................

—సా. ర. తృతీయతరంగము ౧౫.

భావ్యరత్నప్రభాటీక సాహిత్యరత్నాకరమునం దెప్పటను పేర్కొనఁబడి యుండకపోవుటవలన నృసింహశాస్త్రిలవారు వ్రాసినట్లు ధర్మసూరి సన్న్యాసాశ్రమమును స్వీకరింపక మున్నే పైగ్రంథములను వ్రాసె ననుటయు సన్న్యసించినపిమ్మట భావ్యరత్నప్రభాటీకను రచించె ననుటయు సముంజసముగా నున్నది.

ధర్మసూరి పూర్వాశ్రమమున రచించిన గ్రంథములను గూర్చి దిక్ప్రదర్శనరూపమున నించుక విశదపఱచుట సముచితమని యెంచి కొంచెము వివరించుచున్నాను.

## కృష్ణాస్తుతి.

ధర్మసూరి కృష్ణాతీరవాసి యగుటవలన కృష్ణాతరంగిణియెడలఁ దనకుఁ గల భక్తిగౌరవములను బ్రకటించుచుఁ గృష్ణాస్తుతిని రచించినట్లు కనఁబడుచున్నది.

కృష్ణా ముష్ణాతు సిష్ణాస్వభిజనవృజినా
　　న్యాశు దుర్వారవారా
వారాశే రాదిదారా రుచిరరుచి రహీ
　　భేనఫేనాచ్ఛఫేనా
శుభ్రాశు భ్రామ్యదూర్మిభ్రమకరమకర
　　గ్రామణీగ్రామసీమా
గాధాగాధారంభోఘోవివరభువి వల
　　ద్గీవరౌఘా వరౌఘా.

—కృష్ణాస్తుతి: సా. ర. ఆఱవతరంగమునం దుదాహృతము.

## బాలభాగవతము.

ఇదియొక మహాకావ్యము. ధర్మసూరి బాలభాగవత మును గూర్చి ఏమియు నెఱుఁగము. నరకాసుర వధావ్యాయోగము ను రచించెను. కావున నే నరకాసురకథా ప్రస్తావనయందు,

"అస్తిఖల్వత్ర తావత్ప్రతినిధ్యంగి సకలతమ
　స్తోమహరిపంథీ నరసూరేర్నరకాసురనిబర్హ
　ణోదాహరణనామా గుణశిరోమణిః ఇత్థమే
　వైతత్కవినా స్వకావ్యే బాలభాగవతే
　వ్యాకీరితమ్

వినింది తాః కేనచ పంకజన్మనా
　　జడేన దోషాకహితా అపి స్వతః
మహోత్తరయో విష్ణుపదస్పృశో బుధైః
　　కళా ఇవ గ్రాహ్యతమాః కళానిధేః"

అని యున్నది. మరియు

నివిశ్య నీరంధ్రనికుంజమధ్యమా
　　సమీ సమీరా స్సహసాసనంభ్రమాః,
న శక్నువం తీహ పునర్వినిర్గమే
　　లతాంగనాలింగనలాలసా ధ్రువమ్.

—సా. ర, ఏడవతరంగమునం దుదాహృతము.

అగస్త్యపండితకృతమగు బాలభాగవత మను కావ్య మింకొకటి గలదు. కంపభూపాలుని భార్య గంగాదేవి రచించిన మధురావిజయమునందు సబహుమానముగఁ జేర్కొనఁబడిన యగస్త్య విశ్వనాథ గంగాధరపండితులు ముగ్గురిలో గంగాధరపండితునికి విశ్వనాథపండితుఁడు కుమారుఁడు. ఈతఁ డగస్త్యపండితుని మేనల్లుఁడు. అగస్త్యుఁడు విజయనగరసామ్రాజ్యాస్థాన పండితుఁడు. ఈతఁడు బాలభారతము రచించినట్లు శ్రీమాన్ కుప్పుస్వామిశాస్త్రిగారు వ్రాసిరి. బాలభాగవతమును గూర్చి శాస్త్రిగారు ప్రశంసింపలేదు. కారణము మృగ్యము. రాజశేఖరకృతమగు బాలభారత నాటకము (రెండంకములు మాత్రము) సుప్రసిద్ధము. అగస్త్యపండితుని బాలభారతము లభింపలేదు.

## రవిశతకము

మయూరమహాకవి తనశరీరపీడ తొలఁగుటకు సూర్యశతకమును రచించి సఫలమనోరథుఁ డైనట్లే ధర్మసూరియు శరీరారోగ్యముకొఱకు రవిశతకమును రచించెనేమోయని తోఁచుచున్నది. రవిశతకమునకు సూర్యశతకమను నామాంతరమును గలదు.

"నాగబంధ స్త్వస్మాభి సూర్యశతకే బింబవర్ణనప్రస్తావే కథితః"

నాగబంధము:—

బింబం ధ్వాంతవ్యథాదం కనకధరశిర
　　శ్చారిశోణద్యుదాత్తం
పద్మార్థప్రేమసోమకుతద ముహుముదః
　　కర్తృకప్యాహహారి,
శేముష్యా దాత్మదైత్యాధిపతుదతులక
　　ర్మామయాధానకల్పాన్యం

ము యోగమార్గమునఁ గైవల్యసిద్ధిని సూచించు నీవే దాంతగ్రంథములోని కథాసారసంగ్రహ మేమనినః—

ద్వాదశాకారచక్రమునం దధివసించియున్న ముక్తికన్యాయుతుఁడగు శివునికడకు జీవుఁడు హంస(ఇది శ్లిష్ట రూపకము) ముఖమున సందేశమును బంపును. ముక్తికన్య తనపరిచారికలగు శాంతిశ్రద్ధాప్రముఖులతో శివసన్నిధి నుండఁగా నప్పటికి జీవునిసందేశమును గొనిపోవు హంసకు షట్చక్రమార్గము వివరింపఁబడినది.

వేంకటనాథకృతము హంససందేశకథాంశము తెలియరాలేదు.

“మమైవ ప్రాకృతభాషావిరచితే హంససందేశే

జాలం సీఆణఅణజుఅళం

లోహిఅం జాలగా అ

కింవా తమ్మం మఅణదహణ

జాళజాలాహిందావా

చిత్తారద్ధే సురఅవిహవ

చుంబణాణం పఅవ

రత్తం కింవా రహుఉఇముహే

పీడీఆరాలఅ'అ.

(ఛాయా)

జాతం సీతానయనయుగళం

లోహితం జాగరాద్వా

కింవా తామ్రం మదనదహన

జ్వాలజాలాభితాపాత్,

చిత్తారబ్ధే సురతవిభవే

చుంబనానాం ప్రభేదే

రక్తం కింవా రఘుపతిముఖే

వీటికారాగయోగాత్.

—సా. ర. రత్నాకరము ౧౬.

నరకాసురవిజయ వ్యాయోగమును రచించిన ధర్మసూరియే వస్తురత్నాకరము అను గ్రంథమును రచించెనని డాక్టరుహూల్జు (Dr. hultzsch) గారు చెప్పుచున్నారని తెలియవచ్చినది. వస్తురత్నాకరము లభించినఁ గాని దానిక ర్తృత్వము స్పష్టపడదు.

బ్రహ్మశ్రీ నృసింహశాస్త్రిలవారు వ్రాసిన వ్యాసములో సాహిత్యరత్నాకరమునందు “నవరసం విద్యానాథాదయ స్సూక్షింధయః” యని ధర్మసూరి వ్రాసెనని యుదాహరించిరి. సాహిత్యరత్నాకరమునందు నా వాక్య మచ్చటను లభింపలేదు.

---

## ని రా శ

దివాకర్ల వేంకటావధానిగారు

(మాతృగుప్తుఁడు విక్రమార్కుని యాస్థానకవి. చాల దరిద్రుఁడు. స్వాతివానకు ముత్యపుఁజిప్పవలె నోరు తెరచికొనియుండుటయే కాని నరపాలునివలన లాభ మించుకయుఁ గలుగలేదు. ఒకనాఁటిరాత్రి భూపాలుఁడు నిద్రించుచున్న గదియందలి దీపము లున్నయు గాలిచే నారిపోఁగా మాతృగుప్తుఁడు వానిని మరల వెలిఁగించెను. ఇంతలో రాజునకు మెలఁకువ వచ్చి ప్రశ్నింప నిదియే సమయమని కవియుఁ దనయవస్థను దెల్పుకొనెను. కాని భూనాథుఁడు మాత్రి మాత్రిపండితులకు సహజభూషణ మని పల్కుటాలకించి యీవలకు వచ్చి కవి యిట్లు చింతించెను.)

అవనీపాలురయందు నెవ్వనికో విద్యాగంధ మొక్కింత పు

ణ్యవశం బై లభియించు వేత్త యగువాఁ డైనన్ సమూలంబుగాఁ

కవితామాధురిఁ గ్రోల నేరఁ డది శక్యం బయ్యె నొక్కండుఁ గా
వ్యవిధాత్మస్థిరగౌరవంబు నొనరింపన్ బోవఁ డేపాపమో ?

ఒలయుఖిలాలాపములఁ ద్రోసివేయుచు విద్వజ్జనుల గౌరవించువాఁడు
పాత్రానుగుణముగాఁ బారితోషికముల నెలమిమై బుధుల కందించువాఁడు
తోఁచిన దిచ్చి సంతోషింపఁజేయుచు యాచకావళికి లే దననివాఁడు
కవితారసమ్ముఁ జక్కనిరీతి గ్రహియింపఁజాలువిద్వత్తఁ జేఁ గ్రాలువాఁడు
విక్రమార్కునిసాటి పృథ్వీశు లెవరు-భాగ్యము ఫలించె నాకు వైభవము గల్గెఁ
దప్ప దని వచ్చినాఁడ నృపాగ్రయాన-నాయనస్థకు మార్పు గన్పడదు సుంత.

ఈనృపాలునివలన నీ కింతయేని-లాభ మది కల్గ దను జనాలాపములను
నరకు సేయకపోయితిఁ జాఁగాలి-మింతకును ముందే చేయి చూపింపఁబడియె.

దాసీజనంబుపైఁ దమిఁ జూడ్కి- నిడఁబోక కలను నృపద్వేషిఁ గలయఁబోక
నృపునమక్షంబున నీచకథ లెన్న కధికప్రసంగంబులందుఁ జొరక
నను విరక్తునిఁ జేయ మొనయుదుష్టుల విన క్షాగ్రహం బించుకే నరయఁబోక
ఆస్థానవిద్వాంసు లన్న నీర్ష్య వహింప కాత్మతిరస్కృతి కవయఁబోక
త్మ్మవిభునిసేవ ద్విగుణితోత్సాహ ముప్పఁ-జేయుచుంటిని గాయంబుఁ జివుకుచుండె
హరిహరీ! నేటి కైనను నరపాలు-మానసం బేనిమిత్తమొ మాఱదయ్యె.

అనిలమే తమకు నాహారంబుగాఁ గల్గు నాగగణంబులు భోగు లనియు
మధురగాన మొనర్పు మధుపాళులు విదల్పుగజముల విస్తీర్ణకర్ణము లని
ఓష్మవికృతి లోన నొప్పారుశబరీభూజములఁ జాలు నుత్కృష్టములు నటంచు
నైశ్వర్యమదమత్తులైన భూపాలుర స్వర్గాధినాథుల సము లటంచు
నజ్ఞులై పల్కెదరు లోకు లదియుఁగాక-మూఢులై భక్తిభావంబు ప్రేమ సుతెత్తెఁ
గొల్చెదరుగాని పరికింపఁ గొంతివడుకు నచటఁ-జేర్పఁబడినగుణాళి కలదె ?

మస్త్రీఁ డేస్మఁడు నన్నుఁ జూచు దయతో మాన్యాగ్ర్యముం బూని స
స్నేహా! లేమియు దూరమై తొలఁగు నేనాఁ డన్న చింతాభర
చ్ఛన్నం బయ్యె మనం బాకించుక భవిష్యత్కాల మేరీతి నె
ట్లున్నన్ బోదు నిరాశయే సుఖద మేమో నాకుఁ జర్చింపఁగన్.

ఇతరభూపాలు రొసఁగినకతిపయ బహు-మానములఁ జూపికొనుచు భూజానికడకు
వచ్చినకవీంద్రు లందఱు నిచ్చకొలఁది-భోగభాగ్యంబులం గొని పోయినారు.

తనజలపాళిఁ గ్రోలి జలదంబులు చండనిదాఘవేళ నా
వెనుక సువృష్టిరూపమునఁ బ్రీతిమెయిన్ జిలికించు నీటిబొ
ట్లను గ్రహియించి మౌక్తికవిలాసము వాని కొసంగుఁ గాని యం
బునిధి స్వకీయవారికణముం గని యాగతి గారవించునే?

అన్యరాజన్యకృతగౌరవాతిశయము-నందఁజాలనివారల నవనిపతులు
కడుఁ దిరస్కారబుద్ధితోఁ గాంచుచుందు-రీనృపుంసేవచే ఫల మేమిగల్గు

కనసగు రాజహాళిపదకంజముసన్నిధి భస్మరాశి త
ద్ఘనవృషవాహనంబు వెనుకం జనఁ గాంచిన మబ్బు భూవరుల్
బనిగొని కొల్చువారో శ్రమ మవార్యము తన్నృపసోపజీవికిన్
గనుచు సపర్యఁ జేయ నధికం బగు సంపద లబ్బు నర్థికిన్.

*     *     *     *     *

ఎంత యోజించుకొన్న నొకించుకైన-దోషభావంబు నాయందుఁ దోఁపదాయెఁ
బ్రీతితో సంతతంబు సేవింపుచుంట-యీనృపాలునకు విరక్తి యెట్టు లొదవె?

నాకన్నన్ మహనీయులౌ బుధులు లేర్ నాకన్న విద్యాయశః
ప్రాకట్యంబున లోఁగువారలకు నీ రాజేంద్రుఁ డిత్యంశను
శ్రీకల్యాణసమృద్ధిఁ గూర్చెఁడె మహాశ్రేయోంతరాయంబుగా
నాకున్ నాగ్రహచారమే యందు భూనాథుండు నిందాస్పదుండే?

అంబుధిలోఁ దరంగ ముదయంబయి తీరముఁ జేరుచుండ ర
త్నంబులుఁ గూడ వెంటఁబడు దానిమహోన్నతిఁ గాంచి భీతి చే
తంబునఁ గ్రమ్మఁ గైకొనఁగ దార్ఢ్యము గాంచఁ డొకండు, దాని క
బ్ధిం బడఁదిట్ట నౌనె ప్రయతింపనిదోషము మీఁద నుండఁగన్.

ఎఱిఁగి భూమీంద్రుఁ డీవలె నెఱుఁగనప్పు-డడిగిననుమాత్ర మిచ్చు భాగ్యం బదెంత
యేల్బడికి నొక్కటే కానిపించుఁ గాని-తిరిపెమున కున్న గ్రామము తఱిఁగిపోవు.

కరఁగదయ్యెను ధారుణీవరునిచిత్త-మింత ప్రయతించినను ఫలహీన మయ్యె
నింక నాశాపిశాచంబు నెడఁద ద్రోసి-యెచటికేనియుఁ బోవుటయే శుభంబు.

---

# కాళిదాసుఁడు—జ్యోతిర్విదాభరణము

సూరి రామసుబ్బరాయశాస్త్రిగారు

శ్రీ కాళిదాసమహాకవివిరచితగ్రంథములు పర్వశాస్త్రములందును గన్పట్టుచున్నవి. కావ్యత్రయమనఁబడు రఘువంశకుమారసంభవమేఘసందేశములను, ఋతుసంహారము, అభిజ్ఞానశాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము అను నాటకములను, నళోదయ మను ప్రబంధమును ఏంద్రానీక మను నలంకారశాస్త్రమును వృత్తరత్నావళి యనుఛందశ్శాస్త్రమును లోలంబరాజీయ మను వైద్యగ్రంథమును, తారావళి, పూర్వోత్తరఖండరూపకకాలామృతము జ్యోతిర్విదాభరణము అను జ్యోతిషగ్రంథములను, శ్రుతికర్మవాద మను ధర్మశాస్త్రమును రచియించె నని తెలియుచున్నది. ఒకానొకసమయంబున గౌతమశిష్యులచేఁ బ్రార్థితుండై వారలకుఁ దన్మహర్షివిరచితతర్కశాస్త్రము నుపదేశించుచు నందు దీకగ్రంథము చేర్చినవాక్యములు దూరవాగ్రాహము లైనను నిప్పటికిని దచ్ఛాస్త్రాభ్యాసకులు కంఠగత మొనర్చుటలు జరుగుచునే ఋషివాక్యములకుసహిత మమ్మహనీయునియందుఁ గల గౌరవము విశద మగుచున్నది. ఈపైగ్రంథములందుఁ గొన్నిటిశైలి విభిన్నముగాఁ గాన్పించుటచే నిరువురు కాళిదాసు లుండవచ్చునని కొందఱూహించుచున్నారు. కాని శ్రీకాళిదాసవిరచితగ్రంథముల నన్నిటిని బరిశీలించినఁ గాని యీ విషయమును దృఢముగా నిరూపించుటకుఁ దగిన యవకాశము లేకుండుటచేఁ బరిశోధకు లీవిషయమునఁ దగు పరిశ్రమఁ జేయుదురుగాక యని హెచ్చరించుచు నిందు "జ్యోతిర్విదాభరణము"ను విమర్శించుచున్నాను.

1. ఈగ్రంథ మీరాజధానియందు ముద్రితమై యుండకపోవుటచేతను, ఇది జ్యోతిషగ్రంథ మగుట చేతను శ్రీకాళిదాసగ్రంథపరిచితుల కనేకులకు నూతనముగాఁ గాన్పింపవచ్చును. కావున దీని విపులముగా విమర్శింప నెంచితిని. ఇది మాళవదేశాధీశ్వరుఁడగు శ్రీవిక్రమాదిత్యునికిఁ గృతి యొసఁగఁబడినది. ఇందు గ్రంథకర్త తా నదివఱలో రఘువంశపూర్వకకావ్యత్రయమును దత్పూర్వముగ శ్రుతికర్మవాదమును రచియించినట్లు దెలిపెను. ఆవిషయములను శ్రీ విక్రమాదిత్యునిఁ గూర్చిన మఱియొకవ్యాసమునఁ దెలిపెదను.

2. రఘువంశాదికావ్యములవలెఁ గాక యీగ్రంథము నారికేళఫలతుల్యవాక్యసమన్వితమై యున్నది. సుఖబోధకాఖ్యవ్యాఖ్యను రచియించి యీగ్రంథసారమును సర్వజనవేద్యముగాఁ జేసిన శ్రీ భావరత్నసుధీయుని పాండిత్యగరిమ మిగులఁ బ్రశంసనీయము. ఇది మౌహూర్తికగ్రంథ మగుటచే నిందు దేయేకార్యాచరణము నం దేయేతిథ్యాదికము లుచితానుచితము లైనవియుఁ జెప్పఁబడినవి. శ్రీ ముచ్చింతలపాటి వేంకటయజ్వవిరచితసంస్కృతవ్యాఖ్యాసమేతమై సర్వజనసుపరిచితమై యున్న "కాలామృత" మను మౌహూర్తికగ్రంథము శార్దూలవృత్తాంచితమై సుబోధశైలియం దున్నది. అందు వివాహోపనయనాదిప్రసంగంబున,

శ్లో. శుక్రార్కేంద్వంగుజవాసరేషు శుభదో మం
దారసౌరౌ గర్హితౌ:

అనియును, ఉపనయనప్రకరణమునందు

శ్లో. శుక్రార్కేంద్వంగుజవాసరే ఉక్తా శశినో ర్వారౌ
ప మధ్యౌ పరౌ:

అనియును జెప్పఁబడియున్నది. ఇందొకశ్లోకమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుసమయంబున రెండవశ్లోకములోని పదములు జ్ఞప్తికి వచ్చుటచే పాఠకులకు తడఁబాటు గల్గుచుండును. కాని జ్యోతిర్విదాభరణపాఠకుల కిట్టి క్లేశము కలుగ నేరదు. ఇది వివిధవృత్తసమన్వితమై యుండుటయే కాక యిందొకపద్యమున నుపయోగింపఁబడినపద మింకొకసమయమున సామాన్యముగా నుపయోగింపఁబడి యుండలేదు. కావున నీగ్రంథ మిట్టిశైలి నందుటకుఁ గారణ మనియుఁ దోఁచుచున్నది, ఇందుల కుదాహరణము—

శ్లో. పర్జన్యర్క్షిశపద్విదుశనసా
మాహు రహోని వరాణ్యభిరూపాః,
విద్యాయా విధుమిహిరదినే వా
రంభే క్వచిదనసౌమ్యఫలేఽస్మిన్.

సాధారణవిద్యారంభమునందు దేవేంద్రసేవిత పాదుండగు బృహస్పతియొక్కయు, బుధునియొక్కయు, శుక్రునియొక్కయు, వారములు వరములని సంహితులు చెప్పుచున్నారు. విధుమిహిరగణములును అనఁగాఁ జంద్రరవివారములును నొకప్పుడు శుభములే యని చెప్పఁబడుచున్నవి.

శ్లో. ద్యునేశశుద్ధిరిత్రితజన్మాంగజాహ్నిప్రబుద్ధా విదోషేణ గాణిత్య మూచుః.—ఇందు గణితశాస్త్రారంభమునందు రవిబుధవారములు శుభములని బుధులు చెప్పిరని తెలుపఁబడినది. రవివారమందనుటకుఁ బూర్వశ్లోకమునందు "ద్యునేశశుద్ధినే" అనియును నీశ్లోకమునందు "మిహిరదినే" అనియుఁ జెప్పఁబడినది. బుధవారమందనుటకుఁ బూర్వశ్లోకమున "విద్దినే" అనియును నీశ్లోకమునందు "అత్రితజన్మాంగజాహ్ని" అనియుఁ జెప్పఁబడినది. ఇట్టివి యిఁక ముం దుదాహరించు శ్లోకములందును గానవగును.—

రవ్యాదిగ్రహములకు మేషాదిరాసులం దుఁగల యాధిపత్యములఁ దెల్పువాక్యములు:—

శ్లో. ఏషాంత్యర్యభయో రసాభవః
భృగుర్గాభశాంక రాహ్వయః
వశాజిహుమయోర్విదశ్వయోఽనుగో
భవతి కర్కిణో భవః—
భగో నఖరహేతినాయ
కశ్శరాసనసనాలయాఖ్యనః
గురుస్తిమిరవైరిణో బుధైస్సదైవ
కలశనక్రభేశ్వరః—

వృశ్చికమేషములకుఁ గుజుఁడును, తులావృషభములకు శుక్రుఁడును, కన్యామిథునములకు బుధుఁడును, కర్కటకమునకుఁ జంద్రుఁడును, సింహమునకు రవియును, ధనుర్మీనములకు గురుఁడును కుంభమకరములకు శనియును నధిపతులగుదురని భావము. ఈశ్లోకములవలన నీగ్రంథశైలి విశదమగుచున్నది. ఈగ్రంథమునందే గ్రంథకర్త తాను రఘువంశాదికావ్యత్రయమును రచియించినట్లు జెప్పియుండెను గావున శైలీభేదముగాఁ గాన్పించుకారణమున నే, కవిభేదమును గల్పించుట యసమంజసము. సంస్కృతవాణిని నిజముఖవాసినిఁ జేసికొని, నిఘంట్వాదుల పరిశ్రమ ప్రాయసామర్థ్యముగల ధీమంతులకు వివిధశైలీసమన్వితగ్రంథరచనము విలాసక్రీడవంటిది. ప్రాథమికులకుఁ బఠనీయములుగ నుద్దేశింపఁబడిన రఘువంశాదికావ్యములును భాషాప్రౌఢులవిమర్శనముల కుద్దేశింపఁబడిన సంగీతాదిప్రబంధగ్రంథములును నొక్కశైలిగం దేల కాన్పింపవలయును?

3. ఈజ్యోతిర్విదాభరణమునందలి ప్రశస్తశ్లోకములవలన శ్రీకాళిదాసుఁడు శివభక్తుఁడని విశదమగుచున్నది:—

శ్లో. శైత్యత్రిపారిజాతసుపరాశిరాద్యై
ర్నత్వోదితం జనకునన్యవహోగసిద్ధ్యై,
గ్రథ్నామ్యహం ననుగిరంశు యదేవ మార్గ్యాం
జ్యోతిర్విదాభరణనామ్ని మహాశ్చ శైవమ్.

కాళిదాసవిరచితమగు 'ఉత్తరకాలామృతము' నందును మంగళాచరణశ్లోకము లిట్లు కాన్పించుచున్నవి:—

శ్లో. శ్రీమద్వక్త్రైకత్రిశద్గణాద్యాసహార
బ్రహ్మేంద్రప్రముఖాద్యనుత్తైః
కార్యారంభేషు సమర్చితపదు
ద్వంద్వం ద్వివేంద్రాననమ్,
నానావిద్యాయుతలక్షకప్రణీత
ధనైశ్చతుర్భ్యస్తుతం
శ్రీమద్వక్రమసూర్యపాలనపరం
వందే భవానీసుతమ్.—

శ్లో. కామేశస్య సునామభాగనిలయాం
భక్తాభీష్టార్థదాం

శంఖం చక్ర మథాఽభయంచ వరదం
హస్తైర్దధానాం శివామ్,
సింహస్థాం శశిఖండమౌళిలసితాం
దేవీం త్రినేత్రోజ్జ్వలాం
శ్రీమద్విక్రమసార్వభౌమపాలనపరాం
వందే మహాకాళికామ్:—

ఇందుచే నీగ్రంథకర్త కేవలము కాళిదాసుఁడే కాక ద్వితీయశ్లోకమునందలి "కామేశస్య సువామభాగ నిలయాం" ఇత్యాదివిశేషణములవలన, రఘువంశాదికావ్యములందుఁ దెలియుకీర్తిని పార్వతీపరమేశ్వరభక్తియుక్తుండనియుఁ దెలియుచున్నది. ఈయుత్తరకాలామృతము పీఠికాపురసంస్థానజ్యోతిర్విద్వాంసులగు శ్రీ వేమూరి సూర్యనారాయణశాస్త్రిలవారిచే నాంధ్రటీకాతాత్పర్య సహితముగాఁ బ్రచురింపఁబడినది. కాని యిది యసమగ్రముగ లభించుటచే నిందు గ్రంథకర్తృనామాదివివరము గపడదు. ఇందలి తృతీయశ్లోకమున:—

శ్లో. ప్రాగేవాస్యదశే సమస్త ముదితం
రాశ్యాదికం విస్తరాత్
జ్ఞేయం జాతకపద్ధతిం
గుణముదేఽథ ప్రాశ్నికంచ క్రమాత్,
స్పష్టం సూక్ష్మతరం త్రికాలఫలదం
శార్దూలవృత్తాంచితం
సంపద్వశ్యకరం ప్రవచ్మి బహుధా
కాలామృతే తూత్తరే.

అని చెప్పఁబడినవిధమున నీగ్రంథ మంతయు శార్దూలవృత్త సమన్వితమై సుబోధకముగ నున్నది. దీనిపూర్వఖండ మింత సులభమగు శైలియం దుండ దని యూహింపఁదగి యున్నది. కాని య దెచ్చటఁ బ్రచారమున నున్నదియుఁ దెలియుటలేదు ఇట్టిమహనీయులచే రచియింపఁబడిన యుత్కృష్టగ్రంథజాల మెంత కాలవాహినీగతమై యుండెనో యని స్ఫురించుచున్నది. భావిపరిశోధకులు లీలోపముఁ బాటింతురుగాక. పరిశోధనఫలితముగ నింక నెన్నిమహోత్కృష్టగ్రంథరాజములు లభింపనున్నవో?

౪. జ్యోతిర్విదాభరణమునందును శ్రీకాళిదాసుని ధర్మకర్మాసక్తి విశదమగుచున్నది. ఇందు "వర్ణాశ్రమధర్మసాధనప్రకరణ" మను నొకయధ్యాయముఁ జేర్చి యందు శ్రీ విక్రమనృపు నిట్లు స్తుతించెను:—

శ్లో. కాంభోజగౌడాంధ్రమాళవముల నానవాః
శ్రీవిక్రమార్కస్య సురాజ్యగౌర్జరాః,
స్వవర్ణధర్మక్రియ యోజ్జ్వలీకృతం
యశోఽభిగాయం త్యధునాఽపి తే జనాః.

కాంభోజ, గౌడ, వంగ, మాళవ సురాష్ట్ర గౌర్జరాదిదేశీయులు, శ్రీవిక్రమచక్రవర్తియొక్క స్వవర్ణధర్మక్రియోజ్జ్వలితయశమును గానము చేయుచున్నారు.

పర్వప్రకరణాంతమునందు:—

శ్లో. పర్వాణ్యమానీహ సదాఽపవర్గనైః
శ్రీవిక్రమార్కేణ దినాధికం ప్రతి,
తద్దోషబోధాయ తథాఽపి సత్కృతా
విదుస్సదా సత్కృతినా హ్యమానిత.

కోవిదుఁడగు విక్రమాదిత్యుఁడు పర్వాదికముల విధానము నెఱింగి తత్సమయములందుక్తవిధమున దానాదికముల నాచరించి విద్వాంసుల సత్కరించుచుండెను.

గృహప్రవేశప్రకరణమునందు:—

శ్లో. అనేకదేవాయతనాని భారతే
కృతాని యేనా ప్తశతోఽధిదేవతః,
సంస్థాపితా దేవవిధానదానతః
శ్రీవిక్రమార్కోఽవనిపో జయత్యపి.

భారతదేశమున ననేకదేవాలయముల నిర్మించి యందు శాస్త్రోక్తవిధానమున దేవతాప్రతిష్ఠాపనములఁ జేయించి యశముఁ గాంచిన విక్రమార్కభూపాలుఁడు ప్రకాశించును గాక.

ఇట్లు విక్రమభూపుని ధర్మకర్మాచరణపరాయణత నభివర్ణించుటచేఁ గాళిదాసుని ధర్మాసక్తియుఁ దెలియుచున్నది. ఇంతియకాక "శ్రుతికర్మవాద" మను గ్రంథమును దా రచియించినట్లును నిందే చెప్పియున్నాఁడు.

౫. కాళిదాసకవిస్వాతంత్ర్యము.—కాళిదాస సమకాలికుఁడును విక్రమభూపసభాసదుఁడును నగు వరాహమిహిరాచార్యుఁడు బృహజ్జాతకమును రచియించుట యందు సేవనీయమున నైన భిన్నమతము లుండు నపుడు వానిఁ దెలిపి యూరకుండుటను గాని విమర్శన పూర్వకముగ నందు సదసత్పక్షనిరూపణముఁ జేయు నని చెప్పెను. కాళిదా సట్లు గాక తనగ్రంథమునందు సత్పక్షమును స్వీకరించుచు నసత్పక్షమును నిరాకరింతు నని యిట్లు చెప్పెను:—

శ్లో. అన్యాయసద్యుక్తివిహీతోద్గమపక్షరాశీన్
వ్యర్థాన్ సహాం విరచయామి పరోక్తియుక్తైః,
మత్వా వరాహమిహిరాదిమతై రనేకైర్
జ్యోతిర్విదాభరణ మప్యనసన్మతార్థమ్.—

వ్యర్థము లగు నసద్యుక్తియుక్తపక్షజాలమును, పరోక్తియుక్తము లగు వరాహమిహిరాదిసత్పక్షసమూహములను జూచి, సన్మతార్థమునకు నీ జ్యోతిర్విదాభరణమును రచియించుచున్నాఁడ నని ప్రతిజ్ఞ యొనర్చెను. అసత్పక్షములుగఁ గాన్పించినచో ఋషిమతము నైనను ఖండించుటకు వెనుదియ్యలేదు. ఇందులకు దృష్టాంతము:—

శ్లో. ఇష్టాతిచారాన్నృపజావివాహే
వివాహతోఽన్యేషు న మంగళేషు
గురో రుదాచేత్యనుగాలనోఽస
త్రిన్వాద్రి [illegible]ద్గతివైకృతం స్యాత్.

గురునిక్రాంతిచారగమనములు వివాహమున నిష్టము లనియుఁ దితరశుభకర్మములం దనిష్టము లనియుఁ జెప్పుగాలవునివాక్యము లసమంజసములు. గురునివలనఁ గలుగు వికారము సర్వశుభకర్మములందును నగును.

శ్లో. భగోడు వాల్మీకి రివాహ సౌమ్యం
సీతా సిషేవే న సుఖం తదూఢా,
శైమీ తథైవాఽభిజిదృక్ష మత్రి
ప్రచాప మాపోడు తదీయ మస్మాత్—

వాల్మీకిమహర్షి పూర్వఫల్గునీనక్షత్రము వివాహమునకు సౌమ్య మని చెప్పెను. కాని యందు వివాహిత యైన సీత యెట్టి సౌఖ్యము నంపలేదు. అట్లే అత్రిమహర్షి సౌమ్య మని చెప్పిన అభిజిన్నక్షత్రమున వివాహిత యైన దమయంతియు నెట్టి సుఖమును నంది యుండలేదు. కావున నా నక్షత్రములు వారిశాపముల నొంది వివాహమున నిషేధింపఁబడుచున్నవి.—

శ్లో. స విశ్వకృ చ్ఛారిచనూతుదాస్రం
బభాణ కశ్చిత్త్రిపహా వేదభేదాత్,
ఫలాన్యభావా దపరాగముఖ్యైర్
ముక్తం తదృక్షం హ్యానుసన్వాగోః

“చిత్రా శ్రవణ ధనిష్ఠాశ్వినీనక్షత్రములు వేదభేదముచే వివాహమున కుచితము లని యొకరనిరి. కాని ఫలరహితము లగుటచే నవి గూడ నిష్పల పర్యజనులచే వర్జింపఁబడుచున్నవి”. ప్రకృతిశాస్త్రములందు సుప్రతిష్ఠ మగు నీజ్యోతిశ్శాస్త్రము ప్రత్యక్షానుభవప్రమాణములచేఁ గ్రమక్రమముగ నెట్లభివృద్ధిఁ గాంచినదియు దీనివలన స్పష్టమగుచున్నది.

శ్లో. నవారిజక్షోభమఘూదుదీరితం
యద్దేవకీ తత్ర నవాసుదేవమూః,
దృష్ట్వా జగన్మంగళకారిణీ తతః
ప్రగర్హ్యణం మూల మిహోచితం స్మృతమ్—

మూలనక్షత్రమునందు వివాహ మైన దేవకీదేవి శ్రీకృష్ణునిఁ గనుటచే జగన్మంగళకారిణి యయ్యెఁ గావునఁ బూర్వము నిషిద్ధ మైనదైనను మూలనక్షత్ర మిపు డుచిత మైనదిగా స్వీకరింపఁబడుచున్నది.

శ్లో. కరగ్రహే చేత్పితృకర్మగర్హితం
కథం తదృక్షం కథితం కలం బుధైః,
దాక్షాయణీ కశ్యపలబ్ధమంగళా
దృష్టేతి సద్వర్గఫలాగ్రతా మఘా.

వివాహమునఁ బితృకర్మ గర్హిత మగుచుండఁ బితృనక్షత్ర మగు మఘ, వివాహమున నేల యంగీకరింపఁ బడినది?—ఆనక్షత్రమునఁ గశ్యపమహర్షికి వివాహ మైన

దాతృదాయిని శుభఫలముల నొందుటచే నదియును స్వీకరింపఁబడుచున్నది. ఈవిషయములు చారిత్రకపరిశోధకులచేఁ బౌర్వాపర్యనిర్ణయమున కుపయోగించు నని తలఁచెదను.

శ్లో. సమస్తకర్మోచితకాలశుద్ధ్యై
గుహ్యే వివాహే మనయాన్వితేఽత్ర,
సహస్రపత్రప్రసవేన తస్మా
దిహాఽపి ముక్తో భువి లోకసంఘైః—

బృహస్పతి యధిదేవతగాఁ గల పుష్యమీ నక్షత్రము సమస్తకర్మలందు నుచిత మని చెప్పఁబడుటచే మనియూగ్నిత మయ్యెను. కావున వివాహమున బ్రహ్మదేవునిచే దూషింపఁబడియె. తత్కారణమున భూమియందు సర్వజనులచే వర్జింపఁబడెను. సమస్తకర్మ చితపుష్యము వివాహమునను, ఈ విషయమున వృత్తి కలుగకుండుటకై యిట్లు చమత్కరింపఁబడెను.—

౬. ఇది జ్యోతిషగ్రంథమైనను నవకాశము కలిగినప్పుడెల్ల నిందును గవిజనచాతుర్యము ననేకవిధములఁ గన్పఱచుచునే వచ్చెను.

శ్లో. అనేకదోషైరపి సౌమ్యయోగో
న హన్యతేఽనేకగుణైః శుభాంగః,
గ్రాహ్యస్తదా దోషగుణా న హైర్గ్య
తిథ్యాదయః స్వస్వహాశ్చ ఖలు వర్జనీయాః—

అనేకదోషములచే నొక సౌమ్యయోగ మైనను ననేకగుణములచే నొకశుభయోగమైనను నష్టిచేయఁబడ నేరదు. కావున, తిథ్యాదులందు చెప్పబడిన దగుణము లని చెప్పఁబడుచున్నవో యవి గ్రహింపఁదగినవి. ఇతరదోషములు వర్జింపఁదగినవి. ఈవిషయమునను విరోధాభిప్రాయములు గలుగఁజేయునట్టులు సోపమానంబుగ క్రిందుశ్లోకములఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. ఏకో గుణో దోషగణం సమేత్య
స్వాహాప్రియం స్వామతి హంతిమంత్రికా,
నిగూహతీవాఽమలగవ్యబిందు
మూర్తిం తదిష్టా బహవో గుణాః స్యుః—

స్వచ్ఛమగు గవ్యబిందు వతిప్రకాశవంతమగు నగ్నిహోత్రమునందు హరించుచందమున నొక్కగుణము దోషగణమునందు హరించుచున్నది. కావున బహుగుణములు వాంఛనీయములు:—

శ్లో. దోషైకదేశో గుణసన్నిపాతి
మతో దహత్యగ్రిన సంశయోఽస్తి,
ధనంజయాంశో వనరాజ్యగోఘ
మిహాఽగ్నికణాంశోఽపి విసర్జనీయః—

అగ్నికణము మహారణ్యమందలి వృక్షసంఘము నంతను దహించు విధంబున దోషైకదేశము గుణసంఘమును నశింపఁజేయు ననుటలో సందియము లేదు. కావున దోషము లేశమైనను వర్జింపఁదగినది. ఈశ్లోకమే ప్రసంగోచితముగ "దోషైకదేశో (దోషోఽపి దోషో-అని పాఠము. భా. సం.) గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అని కుమారసంభవము. భా. సం.) రఘువంశమునందును జెప్పియుండెను.

ఉత్ప్రేక్షాలంకారము:—

శ్లో. నగవపాస్య యయావిహ మనాగో
దవి తుషాగతిచక్షు మధునస్యతః,
తిమిత కారయితుం భువి మంగలం,
నమపదగ్రతిమా స్వపివ గతే.

దేవతలకు దక్షిణాయనము రాత్రియు, నుత్తరాయణము పగలును నగుచున్నది. రాత్రియందు మగు దక్షిణాయనగమనమునఁ గలిగిన పరిశ్రమచేఁ దీడితుఁడైన సూర్యుఁడు భూమియందు మంగళకార్యములఁ జేయింపుటకా యనునట్లు కుబేరదిగ్భాగము వదలుచున్నాఁడు — అనఁగా నుత్తరాయణము శుభకర్మాచరణమునకుఁ బ్రశస్త మని భావము.

౭. అనేకములగు శబ్దాలంకారములుగూడఁ గానవచ్చుచున్నవి:—

శ్లో. నాఽకర్ణ నిద్రామర మేతిహాయనే
పురోఽష్టమే పాణిః పీడయుగ్రహాత్,
నాఽకర్ణ నిద్రామర మేతిహాయనే
పురోఽష్టమే పాణిః పీడయుగ్రహాత్—

ఏడవసంవత్సరమునను ఎనిమిదవసంవత్సరమునను గర్భగ్రహణమువలన నరుఁడు మృత్యువుఁ బొందును. ఇచట "పురోష్ట మేషాయుజే" అనుటలో నెనిమిదవవత్సరమునకుఁ బూర్వవత్సర మగు నేడవవత్సర మని యొక సారియు, నెనిమిదివత్సరములకుఁ బూర్వ మని యొక సారియు సమన్వయింపఁదగి యున్నది.

శ్లో. ద్వేషివిక్రమవినాశగో హరిః
ద్వేషివిక్రమవినాశకృద్భవేత్,
ఆత్రిభస్థితి రభీష్టదోఽత్రిజో
మంగలోఽగ్నిబలగోఽతి మంగలః—

శత్రుస్థానమగు షష్ఠమునందును, విక్రమస్థానమగు తృతీయమునందును, నాశస్థానమగు నష్టమమునందును నుండు సూర్యుఁడు శత్రువిక్రమములు నశింపఁజేయును. త్రిషష్ఠ్యేకాదశస్థానములందుండు చంద్రుఁడు అభీష్టము నిచ్చును. శత్రుస్థానమగు షష్ఠమునను బలస్థానమగు తృతీయమునను నుండు నంగారకుఁడు మంగళము నొసఁగును.—

శ్లో. సమిషే న్యమిషాఽబలావివాహేఽ
నుస్యాగేహిన భోగ మేతి శైష్యమ్,
శుచినే రుచియూర్జమానీ మార్గే
మధుపా సా చ మధౌ సహస్యపస్యౌ.

ఆశ్వయుజమాసమున వివాహ మాడినకన్య భోగము నందఁజాలదు. శ్రావణమాసవివాహముచే గృహముఁ బొందదు. ఆషాఢమున దుఃఖము నొందును. కార్తికమున బలనాశము గల్గును. చైత్రమాసమున మధుపాయిని యగును. మార్గశిర్షమున సస్యహీనురాలగును.—

ఈ. విషయప్రసక్తవాక్యశకల మిం దొకవిశేషాంశమై కన్పట్టుచున్నది.

శ్లో. వరే తథా గూఢపయోధరేందిరే (?)
యమాన్వితుమర్హం త్యజ రాజపంచకే,
లయే రిపౌ చాంగపరాజభార్గవా
నస్తే సమస్తాస్త నిషిద్ధవిద్ధురాన్.

వివాహసమయమున లగ్నమునందు శన్యాదిచతుష్కము నవఁగా శని, రవి, చంద్ర, కుజు లను నష్టమమున చంద్రాదిపంచకమును, నవఁగా చంద్ర, కుజ, బుధ గురు, శుక్ర, శని లను, షష్ఠమున లగ్నాధిప, చంద్ర శుక్రులను, సప్తమమున బుధగురులు గాక తదితరులను వర్జింపవలయును ఈవిషయము కాలామృతాదిగ్రంథములందు ద్విత్ర్యాదిశ్లోకములచేఁ జెప్పఁబడినది. కాని యిందు సులభమార్గముచే గ్రహక్రమమున నొక్కశ్లోకమునఁ దెలుపఁబడినది ఇందుపయోగింపఁబడిన...... "గూఢపయోధరేందిరే" అను సంబోధనవలన వివాహోచితకన్యకయొక్క శరీరపరిజ్ఞానము గోచరమగుచున్నది. వివాహభేదములును దత్తదుచితకాలములు నిందు విశదీకరింపఁబడియేయున్నవి.

శ్లో. అతిమిత్రవశేరిరథస్థితా
నుదయా నాహౌరగా రవేశనే,
నరవత్స్వలవాన్యభాగగా
నభిరూపాస్యథయోగవీక్షణాత్.

మేషాదిరాసులు క్రమముగాఁ జరస్థిరద్విస్వభావము లనఁబడుచున్నవి. అందుఁ జరరాసు లగు మేష కర్కటకతులామకరములును, ద్విస్వభావములందలి మీనమును తొమ్మిదవాంశలును గృహప్రవేశమున నిషేధింపఁబడుచున్నవి. పరిశిష్టరాసులును దదంశలును శుభము లని చెప్పుటకై యిందు 'మీనవర్జితద్విస్వభావములును స్థిరములును శుభము' లని చెప్పి యుత్తరార్ధమున నశుభరాశ్యంశలు దెల్పుటకై చరరాసులయొక్కయు మీనరాశియొక్కయు నంశలు గాక తదితరాంశలు శుభము లని చెప్పెను. ఇట్లు శుభాశుభరాసుల నన్నిటిఁ జెప్పుట యైనది. స్వమతమునకుఁ బ్రామాణ్యము నిరూపించుచున్నాఁడు:—

శ్లో. స్థిరరాస్యుదయే ప్రవేశనం
విషమేతేతి జగాద గాలవః
అపజూకనగోదయే క్వచి
త్పదితీహోభయ మాదృతం మయా.

"స్థిరరాసులందు గృహప్రవేశము చేయఁదగిన దనియు నొకప్పుడు తులావర్జితచరరాసులందును దగు ననియు గాలవుఁడు చెప్పెను. అందు, నేను రెంటిని

నాదరించుచున్నాను"—నరరాసులన మిథున, కన్యా తులాధనుఃకుంభములు. ఇందు కుంభము స్థిరరాశ్యంతర్గతి మగుటచేత, నిందుంచి తులకు విడువంగా నగుమిథున కన్యాధనూరాసులు స్థిరరాసులతోఁ జేరి "అతిమిద్విశరీరభస్థిర"రాసు లగుచున్నవి. ఇట్లు గాలవునిచే ద్వివిధముగఁ జెప్పఁబడిన రాశినామము లన్నియు "అతిమిద్విశరీరభస్థిర"ము లని సూక్ష్మవిధమునఁ జెప్పఁబడినవి. గణితప్రక్రియయందు నుత్తరకాలామృతమునందును నిట్టి లఘుమార్గప్రదర్శనము లద్భుతములై కానవగును. ఈశ్లోకమునందు "ఉభయ మాద్యృశం ముహుః" నాచేనివి రెండును నాదరింపఁబడిన వనుచు, కవి తనస్వాతంత్ర్యము నెట్లుద్ఘాటించుచున్నదియుఁ దెలియుచున్నది.

---

## సంపెఁగ

గోరుగంతు అచ్యుత సూర్యనారాయణశర్మగారు

ఘుమఘుమమనిగారఁ దావులను గ్రుమ్మచు నాసకు విందఁజేసి చి
త్తమున కనిర్వ్యశంబగు ముదంబును గూర్చితి త్రోవఁబోవు వా
రి మనమ్మునైన రాఁబిలిచి ప్రీతిని గూర్చితి, గాన యీ సతుల్
రమణ శిఖావతంసముగ రాజిలఁ జేసిరి నిన్ను సంపెఁగా!

అలరులమిన్న! సంపెఁగ! యొయారముగా నినుఁ గేలఁ బూని, యే
లలితఫలంబు నెమ్మదిఁ దలంపుచు, వాసనఁ జూచినంత, నా
పలుకుల తావి గ్రుమ్మచు విభాసిలు నీ వటంచుగాన నీకు నా
జలరుహసూతి సర్వ్యాల చంపకమం చభిధేయ ముంచెఁ బో!

అలరుల నారితేరి, యనయంబుఁ జెంగగడి దెమ్మొరేఁడు, ని
గ్గలియఁగ రాఁడటంచు మదిఁగాంచఁగఁ గోకు మొకింతఁ జింత నా
యలికుల నేతతోఁ దఁల నందముగా నినుఁ బూనలేదొ? యా
మలినుఁడు జేరకుండు టదె మంచిది నీ సిరి కెల్ల సంపెఁగా!

---

# వ్యాకరణములు

వోలేటి వేంకటసుబ్బారాయశాస్త్రిగారు

పరమేశ్వరునిచే సృజింపఁబడిన జీవరాసులలో మనుజు లగ్రగణ్యులై యున్నారు. అట్టి మనుజులందఱు తమ యభిప్రాయముల బోధించుకొనుటకు భాషయనునది ముఖ్యసాధనమై యున్నది. అభిప్రాయ బోధకమై వ్యక్తధ్వన్యాత్మకము నదియే భాష. అట్టి భాష రాను రాను పరిపుష్టమై వాఙ్మయముగ బరిణమించును. ఆవాఙ్మయమును సాధించుట కుపయోగించునది యే వ్యాకరణము. వ్యాకరణమున ఆయా కాలములందలి సుశబ్దాపశబ్దము లాయా కాలములోని శిష్టవ్యవహారముననే తెలిసికొనుట సుకరమైన పూర్వపూర్వకాలములలోని భాషను, దానిస్వరూపమును మాత్ర ముత్తరోత్తర కాలములందలి వ్యవహారమునుబట్టి తెలిసికొనుట సుకరము కాకుండుటచేతను, వాఙ్మయస్థ భాషయందెట్టి వ్యవహారమునుబట్టి తెలిసికొనుటయు శక్యము కాకుండుటచేత నట్టి పూర్వపూర్వకాలములందలి భాషను, దానిస్వరూపమును, వాఙ్మయస్థ ప్రపంచమును తెలిసికొనుటకు విశేష పరిశ్రమ నొక్కఁడే కాలేకపోవుచుండ, వ్యాకరణకర్త తానట్లు శ్రమించి సంపాదించిన సుజ్ఞానమును పాఠకులకందఱకు సులభముగను నిస్సంశయముగను లభించునట్లు చేయునది యే. భాషలలోఁ బ్రాచీనమైనది గీర్వాణభాష. ఆభాష మొదట నార్యులీదేశమునకు వచ్చినపు డీదేశమున నారంభమై వ్యావహారిక భాష యన బరగుచుఁ బరిపుష్టిని జెందినది. పరిపుష్టమై శిష్టవ్యావహారిక భేదముఁ గాంచిన భాషలో శిష్టభాషతో నార్యులు దేవతాస్తుత్యాదుల జేయుచుండిరి. ఆస్తుత్యాది స్వరూపమే వేదము. ఆవేదమునఁ బ్రాచీనమైనది ఋగ్వేదము. అది రచించుకాలమున వ్యావహారికభాష నుపయోగించు వారలకుఁగూడ నర్థమౌనట్లు శిష్టులు వ్యావహారికముతోఁ గొంచెము భేదముఁగల్గిన శిష్టభాషతో దానిని రచించిరి. ఋగ్వేద రచనాకాలమునుండియే గ్రాంథికవ్యావహారిక భేదమును భాషపొందినది.

వ్యావహారికభాష సహజముగాఁ బరిణామమును బొందుచునే యుండును. రాను రాను వ్యావహారికము ఋగ్వేదభాషతోఁ జాలభేదమును బొందినది. ఆ కాలికులకు ఋగ్వేదభాషయర్థమును దెలిసికొనుట కష్టమగుటచేఁ జాల శ్రమించి శాకల్య శాకటాయన గార్గ్యాదులు పదపాఠము, ప్రాతిశాఖ్యలు మొదలగునవి రచించి భాషకుఁ బ్రకృతి ప్రత్యయవిభాగమును గొంతవఱకుఁ దెల్పిరి. ఆగ్రంథము లిప్పుడు లోపించినవి. అట్టి ప్రాతిశాఖ్యలు లోపించుటచేతనో లేక మఱియే కారణముచేతనో యాస్కుఁడు నిరుక్తమును రచించెను. ఆపిశలికాశ్యపాదులు వ్యాకరణములు రచించిరి గాని యవి లోపించినవి. తరువాతఁ బాణినిమహర్షి తనపూర్వులు రచించిన వ్యాకరణములును సమగ్రములుగ లేకపోవుటచేతను కొన్ని లుప్తవ్యాకరణ గ్రంథములు లభించుటచేతను విపులముగ వ్యాకరణమును రచించెను. ఇతఁడు వ్యాకరణము వ్రాయునపుడు వైదికభాషనే మనస్సున నిడికొని కర్మానరణసమయమం దుపయోగించు శిష్టభాషను గ్రహించి వ్యాకరణము వ్రాసినట్లు తెలియుచున్నది. అంతియకాని వైదిక గ్రాంథిక సాధారణముగ వ్రాసినట్లు తోఁపదు. కర్మానరణసమయమునందు ప్రయుక్తమగు శిష్టభాష కుపయోగించునట్లు పాణిని వ్యాకరణము వ్రాసెననియు, కర్మానరణ సమయముల నాభాష నుచ్చరించినఁ బుణ్యాదులు లభించుననియు, మహాభాష్యకారుఁడు దెలిసియున్నాఁడు. ప్రధానముగ వైదికభాషను సాధించు నుద్దేశ్యము మనస్సున నిడికొనియే పాణిని వ్యాకరణము వ్రాసినట్లు కొంతమంది యాదికునకథ నుదాహరించుచున్నారు.

బ్రహ్మదేవుఁడు తనతండ్రి యగు విష్ణుమూర్తిని "తండ్రీ! నా వేదముల సమగ్రముగ సాధించు వ్యాకరణ మొకటియుఁ గానరాదు. ఇప్పటివారలు కొంతశ్రమపడి యైన నెట్లో సమర్థించుకొన్నను ముందు వారలు తమకు పరియగునర్థము కాకుండుటచే యల్పముగు వ్యాకరణజ్ఞాన

ముచేఁ దప్పులుగ భావింతురు గాన వానిని సమగ్రముగ సాధించు వ్యాకరణమును భూలోకమునఁ బ్రసాదింపు" మని ప్రార్థింప "సరియే! సరస్వతిని భూలోకమున జన్మింపఁజేసి యీశ్వరునిగూర్చి తపముచేయించిన లభ్యమగు" నని చెప్పఁగా సంతసించి సరస్వతిని భూలోకమున వేదముల సమగ్రముగ సాధించు వ్యాకరణముకొఱకై పాణినిగోత్రమున జన్మింపఁజేయ సరస్వతి శివునికొఱకు తపస్సుచేసి ప్రధానముగ వైదికమునకు వ్యాకరణమును రచించెననియు చెప్పుచు యీక్రింది యుదాహరణల నుపష్టంభకములుగ నిచ్చుచున్నారు. ఛందసి, ఆమ్నాయే, నిగమే, మన్త్రే, ఋచి, యజుషి, కాఠకే, సామ్ని, అనర్వణిక సంహితాయాం, బ్రాహ్మణే, ఉపనిషది, అనార్షే, ఇత్యాదు లనేకములు. పైకథయేకాకుండఁగా ఇతఁడు సాధించిన వాఙ్మాలములోఁ జాలభాగము వైదికమే యను విషయము సర్వజనవిదితమే. వైదికశబ్దము లనే ప్రధానముగ సాధించునట్లును లౌకికము నంచె ము సాధించునట్లును, "ఇత్థం లౌకిక శబ్దానాం దిఙ్మాత్ర మిహాదర్శితమ్" అను సిద్ధాన్తకౌముదిలోని కారికవలననే తెలియుచున్నది.

ఈపాణిని చాలశ్రమపడి విపులముగ వ్యాకరణమును వ్రాయుటచేతనే కాఁబోలు, వ్యాకరణాదుల పారాయణకుఁ బుణ్యఫలము తత్తదాచార్యులు కల్పింపసాగిరి. ఇట్టి యభిప్రాయమే శబ్దేందుశేఖరమునఁ జూపబడినది. భాష్యకర్త కొన్ని కొన్నిచోట్ల సూత్ర సూత్రాంశములఁ బ్రత్యాఖ్యానముచేసిన నతఁడు వ్యర్థసూత్రాదులు లేవని చెప్పియుండుటచేత నతని యభిప్రాయానుసారముగ నాప్రత్యాఖ్యాతములగు సూత్రములకుఁ బారాయణఫలమును వైయాకరణులు కల్పించిరి. మహాభాష్యకారుఁడు కూడ "వేదాన్నో వైదికాశ్శబ్దాస్సిద్ధాలోకాచ్చ లౌకికాత్, అనర్థం వ్యాకరణమ్" అని యాక్షేపించి, వ్యాకరణశాస్త్ర పఠనమునకుఁ బ్రయోజనములఁ జెప్పుసందర్భమున వైదికకర్మలం దుచ్చరించుటవలనఁ బుణ్యమును గలిగించునట్టియుఁ బాపమును గూర్పనట్టియు సుశబ్దముల నుపదేశించుట మున్నగునవి వ్యాకరణశాస్త్ర పఠనమునకు ముఖ్యఫలములనియు, నితరములైనవి యానుషంగికములనియు చెప్పెను. "కాని పునశ్శబ్దానుశాసనస్య ప్రయోజనాని...రక్షోహాగమలఘ్వసందేహాః... స్వర్గేలోకే మహీయతే" (భాష్యము) ఇత్యాదులచే వైదికమునందే ప్రయోజనముల నెక్కుడుగ వ్రాసెను. ఇంతియుగాక శాస్త్రమునకు పరమేశ్వరమూలకత్వము నపౌరుషేయత్వము ననాదిత్వమును తత్కర్తకు దివ్యదృష్టి సంపన్నత్వాదులను గల్పించుటయుఁ బురాణయుగము వారి కలవాటు. అట్టి యలవాటుచొప్పుననే పాణినికి సర్వజ్ఞత్వదివ్యదృష్టిసుసంపన్నత్వ యీశ్వరవరలబ్ధ విద్యావైభవత్వాదులను పాణినీయమునకు పరమేశ్వరమూలకత్వాదులను గల్పించిరి. మఱియు పాణినీయమే యాదియనియు, పాణిని దివ్యజ్ఞాన తపోమహిమాదులచేత క్రొత్తగా లోకమున వ్యాకరణము నవతరింపఁజేసెననియు నుడివిరి. అది యుక్తముగా నున్నట్లు తోఁపదు. పాణినికంటె పూర్వమున వ్యాకరణములుండుటచే వ్యాకరణము క్రొత్తగా నవతరింపఁజేసినవాఁడు పాణినియనిన నేకేని నమ్మగలరా? ఆయా వ్యాకరణములఁ జదివి గొప్పపాండిత్యమును సంపాదించి విపులమగు వ్యాకరణమును వ్రాసెనే గాని యపూర్వమైనది కాదనియు, నితనికి పూర్వమున శాకల్యశాకటాయన గార్గ్యాదు లనేకులు వైయాకరణులుండినట్లు పాణినియే తెలియఁజేసెననియు, కావున నిది యే క్రొత్తదిగాదనియు విమర్శకులయాశయము. మఱియు పాణినిగ్రంథములోని కొన్నితల భాష్యవార్త్తిక కాశికాకారాదులు పూరించుటచేతను, నింకను వాఙ్మయపారజ్ఞులు పూర్తిచేయవలసి యుండుటచేతను, పాణినికి సర్వజ్ఞత్వ దివ్యదృష్టి సంపన్నత్వాదులు గల్పించుట యుక్తమా? యనియు, వ్యాకరణశాస్త్రజ్ఞుల కీవిషయము బాగుగా తెలియుననియు, అష్టాధ్యాయికి వేదాంగత్వము చెప్పుట యుక్తము కాదనియు నుడివిరి. కాని కొందఱు పాణినికి సర్వజ్ఞత్వాదుల నీక్రింది విధముగ నిలుపుచున్నారు.

పాణిని దివ్యదృష్టికలవాఁడనియుఁ, దనకు పూర్వమందున్న భాషను సమర్థించెననియు, ముందు ప్రయోగింపబడు భాషను వార్త్తికకారాదులు సమర్థించెదరని తెలిసికొని ముందురాబోవు భాషను సమర్థింపలేదనియుఁ జెప్పుచున్నారు. తనకుఁ బూర్వమందున్న భాషనుగూడ

నతఁడు సమర్థింపకపోవుటచే పైవాక్యము యుక్తిబాహ్యముగనున్నది. ఒకటిరెండు ప్రయోగములున్నచో నతని ప్రయోగముచేతనే సాధువులని చెప్పిన నొకసంధినే వదలినచో నతఁడు దానివిషయమున పొరపాటు పడినాఁడని చెప్పకతప్పదు. చూడుఁడు. కులటాశబ్దమును తనసూత్రమున (కులటాయావా) ప్రయోగించినాఁడు అతనిసూత్రములచే కులటాశబ్దము సాధింపఁబడదు. అతనికి పూర్వమీశబ్దము లేదనుటకు వీలులేదు. పూర్వమందున్నదిగాన నితఁడు ప్రయోగించియున్నాఁడు. దాని నేదియోరీతిని మనవైయాకరణులు సమర్థించుచున్నారు. "అతఏవనిపాతనాత్సాధుః" అనియో, "పృషోదరాదిత్వాత్సాధుః" అనియో చెప్పుచు సమర్థించుచున్నారు; కాని యిట్టి యుదాహరణలకై పరరూపసంధి తాను చెప్పవలయును. అట్టిది లేకపోవుటచేతనే "శకన్ధ్వాదిషు పరరూపంవాచ్యమ్" అనునది వెలువడినది. ఆపరరూపసంధి చేయవలసిన ప్రయోగము నొకదానిని పాణినిచేసిన నెట్లో సమర్థించినను "సర్వత్రలోహితాదికతన్తేభ్యః" "ప్రోపాభ్యాం సమర్థాభ్యాం" ఇత్యాదుల నెన్నిటినో యట్లు సమర్థించుట యుక్తముకాదనియు, పరరూపసంధిని వదలివేయుట బాగులేదనియు చెప్పకతప్పదు. ఇంకనెన్నియో కన్యాశబ్దాదులుగా సమర్థింపఁబడనివియున్నవి. ఇదియును గాక తన పూర్వమందున్న రామాయణాదుల భాషను కూడ సమర్థింపలేదు. అనేక ప్రయోగములుసాధింపనివే యున్నవి. ఆదికావ్యమును, తనకు పూర్వమందున్న వాఙ్మయములో నగ్రగణ్యమును నగు దాని భాషను సమర్థింపకపోవుట కదియేమి విషమిడెనా? లేక దానియందు శత్రుత్వమా? కాబట్టి యీ పాణినిమహర్షి చాలశ్రమపడి వ్యాకరణమును వ్రాసెననుట కెవ్విధమైన యభ్యంతరము లేదనియు, నితఁడు వైదికమును సాధించు నుద్దేశ్యముతో సమగ్రముగ లౌకికమును సాధింపలేదనియు, తాసాధించిన లౌకికమునుకూడ కర్మాచరణసమయమున నుపయోగింప చాలవరకు నుపయుక్తమగుదానినే సాధించెననియు, నందుచే లౌకికమునకు సమగ్రమగు వ్యాకరణము లేదనియు చెప్పకతప్పదని కొందఱి యాశయము. పాణినిమహర్షి తరువాత వార్తికకారుఁడగు వరరుచి, పాణినితరువాత పరిణామముబొందిన భాషను సమర్థింపఁబూనుకొని నాల్గువేల సూత్రములకు సుమారు పదివేనువందల వార్తికముల రచించి యప్పటిభాషను సమర్థించెను. ఇతఁడు వ్యాకరణమున పూర్వపుభాషను సమర్థించుటయే యనుకొని తానట్లుచేసియున్నాఁడు. వార్తికకారుని తరువాతనున్న వాఙ్మయమును సాధించు భాష్యకారుఁడు కూడ పైయభిప్రాయమునే తలంచెనని చెప్పుటకు సందేహము లేదు. వీరికాలములనున్న వాఙ్మయమును వీరు సాధించుటచేతను, వీరికాలమున నశించిన ప్రయోగములకు ఉపయోగించు సూత్రములనవసరములని ప్రత్యాఖ్యానము చేయుటచేతను వారు వాఙ్మయమును సమర్థించుటయే వ్యాకరణమునకు ఫలమని తలంచిరని చెప్పుట నిర్వివాదము కాని వారు పాణినియందు భక్త్యతిశయముగలవారైన ననవసరములగు విషయముల ఖండించి వారిమతమును నిలబెట్టుకొనుటచేతను "యథోత్తరం మునీనాంప్రామాణ్యమ్" అనిచెప్పి పాణిని మతముకన్న తదుత్తరులగు వరరుచి భాష్యకారుల మతమునకే ప్రాధాన్య మితర వైయాకరణు లిచ్చుటచేతను, వైయాకరణులే పాణినియందు గొంతవర కరుచిని జూపిరనుటకు సంశయములేదు.

ఈమునిత్రయము తరువాత చాలమంది వ్యాకరణగ్రంథముల నెన్నిటినో వ్రాసిరి. కాని వారు వారికాలమందున్న వాఙ్మయమును సమర్థింపకపోవుటయే గాక వ్యాకరణమున శాస్త్రార్థయుక్తమగు నదియేయని తలంచి యుక్తిపై యుక్తులతో గ్రంథముల వ్రాసిరి. ఇట్లు వ్రాసినవారిలో భట్టోజిదీక్షితులు మాత్రము దుర్గ్రాహ్యమగు నష్టాధ్యాయికి "సిద్ధాన్తకౌముది" యను పేర సుబోధమగునట్లు వృత్తిరచించెను. అతఁడుగూడ మునిత్రయము సమర్థింపనిభాష సమర్థింపఁగూడదని తలంచెనని చెప్పుటకు సందేహములేదు. వ్యాకరణమున పై వారలే యభిప్రాయమునుపడిరో యితఁడు నట్లే యనుకొనెను.

మహాకవులెన్నియో సహజపరిణామమును బొంది నరూపముల నుపయోగించిరి, వారుకూడ శిష్టులే: పాణి

నుగుణముగ నాచ్ఛికముల సంస్కరించుకొందురను నూహచే ఆ విషయమున నెక్కువగ ప్రసంగింపలేదు. ఈవిషయమునే "సిద్ధిర్లోకాద్దృశ్యా" అను సూత్రము చెప్పుచున్నది. కాని సంస్కృతశబ్దముల తెనుఁగున నెటులు ప్రవేశపెట్టుకొనవలెయునో యను విషయమును విపులముగఁ జర్చించినాఁడు. సంస్కృతవ్యాకరణమునకు పాణిని యెట్టివాఁడో తెనుఁగునకితఁడట్టివాఁడు. ఇతఁడు సంస్కృతభాషతో "ఆంధ్రశబ్దచింతామణి" యను నాంధ్రవ్యాకరణమును రచించెను. ఇతనికాలపువారు తెనుఁగునం దభిరుచికలవారు కాకపోవుటచేతనే యిటుల జేసెనని యందురు. ఇతఁడు సంస్కృతవ్యాకరణవాసనావాసితుఁడగుటం జేసి సంస్కృతవ్యాకరణసూత్రముల తన యాంధ్రవ్యాకరణమున నెక్కుడుగ వాడియున్నాఁడు తెనుఁగునలేని సుప్రత్యయముల కొన్నిటికి చెప్పి లోపము విధించియుండుట సంస్కృతవాసన యెక్కుడుగ నున్నదని తోఁపకమానదు. "అనుతాం స్త్రియాం సమానాం స్త్రీమస్యచసులోపః" అని చెప్పియున్నాఁడు. "ద్విత్వస్యదీర్ఘతో బహుళమ్" "లుక్‌సంశ్లేషోనాచి" "కర్మప్రవచనీయాశ్చ" "అన్యతరస్యాం" "వా" ఇత్యాదులనేకములు సంస్కృతవాసన యెక్కుడుగనున్నదని నిరూపించుచున్నవి.

ఇతఁడు తత్పూర్వపుగ్రంథములు లభింపమి భాషాస్వరూపమును దెలిసికొనుట దుర్ఘటమైనను తద్విషయమున నెక్కువపరిశ్రమచేసి యాంధ్రవ్యాకరణముగ రచించి మందు వారల కుపకృతి గావించినవాఁడు.

ఇతనితరువాత తెనుఁగును కొంతవరకు సంస్కరించుమనూహచే కేతన "ఆంధ్రభాషాభూషణ" మనుదానిని రచించెను. అదియు సమగ్రవ్యాకరణము కాకపోవుటచే తరువాత అథర్వణుఁడు "వికృతివివేక" మను నథర్వణకారికావళిని రచించెను. ఇతఁడు కొంతవరకు శబ్దచింతామణిలోని నిరూపితములగు, వా, హి, మొదలగు వానిచే వివరించి పెక్కింటిని సాధించినాఁడు. తరువాత నహోబలుఁడు "అహోబలపండితీయ" మను పేర వ్యాకరణము రచించెను. ఇతఁడు చింతామణిని యథర్వణునికన్న నెక్కువగ వివరించెను. నన్నయ ప్రథమాచార్యుఁడనియు, నథర్వణుఁడు ద్వితీయాచార్యుఁడనియు, తాను పతంజలిననియు, నితఁడభిప్రాయపడినట్లు యితని వ్రాతలఁబట్టి తెలిసికొనవచ్చును. తెలుఁగపభ్రంశమనువలె నీపండితుఁడు తెనుఁగుభాషయు, సంస్కృతము వలె వ్యక్తిత్వముకలదని నిరూపించుటకు చాల ప్రయత్నించినాఁడు. ఇతఁడు చాలరూపములఁ జక్కగ సాధించినాఁడు. కాని కొన్నికొన్నిటసాంకర్యము మాపింపకపోలేదు. ఉదా: కలకంఠులు. ఇది గ్రామ్యశబ్దము. రెండు స్త్రీసమశబ్దములకే బహువ్రీహిసమాసమని పూర్వాంధ్రవైయాకరణుల నిర్ణయము. ఇంకొకటి స్త్రీసమము. రెండవది తత్సమము. రెంటికిగలిపిన సమాసము నితఁడు మిశ్రబహువ్రీహియని సమర్థించుచు, కలకంఠశబ్దములోని నకారము సమాసాంతప్రత్యయముగ నంగీకరింపవలెనని వ్రాసినాఁడు. ఒక్కపదమునకై మిశ్రబహువ్రీహినంగీకరించుట, నకారము సమాసాంతప్రత్యయమని యంగీకరించుటకన్న, చిన్నయసూరివలె నీపదము నన్యగ్రామ్యమని యంగీకరించిన బాగుండెడిది. ఇతని తరువాత తిమ్మకవి, సూరకవి, మున్నగువారలు కొన్ని లక్షణగ్రంథములఁ బద్యరూపముగ వ్రాసిరిగాని యవి సమగ్రములుగాను, సుబోధములుగాను లేవు.

తరువాత వ్యాకరణమును జక్కనిశైలితో బాలావబోధముగ రచించినవాఁడు చిన్నయసూరి. ఇతని సూత్రములు సంగ్రహముగానుండి నాగరకానుకూలముగ నుండును. ఇతఁడు సంస్కృతవ్యాకరణముల బాగుగఁ జదివినవాఁడగుటచే నెక్కుడుగ సంస్కృతవ్యాకరణములలోని తనవ్యాకరణమును సాగించెను. "ప్రత్యాహారము, ఇత్సంజ్ఞ, స్థానివద్భావము, బహుళగ్రహణములు, విభాషలు, అధికారసూత్రములు, సంప్రదానాది సంజ్ఞలు ప్రాయికగ్రహణములు" మొదలగువాని నితఁడు తన వ్యాకరణమున నెక్కుడుముగ వాడియున్నాఁడు.

ఇతఁడొకనియమముతో వ్యాకరణము రచించినట్లు కాన్పడదు. కేవలభారతకవుల ప్రయోగములనే సాధింతుననునూహతో నీవ్యాకరణమును రచించెనందమా? యందలి "ఎంతగుణములు" "నూరేసి" "కావ్యసంప్ర

యోగము పొందెన్" "పుచ్చికోలు" మొదలగు ప్రయోగముల సాధించినట్లు కాన్పడదు. అట్లు కాదు, 16 వ శతాబ్దమునకు గల సుప్రసిద్ధకవుల ప్రయోగముల సాధింపదలంచితనికిగల దండమా? శ్రీనాథుని "యెల్లన్ శిష్యులతోడ" ఇత్యాదులు సాధింపఁబడవు. 16 వ శతాబ్దమువరకు నున్న కవులప్రయోగముల సాధించుతలంపు లేదందమా? "ఏకాంతమునందు నున్న జవరాండ్ర"నని పెద్దనార్యునిపద్యము నుదాహరించి జవ్వనశబ్దమునకు జవాదేశము విధించును.

తరువాత నాంధ్రమున కించుమించుగ సమగ్రవ్యాకరణరచనకు ప్రయత్నించినవారు బ. సీతారామాచార్యులుగారు. వీరి వ్యాకృతి "త్రిలింగలక్షణశేషము" ఇందు చిన్నయసూరి సాధింపని ప్రయోగము లెన్నియో సాధింపఁబడెను. మఱియు సూరిసూత్రములకు కొన్ని సవరణలను, కొన్ని వివరణలను నీయడు చేసియున్నాఁడు. ఏపూర్వాంధ్ర వైయాకరణులు రచింపని వాక్యపరిచ్ఛేదమొకటి రచించి వన్నెగాంచెను. వ్యాకరణరచనలో నీతనిమార్గ మభినందనీయము. సంస్కృతాదివ్యాకరణకర్తలుగాని తెలుఁగువ్యాకరణకర్తలు గాని యింతటి ప్రయోగదృష్టితో వ్యాకృతులు రచింపలేదని నొక్కి నక్కాణింపవచ్చును. ఈతని వ్యాకరణమును కొన్ని భారతప్రయోగములను, కొన్ని యితరకవిప్రయోగములను సాధింపలేదు. "నూఁకెసి" "నోంచినావు" ఇత్యాదులసాధితములు. కాని యయ్యవియు నంత్యలగుటచేఁ గొంత వర కాంధ్రమున కిదియే సమగ్రవ్యాకరణమని చెప్పనొప్పును. తరువాత క్రొత్తపోకడలతో విపులవ్యాకరణమును రచించినవారు మ. సూర్యనారాయణశాస్త్రిగారు. వీరి వ్యాకృతి "సూర్యనారాయణీయ" మను నాంధ్రభాషానుశాసనము.

ఇట్టి వ్యాకరణములు కొన్ని యసమగ్రములై, కొన్ని సమగ్రాసమగ్రములై యున్నవి.

సంస్కృతమున నూతనగ్రంథములు విశేషముగ బయలువెడలకుండుటను, సంస్కృతము వ్యవహారభ్రష్టమగుటచే భాష మారకుండుటను గాన పూర్వమందున్న భాషనంతయు సమగ్రముగ సాధింపవీలగుటను, సంస్కృతమునకు లక్ష్యలక్షణయుక్తముగ సమగ్రవ్యాకరణము నేమహాభాగుఁడేని రచించుట యావశ్యకము. అట్టిది బయలువెడలినచో తిరుగ వ్యాకరణము రచింప నవసరముండదు. రచించు వ్యాకరణము "త్రిలింగలక్షణశేషము"నట్లె లక్షణమునకు లక్ష్యము నిచ్చుచుండవలయును. ఆరీతిని వ్యాకరణమున్నచో చాల బాగుండును. ఇటులనే ప్రాకృతమునకు సమగ్రవ్యాకరణము రచించుట చాల యావశ్యకము. తెనుఁగునఁ గూడ కొన్ని పూర్వకవుల ప్రయోగములు మిగిలిపోవుచేతను, ప్రబలవ్యవహారములలో నున్న కొన్ని పదములు సాధింపవలసియుండుటచేత నింకొక విపులవ్యాకరణము రచించిన బాగుండును.

కాఁబట్టి యిట్టి వ్యాకరణరచనకు నే మహారాజులో, యూనివర్సిటీలో పండిత ప్రకాండుల తమరీతి ప్రోత్సహించి సంస్కృత ప్రాకృతాంధ్రవాఙ్మయమునకు మహోపకారము నర్చి లోకవ్యుత్పత్తిని నుద్ధరించి వారి కృతజ్ఞతకు పాత్రులయ్యెదరుగాక యని విశ్వసించుచున్నాను.

# లోకబాంధవుఁడు

జి. జాషువకవిగారు

ఆది, గమన ప్రవాహావిచ్ఛిన్నాంతరమున - నశుభదేవత, జీవుల నాహరింపఁ
బ్రకృతినిం డాగి, యూర్ధ్వగహ్వరము లిచ్చి - తాండవించెడు, మట్టమధ్యాహ్నవేళ.
అది, భయంకరమృత్యుదంష్ట్రాగ్నిరాశి - జనితవిషవహ్ని మెరసిపోయినప్రదేశ
మది, విషాదనిబిడవ్యాప్తితాంబరమునఁ - బ్రభవమందిన పిడుగులువడిన తావు.

మృగతృష్ణల్ బాగడుమ్ముల్లో మెరసి భూమిమంటలిన్ గ్రమ్మి, పై
కెగసెన్, నాల్కలుముద్దగట్టుకొనిపోయెన్, జీవులెల్లాడె, వి
హ్వగరేగెన్ వగుడాకుతోడ సుడిగాడ్పుంధయ్యముల్, ప్రొద్దుకున్
బాగరెక్కెన్, బదరెండుగొట్టినపు డెంతన్ గంట లుత్కంఠతన్.

గుబురగొనియున్న తింత్రిణీకుజములందు - నాకుగొమగుంపుపేటల నధివసించి,
పులుఁగుపిట్టలు, గుసగుస లొవ్వుచుండె-మండుసుడిగాడ్పు టురవడి కులికిపడుచు.

సవితృమండలకిరణఘూర్ణనమువలనఁ - బ్రస్థికాయలు చిటపట బగులుచుండె
'టింగు'మనుమింటికెగసి యేలేటంచెట్టు - ఝూయ్యనేయుచు నొగిపల్లటీలుగొట్టు.

గాలిఁదను ముక్కలిబ్బరకస్త్రమలని - నెక్కి, శరవేగమున నీటికేగునేడ్కఁ
బయన మొనరించినను అస్పాటులోనఁ-దాకె, మరపించిదుష్ప్రమాదము పిశాచి.

రబ్బరుబంతికొమ్మలు నిటంబులుజారెను, దృష్టి నష్టమై
మబ్బులుగ్రమ్మె, నాడట ప్రమాదమెఱుంగను గాని లేచినా
జబ్బనసప్తలోకములు సాగరముల్ మరిముల్ విపద్ధ్వనుల్
గబ్బటిలన్ గ్రహింపఁ దిరి, దగ్గుప్పకే, దయ్యము లీనుచోటునన్.

యోచనాశూన్యమై, బాధయో! భయంబో! -యనుభవించెడు,నాహృదయమున సోకె
"అయ్యయో!" యనుకరుణ కిలాపపలుకు - కుటిలతీక్ష్ణాతపమునఁ జీల్చుకొనుచువచ్చి.

అదియొక దేవమాతపలుకా! యని కొంచెము నిబ్బరించి, క
న్నుదెఱచి చూచినాఁడ నొకనూతనపాంథుని కేమిచెప్ప, నా
సదయుఁడు ఆమ్మగొట్టుకొనసాగెఁ బదింపదమాటలేం? నా
కొదవినకష్ట మచ్చునడియున్నది నాని ముఖాంబుజంబునన్.

కిరణములతోడ ననుఁగంటగించిచూచు - తరణి కెపఁడిచ్చె లోకబాంధవసమాఖ్య
ఇరులబాధలు గని గుండెకరఁగి వగచు - పాంథ! నీవయ్యా! ముల్లోకబాంధవుఁడవు.

---

కళానుభవమున కేదియాధారము ? ఒకపద్యము పఠించి, ఒకబొమ్మనుచూచి, ఒకపాటవిని మానవు లెట్లానందించుచున్నారు. వానిలో మానవునాకర్షించు విపరీతాంశమేది? అది స్వరకల్పనలో నున్నదా? అనియే మనవితర్కము. మున్ముందు చిత్రకళ తీసుకొందాము. కళలన్నిటిలోను చిత్రకళ సుగ్రహము. చిత్రకారుడు గౌతమీతరంగములపై నస్తమించుచున్న సూర్యుని రాగచ్ఛాయలో, నీలిసంద్రముపై ఝంఝామారుతి మొనరించు వికట తాండవమో శరచ్చంద్రచంద్రికలోని మాతృస్తన్యము గ్రోలుచున్న వత్సమో, తన్ను వేశ్యయై వచ్చినా చిన్న తనము నుండి నిజసౌందర్యమును తటాకములో తొంగిచూచుకొను నవకుసుమమునో చూచి ఒక వింతరకపు ఆనందము ననుభవించి బొమ్మ వ్రాస్తాడు. ఎందుకని అడిగితే నే చాలామంది ఆదృశ్యమును చూచి ఆ "వింత రకపు" ఆనందము పొందలేకపోయినా? ఇది మనస్సులో నుంచుకొంటే కళ ఎలాగు నానందదాయక మౌతుందో బోధపడుతుంది. పైన చెప్పిన చిత్రకారుడు వ్రాసినబొమ్మను మనము చూస్తాము అప్పుడు నిజచిత్రమును చూచినప్పుడతనికెట్లో అట్లే ప్రతికృతి చూచిన మనకే ఆనందము వస్తుంది. కళాకారుడు ప్రకృతిచూచినప్పుడు పొందిన ఆనందమే ప్రతికృతి చూచినమనలో పుట్టడమే కళానుభవము. దీనిని సంగీతానికి వర్తింతాము. గాయకుడు ఆనంద తన్మయావస్థలలో సుందరముగా గానము చేయును. పురాణశ్రీయము నుత్సాహముతో చెప్పినాడు త్యాగరాజు పెక్కుకీర్తనలు. రామదాసు బందిఖానా బాధలతో, కబీరు ప్రబోధానందముతో, ఇట్లే పలుకుచు. రూపరహితమైన అంతరోత్సాహము అందరియందును ఒక్కటే. నాదము దానికి దగ్గరి చిహ్నము. అందువల్ల పైన చెప్పిన యుత్సాహము నాదరూపమున వ్యక్తమౌతుంది మొట్ట మొదట. ఇట్లు వ్యక్తమైనది విన్నప్పుడు—ఏడ్పువిన్నప్పుడు కొందరికి కన్నీళ్లు వచ్చినట్లు—మనకు, కర్తకు జనించి పోషించిన ఊహలో ఉత్సాహంలో—ఏవైతే అవే—కలుగుతాయి. తయారయినవాడు కాబట్టి ఆఊహలు కర్తచేత పాడించాయి. శ్రోత అంత పరిపక్వదశలో లేకపోతే అతనిచేత పాడించకపోయినా లోపల తహతహ పుట్టిస్తాయి. ఇదే ఆనందానుభవము, కళానుభవము, ఆలంకారికుల భాషలో రసానుభవము. గాయకుడు భావోద్బోధనచే పాడితేనే గాని అతడు వెలువరించేపాటకు భావోద్బోధన చేసేశక్తి యుండదు. ఒక ఉత్సాహమును వెలువరించుటకు—ను స్ఫూర్తిపట్టినప్పుడు పుట్టేఉత్సాహముతప్ప స్వరకల్పన చేసితినని యేగాయకు డంటాడో అవమనంది. ఏకకో శేటప్పుడు మేకఅరిచే అఱుపులో తుపాను లున్నాయి. నట్టడవిలో విడువనున్న పతియాజ్ఞ విన్నప్పుడు సీతపలికిన మాటలలో బల్లెములున్నవి. అంటే, నాదము, శబ్దము వేర్వేరుగా "తహతహ" పుట్టించగలవు. రెండూ కలిపితే రసాభాసము. శబ్దము, నాదము, రంగు, గీత చిహ్నములనీ, వీటి నుపయోగించడమువల్ల కవిత, సంగీతము, చిత్రకళ మొదలైన లలిత కళ లుత్పన్నము లయినవి. అవి యిదివరకు వ్యాసములలో వివరించుకున్నాను. రెంటిం రెండు కలిపితే ఏదీ వ్యక్తము కాదు. స్వరకల్పనలో, భావ, నాదము చిత్తము వచ్చిన పాళ్లలో కలుస్తాయి. అందువలన అంతరోత్సాహము నకు స్వరకల్పనవాహకము కానేరదు. కాబట్టి గతించిన గాయకులు స్వరకల్పన బాగాపాడేవారన్న విమర్శకశిఖామణు లసత్యవాదులనుట కెంతమాత్రము సందేహము లేదు. ఈమాట నొప్పించనేని తమపల్కుల సత్యము నిర్ధారణచేసుకొందురు గాక !

---

# పెలియాజ్ మెలిజాండాలు

దేశరాజు రామదాసుగారు

(వెనుకటిసంచిక తరువాయి)

అంకము ౪.

రంగము ౧.

కోటలో నౌకదారి

(ప్రవేశము. పెలియాజ్ మెలిజాండా లొకరి నొకరు కలుసుకుందురు.)

పెలియాజ్—ఎక్కడికి వెళ్లుతున్నావు? ఈ సాయంత్రము నీతో మాట్లాడాలని వుంది. నన్ను కలుస్తావా?

మెలిజాండా—అలాగే.

పెలియాజ్—నేనిప్పుడే మాతండ్రిగదినుండి వస్తున్నాను. అతనికిప్పుడు కొంచము నయముగా నుంది. వైద్యుడు జడవవలసిన అవస్థ దాటిపోయిందని చెప్పేడు. అయినప్పటికీ యీవుదయం నాకొకశకునం కనిపించింది: ఈ రోజు విచారకరంగా ముగుస్తుందని. కొంతకాలంనుండి దురదృష్టదేవత నాచెవులలో విరామంలేకుండా రొద చేస్తున్నాది...అప్పుడు హటాత్తుగా నొకమార్పొచ్చింది. నేడో రేపో రావలసిందే—ఇప్పు డతడున్నగది కిటికీతలుపులన్నీ తెరిచారు. అతడు మాట్లాడుతున్నాడు. కులాసాగానున్నాడు. ఇంకా మనలాగ మాట్లాడలేదు. కాని యిప్పు డతని యూహాలన్నీ వేరేప్రపంచంనుంచి వచ్చినట్టుండవు...ఇప్పుడు నన్ను పోల్చుతున్నాడు. నాచెయ్యిపట్టుకొని, వ్యాధివచ్చినప్పటినుంచి అభ్యాసపడిన ఒక వింతచూపుతో నావైపుచూచి, "నువ్వేనా పెలియాజ్? ఇదివరకు నే నెప్పుడు చూడలేదు. నీముఖంలో చాల కాలం జీవింపనివానివలె, విచారయుక్తమైన దయారసము లుట్టుతూవున్నది. నువ్వు విదేశయాత్రచెయ్యాలి." అన్నాడు....చాల అద్భుతంగానుంది. నేను అతనిఆజ్ఞ పాలిస్తాను......మాఅమ్మకూడావింటున్నాది. ఆనందబాష్పములుకార్చింది.—నీకుకనబడలేదూ? ఇంటికంతటికీ తిరిగీ ప్రాణంవచ్చినట్టుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసముల ధ్వని, మాటలశబ్దము, అడుగులసద్దు వినబడుతున్నది... విను, ఆతలుపువెనుక నాకు కంఠస్వరములు వినబడుతున్నాయి. త్వరపడు; త్వరపడు. నాకేదో ప్రత్యుత్తరముచెప్పు. మనమిద్దర మెక్కడకలుద్దాము?

మెలిజాండా—నీ కెక్కడ ఇష్టము?

పెలియాజ్—ఉద్యానవనములో గ్రుడ్డివారిబావిదగ్గర.—నీకిష్టమేనా?—నువ్వొస్తావా?

మెలిజాండా—అలాగే.

పెలియాజ్—ఇదే మనకడపటి సాయంకాలము,—నాతండ్రిచెప్పినట్టు నేను విదేశయాత్రకు వెళ్లిపోతున్నాను. ఇకమరి నన్ను నువ్వుచూడవు...

మెలిజాండా—నువ్వాలా అనకూడదు పెలియాజ్!......నిన్నెప్పటికప్పుడే చూస్తాను. నిన్నెప్పుడూ నేను చూస్తునే వుంటాను......

పెలియాజ్—చూడగలిగితే చాలమంచిదే...... నువ్వెప్పుడు నన్ను చూడడానికి వీలులేనంత దూరంలో నుంటాను...... నేను చాలదూరం పోవడానికి ప్రయత్నిస్తాను......నే నానందంతో నిండి వున్నాను. ఈవేళ పృథివ్యాకాశముల బరువంతా నామీదనున్నట్టు కనిపిస్తున్నాది......

మెలిజాండా—ఏమిసంగతి పెలియాజ్? నువ్వేమిటి చెప్పుతున్నావో నాకర్థము కాలేదు.

పెలియాజ్—లే. లే. మనం వెళ్లిపోదాము. ఆ తలుపువెనుక కంఠస్వరములు వినబడుతున్నాయి...... నేటివుదయం కోటలోనికివచ్చిన క్రొత్తవారిప్పుడు వెళ్లిపోతున్నారు. పోదాం పద. అదిగో క్రొత్తవారక్కడనున్నారు.

[వేరువేరుగా నిష్క్రమింతురు.]

## రంగము ౨.

### కోటయందలి ఒక గది

[ఆర్కెల్ మెలిజాండాలు కనబడుదురు.]

ఆర్కెల్—ఇప్పుడు పెలియాజ్ తండ్రి మరణ భయమును దాటుటచేత, ప్రాత చెలికత్తెయైన రోగము కోటను విడిచిపెట్టింది. ఇక సంతోషమూ, కాంతి కొంచెము కొంచె మీగృహములో ప్రవేశింపగలవు ...... అది తీరికలేని సమయం. ఏమంటే నువ్వు వచ్చినదగ్గర నుండీ, మూసేసినగదిచుట్టూ, గుసగుసలాడుతుంటున్నట్టే కాలం గడిపేం......నిజంగా నిన్ను చూచి జాలివేసేది. మెలిజాండా......ఆనందాన్ని వెదుక్కుంటూ వచ్చిన పిల్లలాగ నీవెంతో సంతోషంతో నిక్కడకు వచ్చావు; కాని నువ్వు చావడిలోనికి ప్రవేశించగానే, నీముఖంలో నొకమార్పు చూచేను—నీ ఆత్మలోగూడ మార్పు కలిగి వుండవచ్చును—నట్టమధ్యాహ్నము అంధకార బంధురమైన గుహలో ప్రవేశిస్తే ముఖంలో అప్రయత్నంగా నెటువంటిమార్పొస్తుందో అటువంటిది ... ... అప్పటి నుంచి, ఈ అన్ని కారణాలచేత నీసంగతి నేను తెలుసుకోలేకపోయాను......నేను నిన్ను నిదానించి చూస్తూ వుండేవాడిని. నువ్వు అక్కడ నిలబడేదానివి. బహుశా పరకునేయకుండానే—కాని ఏదో ఒకఘోరమైన దుఃఖాని కెదురుచూస్తూ భ్రమ కలిగినదానిలాగు, వింత చూపులంచూస్తూ ఎండవేళలందు సుందరోద్యానవనములలో నుండేదానివి......నా మట్టుకు నాకే బోధపడలేదు......కాని నిన్ను చూచినప్పుడల్లా నాకు విచారం కలిగేది. అహోరాత్రము లీ మరణవాయువును పీలుస్తూ కాలంగడపడానికి, నువ్వు చిన్నదానివి, అందకత్తెవున్న ......కాని యిప్పు డదంతా మారిపోతుంది. నా వయస్సులో!—బహుశా యిది నాజీవితసంచయ ఫలము—ఈనావయస్సులో ఈకర్మసిద్ధాంతముపై నిట్టి నమ్మక మెలాగు కలిగినదో నాకు తెలియదు; కాని నేను చూస్తునే వున్నాను, అందమైన ప్రతి నూతనప్రాణియు, తన చుట్టూ తన కనుకూలమై, జగన్మోహనమై, ఆనందదాయకమైన నూతనకర్మసంచయములనే నిర్మించుకొనుచున్నది......ఇప్పు డీ దృశ్యాదృశ్యమైన నూతన శకమునకు తలుపు తెరవ నున్న దానవు. నువ్వు ఇలారా, ప్రత్యుత్తర మియ్యకుండా, కళ్లయినా పైకెత్తకుండా ఎందుకలా నిలబడ్డావు?—ఇప్పటివరకు నిన్నొక్కసారే ముద్దుపెట్టుకున్నాను. అయినప్పటికీ ముసలివాళ్లొక్కప్పుడు జీవితముయొక్క సంతతినవీనత్వమును గ్రహించి, ఒక్క క్షణకాలమైనా మృత్యువువలని భయమును పారద్రోలుటకు, కాంతలయొక్క కనుబొమ్మలపై గానీ, బిడ్డలయొక్క చెక్కులపైగాని చుంబనము సేయుట ఆవశ్యకము......నువ్వు నా పెదవులకు జడుస్తావా? ఇన్నిమాసాలనుండీ నిన్ను చూచి నే నెలాగు కనికరించేవాడినో......

మెలిజాండా—తాతయ్యగారు! నే నానందంగా లేకపోలేదు.

ఆర్కెల్—పాపం! నువ్వొకొందరిలాగ దుఃఖపడుతూ దుఃఖపడుతున్నానని తెలుసుకోలేవు. అట్టివారు మరీ నిర్భాగ్యులు......ఒక్కక్షణం నిన్ను దగ్గరగా నిదానించిచూడనీ......మరణం ప్రక్కను వేచియున్నప్పుడే యిటువంటిసక్కదన మావశ్యకము...

[ప్రవేశము గొలాడ్]

గొలాడ్—పెలియాజ్ ఈ సాయంకాలము వెళ్లిపోతాడు.

ఆర్కెల్—నీనుదుటిమీద నెత్తురున్నది—ఏంచేస్తున్నావు?

గొలాడ్—ఏమి లేదు. ఏమీ లేదు...ముళ్లడొంకలోనుండి వచ్చాను.

మెలిజాండా—తలకొంచెము వంచండినాథా!...మీనుదురు తుడుస్తాను.

గొలాడ్—[ఆమెను తోసేస్తూ] నువ్వునన్ను ముట్టకద్దు. వినబడ్డాదా? పో...పో...—నీతో నేనేమి మాట్లాడలేదు. నా ఖడ్గమేదీ?—నేను నా కత్తికోసం వచ్చాను......

మెలిజాండా—ఇదిగో నిక్కడ, పూజచేసు కున్న బల్లమీద.

గొలాడ్—తీసుకురా. [ఆర్కెల్‌తో] మరి యొక నిర్భాగ్యపు ప్రాణి సముద్రతీరమున ఆకలిచే చచ్చి పడివుంది. వారందరూ మన కళ్లయెదుటనే మరణించ డానికి సిద్ధపడ్డట్టు కనబడుతున్నారు. [మెలిజాండాతో] ఏదీ నా కత్తి!—ఎందుకలా వణుకుతున్నావు?—నిన్ను నేను చంపను. పదును పరీక్షించాలనుంది. ఇటువంటి వాటికి నేను కత్తి ఉపయోగించను. ఎవడినో ముష్టివానిని చూసినట్టు ఎందుకు నన్నలా ఎగాదిగా చూస్తావు. నే నేమి బిచ్చమడగడానికి రాలేదు. నీ కళ్లనుండి నేనేమి పొల్చుకోడానికి వీలులేకుండా నా కళ్లలోనుండి నా భావం పోల్చాలనివుందా యేమిటి?—నాకేమైనా నిన్ను గూర్చి తెలుసుననుకుంటున్నావా యేమిటి?—[ఆర్కెల్‌తో] ఆ విడప్పయిన కళ్లు మాశారా? ఐశ్వర్యమును కోరి, గర్వ ముతో కూడుకున్నట్టు కనిపిస్తున్నాయి.

ఆర్కెల్—ఉత్త అమాయకత్వము తప్ప నా కేమి కనిపించడము లేదు.. ...

గొలాడ్—ఉత్తఅమాయకత్వమా?...అవి అమా యకత్వాన్ని మించున్నాయి!...లేడికళ్లకంటే చంచలం గా నున్నాయి!...అమాయికత్వంగురించి దేవునికి పాఠం చెప్పినట్టు!...అమాయకత్వమా! వినండి. రెప్ప లల్లాడ్చ నప్పుడు కనుపాపల నవీనమాధురి గ్రోలనంతిచేరువలో నే నున్నాను. అయినప్పటికి నాకు పరలోకముయొక్క దుస్తరరహస్యము తెలుసుటకంటే ఆ కన్నులయొక్క స్వల్పరహస్యవర్తనము కొంచెమైనా యెరుంట కష్ట తరంగానుంది!...ఉత్త అమాయకత్వమా! ... అమాయ కత్వమును మించివున్నది!—స్వర్గమునందలి దేవతలందరు నచ్చట సంతతము వినోదములు సల్పుతున్నట్టుంది... నేను వాటి నెరుగుదును. నాకా కళ్లసంగతి తెలుసును. అవి చూశాను!...ముయ్యి, కళ్లు ముయ్యి; లేకపోతే మరితెర వకుండా మూయిస్తాను!...నీ కుడిచెయ్యి గొంతుకమీద నుండి తియ్యి! నేను చాలా తేలికయైన సంగతి చెప్పు తున్నాను...నాకు రెండాలోచనలు లేవు ... నాకు మరొకఆలోచన వున్నట్టయితే నేనెందుకు మరిచెప్పను? హాం. హాం. తరిగెత్తిపోడానికి ప్రయత్నించకు. ఏదీ! ఆ చెయ్యియ్యి...అబ్బా...నీచేతులు చాలవేడిగా నున్నాయి...నీ మస్తిష్కము నాకు చికాకు కలిగిస్తు న్నాది... ఇదిగో యిక నువ్విప్పు డెక్కడికి పోతి పోతావు? [ఆమె జుత్తుపట్టుకొనును] నీ మోకాళ్లమీద పడి నావెంట వస్తున్నావా? నాకాళ్లమీదపడి నన్ను ప్రార్థిస్తున్నావా? అదిగో నీ దీర్ఘకేశములు ఇప్పుడు కొంత ఉపయోగమునకు వచ్చాయి. కుడిప్రక్క ఎడమ ప్రక్క. ప్రార్థించు; ప్రార్థించు. భూమిమీద సాష్టాంగ పడు; సాష్టాంగపడు. చూశావా...చూశావా...అప్పుడే ముసలివానిలాగ నే నెలా నవ్వుతున్నానో...

ఆర్కెల్—[ముందుకుపరుగెత్తుచు] గొలాడ్!...

గొలాడ్—[తక్షణమే శాంతినిపొంది] నీయిష్టం వచ్చినట్టే చెయ్యి. తెలిసిందా—నాకు దానితో నేమి పనిలేదు—నేను మిక్కిలి ముసలివాడిని— అదిగాక నే నేమి రహస్యద్రష్టనుకాను. కొంచెమాగి యే దెలావస్తుందో చూస్తాను. ఆతరువాత...అయ్యో! ఆ తరువాత...అది లోకాచారం కాబట్టి. అది లోకాచారంకాబట్టి.

[నిష్క్రమించును.]

ఆర్కెల్— ఏమిటి జరిగింది? ఏం తాగేడా యేమిటి?

మెలిజాండా—[కన్నీరు కార్చుచు] లేదు. లేదు. నన్నాత డిప్పుడు ప్రేమించడము లేదు...నాకు సౌఖ్యం లేదు; నాకు సౌఖ్యంలేదు.

ఆర్కెల్—నేను భగవంతుడనై వుంటే మానవుల హృదయదౌర్బల్యాన్ని తొలగించివుందును.

## రంగము 3.

### కోటముందట ఒకయెత్తుస్థలము

(న్యాయాల్డు ఒకరాయినెత్తుతూ కనబడును.)

న్యాయాల్డు—అబ్బా! ఈరాయి మిక్కిలిబరు వుగానుంది!...నాకంటేకూడా బరువుగానుంది...ఈ ప్ర

పంచమంతటికంటేకూడా బరువుగానుంది... ఇప్పుడు జరిగినదానంతటికంటేకూడా బరువుగానుంది... నాబంగారుబంతి యీరాతిమూకకన్న ఆవేసవరాతికిన్నీ మన్నిమూకనిపిస్తునేవుంది. కాని నాకుఅందదు... నాచిన్ని చెయ్యికందదు. రాయాయెత్తబడదు... నేను దానినెత్తలేను... మరియిక్కడ దానినెత్తేవాళ్లెవ్వళ్లూలేరు... అది యీయింటంతటికన్నా బరువుగానుంది... ఎవరైనా భూమిలో దానివేళ్లు నాటున్నా యనుకుంటూరు... (కొంతదూరమున గొర్రెలమంద అరుపు వినబడును) హోయ్‌హోయ్! నాకు గొర్రెలఅరుపు వినబడుతున్నాది. (దిబ్బచివర కెక్కడు చూచుటకైపోవును) అప్పుడే సూర్యాస్తమించేశాడే! అదిగో గొర్రెపిల్లలొస్తున్నాయి... ఎన్నున్నాయో!... ఎన్నున్నాయో!—అవిచీకటిలో జడుస్తున్నాయి... దగ్గరగా చేరుకుంటున్నాయి, దగ్గరగా చేరుకుంటున్నాయి. ఇంక మరిదూరం అవి పోలేవు... అవి అరుస్తున్నాయి అరుస్తున్నాయి. అతిత్వరగా పరిగెడుతున్నాయి... పరిగెడుతున్నాయి. అవి అప్పుడే పెద్దఅక్షుగోడ్డుదగ్గరకువచ్చాయి! అయ్యో! అయ్యో!... వాటికెటువెళ్లడమో తెలియదు. అవి యిప్పు డెగరపడములేదు. అవి ఆగిపోయాయి... అందులో కొన్ని కుడితట్టునెళ్లబోతున్నాయి... నెళ్లలేకపోతాయేమో! గొల్లవాడు వాటికట్టుమట్టిపిలుసురుతున్నాడు. ఆహా! అవి యీతట్టేవస్తున్నాయి... అవి అనుసరిస్తున్నాయి... చెప్పినట్టు వింటున్నాయి. ఈ డాబాముందునుండే వెళ్లబోతున్నాయి... ఈరాళ్లకుముందునుండే వెళ్లబోతున్నాయి... వాటిని దగ్గరగాచూస్తాను. అబ్బా! అబ్బా! ఎన్నున్నాయో! దారంతా వాటితోనే నిండిపోయింది... అవియిప్పుడు నిశ్శబ్దముగా నున్నాయి... గొల్లవాడా! గొల్లవాడా! అవియెందుకు మరిమాట్లాడవు?

గొల్లవాడు—(కనబడకుండా) ఇది మందకుపోయేదారికాదు కాబట్టి.

న్యిళూల్డు—అవియెక్కడకు పోతున్నాయి? గొల్లవాడా! గొల్లవాడా! అవి యెక్కడకుపోతున్నాయి?—వాడు నామాటవినిపించుకోలేదు... అవి అప్పుడే చాలదూరం వెళ్లిపోయాయి... చాలవడిగా పరుగెత్తుతున్నాయి. ఇప్పుడేమీ నప్పుడు చెయ్యడములేదు... ఇది మందకు దారికాదు. పాపం! ఈరాత్రెక్కడ పడుకుంటాయో! అబ్బా! చాల చీకటైపోయింది. నేను పోయి యెవరికైనా చెప్తాను.

[నిష్క్రమించును]

## రంగము ౪

## ఉద్యానవనంలో నొకబావి

[ప్రవేశము పెలియాజ్.]

పెలియాజ్—ఇదే కడపటి సాయంకాలము... కడసారి సాయంకాలము. ఇక్కడితో అంతా ముగియవలసినదే... అనుమానంలేకుండా పిల్లవానిలాగ ఆడుకున్నాను...... విధినియోగముయొక్క బాగోగులను గూర్చి కలగంటూ ఆడుకున్నాను... ఈ అవస్థనుండి నన్నెవరు హటాత్తుగా లేపేరు! గుడ్డివాడు కాలుతున్న తనయింట్లోనుంచి పరిగెత్తిపోయేటట్టు నేనున్నూ ఆనంద దుఃఖాలతో అరుస్తూ పరిగెత్తిపోతాను... నేనెక్కడకో పోతున్నానని ఆమెతో చెప్తాను. నాతండ్రి మరణభయంనుండి దాటినాడు. ఇప్పుడు నాకొంటరిగా పడుకొనటకే తోచదు. అప్పుడే చాల ఆలస్యమైపోయింది. ఆమె రావడములేదు... ఆమెను తిరిగిచూడకుండా వెళ్లిపోవడమే మంచిది... ఆమె నీసారి చక్కగా చూడాలి... నాకు జ్ఞాపకముండని అంశములున్నాయి... ఒక్కొక్కప్పుడామెను నూరుసంవత్సరములై చూడనట్టనిపిస్తుంది... ఇప్పటికి ఆమెదృష్టివైపు నిదానించి చూడలేదు... ఇలాగు వెళిపోతే నాకేమి జ్ఞాపకముండదు. ఈజరిగినదంతా... ఇదంతాచూస్తే నేనొక గుడ్డసంచీతో కొంచెమునీరు పట్టుకుపోబోతున్నట్టున్నది. ఆమె నొక్కసారి యీకడపటిమాటు చూడాలి. ఆమె హృదయాంతరాళాన్ని శోధించిచూడాలి... నే నిదివరకు చెప్పనిదంతా చెప్పేయాలి...

[ప్రవేశము, మెలిజాండా]

మెలిజాండా—పెలియాజ్!

పెలియాజ్—మెలిజాండా! నువ్వేనా మెలి జాండా?

మెలిజాండా—అవును.

పెలియాజ్—ఇక్కడకురా, ఆ చంద్రకిరణాల దాపున నిలబడకు. ఇటురా, మన మొకరితోనొకరు చెప్పుకోవలసిన దెంతోవుంది, ఈనిమ్మచెట్టునీడలోనికి రా.

మెలిజాండా—నేను వెలుగులోనే వుంటాను.

పెలియాజ్—ఎవరైనా బురుజుకిటికీలలోనుండి చూస్తారు. ఇటురా, ఇక్కడ మనం భయపడవలసిన పనుండదు. జాగ్రత్త; వాళ్లు మననిచూస్తారు.

మెలిజాండా—వాళ్లు చూడాలనే నాకుంది.

పెలియాజ్—ఎందుకు, ఏమిటి సంగతి? నువ్వు ఎవరూ చూడకుండా రాగలిగేవా?

మెలిజాండా— అవును. మీ అన్నగారు పడుకున్నారు...

పెలియాజ్—ఇప్పుడు చాలవేళైంది. ఇంకొక ఘంటలో వాళ్లు తలుపులు వేసేస్తారు. మనంజాగ్రత్తగా నుండాలి. నువ్వెందుకింత ఆలస్యంగా వచ్చావు?

మెలిజాండా—మీ అన్నకొక పాడుకల వచ్చింది. ఆతరువాత వస్తూవుంటే నా చీర తలుపుమేకుకు తగులుకుంది. ఇదిగో చూడు, చిరిగిపోయింది. ఇలా కాలమంతా వ్యర్థమైంది నేను పరుగెత్తుకువచ్చాను......

పెలియాజ్—అయ్యో! మెలిజాండా! ...... నిన్ను ముట్టుకోడానికే భయంగా వుంది...వేటాడబడిన పిట్టలాగ ఇంకా నీకూపిరి లేదు...ఇదంతా నాకోసమేనా? నాకోసమేనా ఇలా చేసేవు?... నీ హృదయ స్పందము విస్పష్టముగా, నా హృదయస్పందమో అన్నట్టుగా విన బడుతున్నది. రా దగ్గరకు. నాదగ్గరకు రా.

మెలిజాండా—నువ్వెందుకు నవ్వుతున్నావు?

పెలియాజ్— నేను నవ్వడము లేదు; లేదా సంతోషముచేత తెలియకుండానే నవ్వుతున్నాను... ఇంతకంటే యేడవడానికి కారణముంది.



మెలిజాండా— మన మిక్కడ కింతకు పూర్వ మొకసారి వచ్చాము......నాకు జ్ఞాపక ముంది......

పెలియాజ్—అవునవును...ఎన్నో నెలలక్రిందట ...అప్పుడు నాకు తెలియదు ... ఈ సాయంత్రము ని న్నిక్కడ కెందుకురమ్మన్నానో నీకు తెలుసునా?

మెలిజాండా—తెలియదు.

పెలియాజ్—బహుశా ఇదే నిన్ను కడసారి చూడడము...ఈస్థలము నా జీవితాంతమువరకు విడిచి పెట్టేయాలి.

మెలిజాండా—ఎందుకు నువ్వెప్పుడు వెళ్లిపోతా ను వెళిపోతానని అంటూవుంటావు?...

పెలియాజ్—ఇదివరకు నీకు తెలిసిన సంగతే. తిరిగి నేను చెప్పాలా? నే నిప్పుడేమిచెప్పబోతున్నానో నీకు తెలియదు?

మెలిజాండా—తెలియదు. నాకేమీ తెలియదు.

పెలియాజ్—నే నెందుకు వెళ్లిపోవలసివచ్చిందో నీకు తెలియదు? అది...[అకస్మాత్తుగా ఆమెను తటాలునముద్దిడుకొని] నిన్ను నేను ప్రేమించడముచేతనే...

మెలిజాండా—[హీనస్వరముతో] నేను కూడా నిన్ను ప్రేమిస్తున్నాను...

పెలియాజ్—ఆఁ, ఆఁ, ఏమిటి చెప్పుతున్నావు మెలిజాండా?...నువ్వు చెప్పినది నాకు సరిగా వినబడ లేదు...మంచుగడ్డ తప్తకాలాయసదండముచే పగులగొట్ట బడ్డాది...లోకాంతరమునుండి వచ్చినట్టున్న కంఠస్వర ముతో చెప్పుతున్నావు!...నీమాట వినబడనే లేదు... నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? నువ్వుకూడా నన్ను ప్రేమిస్తున్నావా?... ఎప్పటినుండి నువ్వు నన్ను ప్రేమి స్తున్నావు?

మెలిజాండా—చాలకాలమునుండి......మొదట నిన్ను చూచినప్పటినుండి.

పెలియాజ్—ఆహా! ఎంతబాగా చెప్పుతున్నావు. నీకంఠస్వరము వసంతకాలమునందు సముద్రము నతిక్రమించిపోవుతున్నట్టుంది...ఇట్టి స్వరము ఇప్పటి

వరకు నేనెన్నడు వినలేదు...అమృతవృష్టి నాపై కురిసి నట్టున్నది...నువ్వెంత సులువుగా చెప్పతున్నావు... ఒక దేవతనడిగితే చెప్పినట్టు...నేను నమ్మలేను మెలిజాండా...నువ్వెందుకు నన్ను ప్రేమించాలి? నువ్వేల నన్ను ప్రేమిస్తున్నావు? నువ్వుచెప్పినది సత్యమేనా? మోసముచెయ్యలేదు గదా? నన్ను సంతోషపెట్టాలని కొంచెము బద్ధమాడుచుండలేదు గద?

మెలిజాండా—లేదు. నేనెప్పుడూ అసత్యమాడను. మీ అన్నగారిదగ్గర నేనే నసత్యమాడుదును.

పెలియాజ్—ఆహా! నువ్వేలాగు చెప్పుతున్నావు! నీకంఠస్వరము! నీకంఠస్వరము! అది నీటికంటె నిర్మలముగాను వాస్తవికముగాను ఉన్నది. నా పెదవులకు నిర్మలోదకమువలె తాకుతున్నది...ఏదీ నీచేతు లియ్యి...ఆహా! నీచేతులుచిన్నవి...నువ్వెంత అందముగానున్నావని నాకు తెలియదు...ఇదివరకు నేనెప్పుడు నిట్టి యందమైనవస్తువును చూడలేదు...నావంట్లో న వ్యవస్థగానుండుటచేత నిల్లల్లా వెతికాను...దేశమల్లా వెతికాను...కాని యిట్టియందమును నేనెక్కడా చూడలేదు...ఇప్పుడు నువ్వుకనబడ్డావు. నువ్వు కనబడ్డావు... భూమిలో నింతకంటే చక్కనివారుంటారని నేను నమ్మను...ఎక్కడున్నావు? నీఊపిరి నాకు వినబడదు.

మెలిజాండా—నీకట్టే నేను చూస్తూవుండడము చేత. ....

పెలియాజ్—నువ్వు నాకేసైందుకంత నిదానించిచూస్తున్నావు? మన మప్పుడే నీడలోకివచ్చాము. ఈచెట్టుక్రింద మిక్కలి చీకటిగానవుంది. వెలుగులోనికి రా. మనమెంత యానందముగానున్నామో ఒకరి నొకరు చూచుకోలేము. రా, రా, మనకు వ్యవధి చాల తక్కువ...

మెలిజాండా—వద్దు, వద్దు. ఇక్కడనే వుందాము. ఈ చీకటిలోనే నీచేరువ నున్నాను.

పెలియాజ్—నీకళ్లేవి? నువ్వు నాదగ్గరనుండి పారిపోవుగదా? ప్రస్తుతము నువ్వు నాగురించి తలుస్తూ వుండడములేదు.

మెలిజాండా—నిన్నే తలుస్తున్నాను. నిన్నే తలుస్తున్నాను. నిన్నుగూర్చి ఆలోచిస్తున్నాను...

పెలియాజ్—నువ్వెటుకట్టో చూశావు.

మెలిజాండా—నిన్ను మరోకదగ్గర నేను చూశాను...

పెలియాజ్—నువ్వు మగ్నమైపోయావు... ఏమిటి జరిగింది? నువ్వు సంతోషంగా కనబడలేదు.

మెలిజాండా—లేదు, నేను సంతోషంగానే వున్నాను. కాని నాకు విచారంగానుంది...

పెలియాజ్—ఒకరిని ప్రేమించేటప్పుడు, తరుచుగా, విచారంగానే వుంటుంది...

మెలిజాండా—నిన్నుతలుచుకుంటే నేనెప్పుడూ ఏడువవలసిందే...

పెలియాజ్—నేనుకూడాను... మెలిజాండా, నేనుకూడాను...నేను నీకుచేరువగానేవున్నాను. నే నానందబాష్పములు కారుస్తున్నాను. అయినప్పటికీ... (మరల అతడామెను ముద్దిడుకొనును)...నిన్ను నేను ముద్దుపెట్టుకున్నప్పుడు నువ్వు చాల వింతగానున్నావు. నిన్నుచూస్తే నువ్వుస్వల్పకాలంలో చచ్చిపోతావన్నంత అందంగానున్నావు.

మెలిజాండా—నువ్వుకూడాను.

పెలియాజ్—అక్కడ. అక్కడ...మనంకోరినట్టు చెయ్యలేము...నిన్ను మొదటిసారి నేనుచూచినప్పుడు ప్రేమించలేదు.

మెలిజాండా—నేనున్నూ...నేనున్నూ... నేను భయపడ్డాను...

పెలియాజ్—నీచూపు నేనుభరించలేక పోయివాడిని...నాకు తత్క్షణమే వెళ్లిపోవాలనుండేది...అప్పుడు...

మెలిజాండా—నాకు రావాలనేలేదు... రావడాని కెందుకు జడిసేనో యిప్పటికి నాకు తెలియదు...

పెలియాజ్—మనుష్యులకు తెలియనిసంగతు లెన్నోవున్నాయి...మనమెప్పుడూ నిరీక్షిస్తూనేవున్నాము. అప్పుడు...ఆచప్పుడేమిటి? కోటతలుపులు వేసేస్తున్నారా?

మెలిజాండా—అవును తలుపులు వేసేశారు...

పెలియాజ్—మనము తిరిగివెళ్లలేము. నీకు గడియలచప్పుడు వినబడ్డాదా? విను విను. ఆ పెద్దగొళ్లేలు... ఆలస్యమైపోయింది. ఆలస్యమైపోయింది.

మెలిజాండా—అదీ ఒకమంచికే. అదీ ఒక మంచికే.

పెలియాజ్—నీకా? చూడుచూడు...ఇంకా దానిని కోరవలసింది మనముకాదు. అంతాపోయింది... రారా...నాగొంతుకలో నాహృదయం, పిచ్చివాడి గుండెలాగు కొట్టుకుంటున్నాది...(అతడామెను కౌగలించుకొనును) విను విను. నాహృదయం స్తంభించిపోడానికి సిద్ధంగానుంది!...ఆహా యీచీకటిలో నెంత యందముగానుంది!...

మెలిజాండా—మనవెనుక నెవరోవున్నారు!...

పెలియాజ్—నాకెవరు కనబడలేదు...

మెలిజాండా—నాకేదో ధ్వనివినబడింది...

పెలియాజ్—నాకీచీకటిలో నీహృదయస్పందనమాత్రమే వినబడుతున్నాది.

మెలిజాండా—ఎండాకుల మర్మరధ్వని నాకు వినబడ్డాది...

పెలియాజ్—వాటిని హటాత్తుగా గాలినొక్కింది...అది మనం ముద్దుపెట్టుకున్నసమయంలో కొట్టింది.

మెలిజాండా—ఈసాయంకాలము మననీడ లెంత దీర్ఘముగానున్నాయి!...

పెలియాజ్—అవి తిన్నగా నీతోట కొసకు పెనుసుకున్నాయి—ఆహా! అవి మన కెంత దూరంలో ముద్దులాడుకుంటున్నాయో. చూడు. చూడు.

మెలిజాండా—[నిరుద్ధస్వరముతో] ఆ...హా... అత డొక చెట్టువెనుక నున్నాడు.

పెలియాజ్—ఎవడు?

మెలిజాండా—గొలాడ్.

పెలియాజ్—గొలాడా? అయితే యెక్కడ?—నాకేమి కనబడలేదు...

మెలిజాండా—అక్కడ, మననీడల చివరను.

పెలియాజ్—అవు నవును. నేను వానిని చూశాను...మనము తటాలున వెనక్కి తిరిగి పోరాదు...

మెలిజాండా—అతనిచేతిలో కత్తికూడా నుంది.

పెలియాజ్—నాచేతిలో నేమీ లేదు......

మెలిజాండా—మనము ముద్దుపెట్టుకుంటూ వుండడ మతడు చూశాడు.

పెలియాజ్—మన మతనిని చూశామని, అతనికి తెలియదు...కదలకు...నీతల త్రిప్పకు...మన మీదికి పరిగెత్తుకుని వస్తాడు... మన మతనిని చూడలేదని అనుకున్నంతకాలము అత డక్కడే వుంటాడు ... అతడు మనని కనిపెడుతున్నాడు...అత డింకా కదలలేదు... ఈదారిని నువ్వు వెంటనేపారిపో...నే నతనికోసంవుండి అతనిని పట్టుకుంటాను.

మెలిజాండా—వద్దు. వద్దు.

పెలియాజ్—పారిపో. పారిపో. అతడంతా చూచేశాడు; అతడు మనని చంపేస్తాడు...

మెలిజాండా—అదీ ఒక మేలే; అదీ ఒక మేలే.

పెలియాజ్—అతడు వస్తున్నాడు. అతడు వస్తున్నాడు...ఏదీ నీమూతి...నీమూతి...

మెలిజాండా—ఆఁ...ఇదిగో [తగిలీ తగలకుండా నొకరినొకరు ముద్దాడుదురు.]

పెలియాజ్—అయ్యో! అయ్యో! నక్షత్రాలన్నీ రాలిపోతున్నాయి...

మెలిజాండా—నామీద కూడాను... నా మీద కూడాను...

పెలియాజ్—మరొక్క సారి...మరొక్క సారి ...ఏది యియ్యి...యియ్యి.

మెలిజాండా—అంతా సరి. అంతా సరి. [గొలాడ్ ఖడ్గపాణియై వారిపై పరుగెత్తి పెలియాజ్‌ను కొట్టును. పెలియాజ్ బావి ప్రక్కను పడిపోవును. మెలిజాండా భయోద్రేకముతో పరుగెత్తును.]

మెలిజాండా—[పరుగెత్తుచు] అయ్యో! అయ్యో! నేను ధైర్యవతినికాను. నేను ధైర్యవంతురాలను కాను. [గొలాడ్ నిశ్శబ్దముగా నడవియందామెను తరమును.]

## అంకము ౫.

### రంగము ౧.

### కోటయందలి ఒకలోతుచావిడి

[దాసీలు గుంపుగా కూర్చుని కనబడుదురు. బయట నొక గాలిగొట్టాము ముంగట కొందరు బాలురాడు చుందురు.]

ఒకముసలిదాసి—ఓర్చిచూడండి. ఓర్చిచూడండి. అమ్మాయిల్లా! ఈసాయంత్రమే వారు వచ్చి యిప్పుడే మనకి చెప్పుతారు...

మరొకదాసి—వారు వచ్చి మనకు చెప్పరు .. వాళ్లెందుకున్నారో వారికే తెలియదు...

మూడోదాసి—ఇక్కడ మనం కొంతసే పుందాము.

నాలుగోదాసి— మన మెప్పుడు మీదకు వెళ్ల దలా మనకే బాగా తెలుస్తుంది.

అయిదోదాసి—అవసరంవస్తే మనమట్టుకుమనమే మీదకు వెళ్లిపోదాము.

ఆరోదాసి—ఇంట్లోనుండి యేవిధమైన శబ్దం వినబడడంలేదు.

ఏడోదాసి—గాలి గొట్టాని కెదురుగుండా ఆడుతున్న పిల్లలను ఊరకోమని చెప్పాలి.

ఎనిమిదోదాసి—ఒక్కగడియుంటే వారిమట్టుకు వారే వూరుకుంటారు

తొమ్మిదోదాసి— ఇంకా సమయం కాలేదు

[ప్రవేశము-ముసలిదాసి]

ముసలిదాసి— ఇప్పు డెవరూ గదిలోనికి వెళ్ల డానికి వీలులేదు. నేను సరిగా ఒకఘంట విన్నాను. తలుపులమీద ఈగలు ప్రాకడంకూడా వినవచ్చు...కాని నాకేమి వినబడలేదు.

మొదటిదాసి—వారామె నొక్కర్తెనే గదిలో నుంచేశారా?

ముసలిదాసి—లేదు. లేదు. గదినిండా మనుష్యు లున్నారనుకుంటాను.

మొదటిదాసి—వాళ్లిప్పుడేవెళ్లి పోవస్తూవుంటారు

ముసలిదాసి— అయ్యో! దైవమా! ఆనందము కాదు. ఈగృహమున ప్రవేశించినది. ఎవడూ మాట్లాడ కూడదు. నాకు తెలిసినది గాని చెప్పగలిస్తే.

రెండోదాసి—నువ్వేకదూ వారిని ద్వారంవద్ద చూశావు?

ముసలిదాసి—ఆఁ. ఆఁ. మరేమి? నేనే వారిని చూశాను. ఆద్వారపాలకుడు చెప్తాడు. వాడేప వారిని మొట్టమొదట చూచినది. అసలు వానిని లేపినది నేను. వాడుబోరగిలపడుకుని లేవనే లేదు—ఇప్పుడు వాడొచ్చి చెప్తాడు. "నేను వారిని మొట్టమొదట చూశాను." అది బాగుందా?— గదిలోనికి వెళ్లడానికి దీపం వెలిగించే టప్పుడు నేను కాల్చుకున్నాను. తెలిసిందా? — నేను గదిలోఏంచెయ్యడానికి వెళ్లాను?—గదిలో ఏం చెయ్య డానికి వెళ్లేనో యిప్పుడు జ్ఞాపకం లేదు — ఏలాగైనప్పటికి వేగమే లేచాను. అప్పటి కింకా వెలుగురాలేదు. నాలో నే ననుకున్నాను.—"నేను కచేరిచావడి దాటిపోయి తలుపుతీస్తా"నని. సరే, అప్పుడు వేళ్లమీదనడుస్తూ మేడదిగి సాధారణమైన తలుపు తీసినట్టుగా దానితలుపుతీశాను. అయ్యో! దైవమా! అప్పుడునేనేమిచూశాను? నేనేమిచూశానో పోల్చ?...

# కతియవారు ట్రేడింగుకంపెనీ యొక్క

## సర్వజనాదరణీయమైన తలనూనెలు అందు వివిధపరిమళములుగల అత్తరులు

## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిష్టర్డు)

శిరోజములకు, మెదడుకు, తగినటువంటి తలనూనె. సువాసనద్రవ్యములతోను, హీనాపుష్పములతో చేయబడి, సాటిలేనిదై తనరుచున్నది. సంపన్నులు మెచ్చినది. సీసా 1-కి రు. 1. వి. పి. ఛార్జీ 6 అణాలు ప్రత్యేకము.

## కెటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిష్టర్డు)

వెంట్రుకలవృద్ధికిని, కాంతికిని తోడ్పడునట్టి తలనూనె. గులాబీపువ్వుల నిజసౌరభ మిందు గలదు. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల సీసా 1-కి 14 అణాలు. వి. పి. ఛార్జీ 6 అణాలు.

## కెటి కోకోనట్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిష్టర్డు)

టెంకాయనూనె తల కుపయోగించుమనని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ నెం. 777 రులో (రిజిష్టర్డు) చేసిన ఈ టెంకాయ నూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగాను సూక్ష్మసువాసనాసంకలితముగాను గావింపబడినది. అందుచే సామాన్యగృహస్థు లందరి మెప్పు నొందినది.

6 ఔన్సులు గల సీసా 1-కి 14 అణాలు. వి. పి. ఛార్జీలు 10 అణాలు ప్రత్యేకము.

మరియు జ్ఞప్తియం దుంచుకొనుడు

## కెటి ఒట్టో రోజ్ నెం. 777 రు (రిజిష్టర్డు)



దీనికి సరిసమాన మగు నూనె లేదు. రోజాపుష్పములచే చేయబడినది. పుష్పవనమునం దున్న తాజా గులాబీపుష్పము లెంతటి పరిమళము నొసగునో యంతటి సౌరభము నిందు బడయగలరు.

అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0, పావు ఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

## కెటి ఒట్టో జాసిన్ నెం. 777 రు (రిజిష్టర్డు)

మల్లెపుష్పములను తెలియనివా రుండరు. కెటి ఒట్టో జాస్మిన్ (నెం. 777 రు) మల్లెపువ్వులు లేని కాలము లందుకూడ మల్లెపూలవాసన నిచ్చుచు ఆశ్చర్యమును ఆనందమును కలిగించును. ఈ పరిమళము నొక్కసారి యాఘ్రాణించిన, అదిలేక మీ రొక్కఘడియ యుండజాలరు.

అరఔన్సు బుడ్డి రు. 1-12-0, పావుఔన్సు బుడ్డి రు. 1-0-0.

**ఒట్టో మధుకర్ (రిజిష్టర్డు):**—ఒకసారి యీ అత్తరు నుపయోగించినవారు, సర్వదా దీనిని విడనాడలేకున్నారు. మేలైన పుష్పసౌరభమే యిందులకు కారణము. అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0. పావుఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

వి. పి. ఛార్జీలు 5 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)

ష రా:—మీ గ్రామములందున్న దుకాణములలో కొనునప్పుడు కెటి మరియు నెం. 777 రు అనుపదములను గమనించుడు. అట్లుచేసిననే శుద్ధమైనవి మీకు దొరకగలవు.

పరీక్షార్థమై రెండు అణాస్టాంపుల నంపి యే రెండు తలనూనెల నమూనాలుగాని, లేక అత్తరునమూనా యొకటిగాని తెప్పించుకొనుడు.

సోల్ ఏజంట్లు:—**ది కతియవారు ట్రేడింగు కంపెనీ,**

ఖెట్వాడి మెయిన్‌రోడ్, బొంబాయి, నెం. 4

మొదటిదాసి—వారు సరీగా తలుపుమూందరే వున్నారా ?

ముసలిదాసి—వారిరువురు తలుపుముందరే పడుకున్నారు!...చాలకాలంనుండి ఆకలిచేక్ళశించిన పేద వారిలాగ...వారు, జనిస్తే పిల్ల లెలా గాకరినొకరు గట్టిగా కౌగలించుకుంటారో, అలాగు కౌగలించుకున్నారు. అస్నిరాజకుమార్తె యించుమించుగా చచ్చిపోయింది. ఆగొలాడ్ మాత్రం ఇంక తనప్రక్కను కత్తిప్రేలకేసుకునే వున్నాడు...రాళ్లమీద నెత్తురుపడివుంది.

రెండోదాసి—ఆపిల్లలనుఊరుకోమనిచెప్పాలి...గాలికొట్టానికదురుగా వాళ్లశక్తికొద్ది ఊదుతున్నారు...

మూడోదాసి—ఎవరేమిచెప్పేవది వినబడకుండా వున్నాది...

నాలుగోదాసి—ఇంక మరిచెయ్యవలసిందిలేదు. నేను ప్రయత్నించేసిచూశాను. వారూరుకోరు...

మొదటిదాసి—ఇప్పు డతనిఇంట్లో నెమ్మదిగానే వున్నట్టు తోస్తుంది.

ముసలిదాసి—ఎవరిఇంట్లో?

మొదటిదాసి—గొలాడ్ బాబుగారిఇంట్లో.

మూడోదాసి—అవునవును. అతనిని తన భార్యామందిరానికి తీసుకునివెళ్లారు. వారి నిప్పుడే దారిలో కలిసేను. తాగినవానికి ఊతయిస్తున్నట్లు అతనికూత యిస్తున్నారు. అతడొక్కడూ యింకా నడవలేడు.

ముసలిదాసి—అతను తనచుట్టుకు చంపుకోలేక పోయాడు. అతడు చాల పెద్దవాడు. కాని ఆమెకు దెబ్బతగలే లేదు. అయినప్పటికి ఆమె మరణావస్థలో వుంది...మీకది తెలిసిందా?

మొదటిదాసి—నువ్వాగాయము చూశా?

ముసలిదాసి—నిన్నిప్పు డెలాగు చూస్తున్నానో అలాగు—నా చిన్నారి! నే నంతా చూశాను—నీకు తెలిసిందా? ఎవరూ చూడకమునుపే నేను చూశాను. ఆమె హృదయమందు ఎడమభాగములో నొక చిన్న దెబ్బ—ఒక పావురానికి తగిలినా చచ్చిపోనంత చిన్న దెబ్బ. ఇది స్వాభావికముగా కనబడుతున్నాదా?

మొదటిదాసి—అవునవును. దీనంతటికి అంతర్గతా న్నేదోవుంది.

రెండోదాసి—అవునుకాని మూడురోజులక్రిందట ఆమె ప్రసవించింది.

ముసలిదాసి—అలాగా!...ఆమె మరణశయ్యపై. అదియొక అరిష్టసూచకముకాదా? — ఎటువంటిబిడ్డో నువ్వుచూశావా?—ముష్టిదైనా ప్రపంచకానికి తేడాని కిష్టపడ నటువంటిపిల్ల...కొంచెముత్వరగా లోకములోనికివచ్చిన ఒకచిన్న బీదవస్తువు...గొర్రెపున్నిలో పెరుగవలసిన మైనపుబొమ్మ...అవునవును. ఈగృహముప్రకాశించిన దానందముకాదు...

మొదటిదాసి—అవునవును. దేవుని చెయ్యి కదిలింది.

రెండోదాసి—ఇదంతా కారణంలేకుండా జరగలేదు.

మూడోదాసి—ఆతరువాత మన ముద్దులస్వామి పెలియాజో!...ఎక్కడున్నాడు? ఎవరికీ తెలియదు.

ముసలిదాసి—అవునలాగే. అందరికీ తెలుసును. కాని యెవరూ చెప్పడానికి సాహసించరు...ఎవరూ దానిగురించి మాటాడకూడదు...ఎవరూ దేనిగురించైనా మాట్లాడరు...ఎవరు సత్యమైన దానిగురించి మాట్లాడరు...కాని గ్రుడ్డివారి బావివద్ద కనబడ్డాడని నాకు తెలుసును. కాని యెవరు? ఎవ్వరూ అతన్ని చూడలేకపోయారు...అక్కడ. అక్కడ. కడపటిరోజానే అందరికీ అంతా తెలుస్తుంది.

మొదటిదాసి—నాకిక్కడ పడుకోడానికి భయం వేస్తున్నాది.

ముసలిదాసి—ఒకసారి దురదృష్టదేవత యింట్లో ప్రవేశించిన తరువాత, ఊరుకోడమే యింట్లో అందరికీ క్షేమము.

మూడోదాసి—అవును. అది అన్నిటివంకనిన్నూ వెతుక్కువస్తుంది.

ముసలిదాసి—కాని మనంకోరినట్లు మనంపో లేము.

నాలుగోదాసి—మనంకోరినట్లు మనం చెయ్య లేము.

మొదటిదాసి—ఇప్పుడు వారు మనని చూసి జడు స్తారు.

రెండోదాసి—వాళ్లందరూ సభ తీర్చారు...

మూడోదాసి—దారుల్లో వారు కళ్లువాలుస్తారు.

నాలుగోదాసి—వాళ్లెప్పుడు గుసగుసలాడుకుం టారు.

ఐదోదాసి—వాళ్లందరూకలిసే చేసేరనుకుంటారు.

ఆరోదాసి—వారేమిచేసేరో ఎవరికీ తెలీ లేదు.

ఏడోదాసి—ప్రభువులే జడిసిపోయినప్పుడు మిగి లినవాళ్లేమిటిచెయ్యడము... [నిశ్శబ్దము.]

మొదటిదాసి—పిల్ల లరుపు ఇప్పుడు నాకు విన బడ్డంలేదు.

రెండోదాసి—వాళ్లందరూ గాలిగొట్టాని కదు రుగుండా కూర్చున్నారు.

మూడోదాసి—ఒకరినొకరు తగులుతూ దగ్గరగా కూర్చున్నారు.

ముసలిదాసి—నాకింటినుండి యిప్పు డేధ్వనీ వినబడ్డంలేదు.

మొదటిదాసి—పిల్ల లూపిరితియ్యడమే నాకు వినబడ్డంలేదు.

ముసలిదాసి—రండి, రండి మేడమీదకి పోదా నికి వేళైంది......

[నిశ్శబ్దముగా నిష్క్రమింతురు.]

రంగము ౨.

కోటలో నొకగది

[గదిలో నొకమూల ఆర్కెల్, గొలాడ్, వైద్యు డు కనబడుదురు. మెలిజాండా తన పరుపుమీద పడు కొనియుండును]

వైద్యుడు—ఈ చిన్న దెబ్బచేమాత్రమే ఆమె మరణింపజాలదు. ఇంత చిన్నదెబ్బ కొక పక్షికూడా చావదు...కాబట్టి ప్రభూ! ఆమెను చంపినది మీరు కాదు; మీ రలాగు విచారింపరాదు......ఆమె బ్రతికి యుండజాలదు....ఆమె యకారణముగా జన్మించినది... ఇప్పు డామె యకారణముగా మరణించుచున్నది...... అదిగాక, ఆమెను రక్షింపలేమని మనం చెప్పలేము...

ఆర్కెల్—లేదు లేదు. మనం ఇంతవందిమీ ఆవిడగదిలోనుండి కూడా ఊపిరినే పూరకున్నట్టు కని పిస్తుంది...అదిమొక యువతికుసను......ఆమె యెలాగు నిద్రపోతున్నాదో చూడండి!...మెల్ల మెల్లగా...శాశ్వ తముగా నామెయాత్మ చల్లబడిపోయినట్టున్నది...

గొలాడ్—నేను నిష్కారణముగా చంపితిని. నేను నిష్కారణముగా చంపితిని...రాళ్లు నేడ్పించడము చాలదా! . వా రొకరి నొకరు పిల్లలలాగు ముద్దుపెట్టు కున్నారు...వా రొకరినొకరు ముద్దుమాత్రమే పెట్టు కున్నారు...వారు అన్నాచెల్లెండ్రు...మరి నేను, నేను ఒక్కసారిగా...నాచిత్తమునకు వ్యతిరేకముగా, మా కాను; నాచిత్తమునకు వ్యతిరేకముగా చంపేశాను.

వైద్యుడు—జాగ్రత్త; ఆమె లేస్తున్నట్టుంది.

మెలిజాండా—కిటికీ తెరవండి...కిటికీ తెరవండి.

ఆర్కెల్—ఈ కిటికీయా తియ్యమంటావు మెలి జాండా?

మెలిజాండా—కాదు కాదు...పెద్దకిటికీ..... అవతలంతా చూడడానికి.

ఆర్కెల్—ఈ సాయంకాలము సముద్రపుగాలి మిక్కిలి చల్లగాలేదా?

వైద్యుడు—ఆమె యెలాగుచెప్పితే అలాగు చెయ్యండి.

మెలిజాండా—నమస్కారము...అది సూర్యా స్తమయమేనా?

ఆర్కెల్—అవును, సూర్యుడు సముద్రముపై న స్తమిస్తున్నాడు. చాల వేళైంది? నీవంట్లో ఎలాగు న్నాది మెలిజాండా?

మెలిజాండా—సరే, సరే; అది మీరెందు కడుగుతున్నారు? నాకింతకంటే యెప్పుడు బాగులేదు. అయినా మీరెందు కడుగుతున్నారో నాకు తెలుసును.

ఆర్కేల్—ఏమంటున్నావు? నీవుచెప్పినది నాకేమి బోధపడలేదు.

మెలిజాండా—నేను చెప్పినదంతా నాకే బోధపడదు. చూశారా...నే నేంచెప్తానో నాకే తెలియదు...నాకేంతెలుసునో నాకే తెలియదు...నాకేం కావాలో నేను చెప్పను...

ఆర్కేల్—లే. లే...నువ్వు మాట్లాడడంవింటే మాకందరికీ సంతోషంగానుంది. ఈ మూడురోజులై నీకు కొంచెము సన్నిపాతంచేసింది. నిన్ను మేము బోధపరుచుకోలేకపోయినా వాళ్లము. ఇప్పుడదంతాపోయింది.

మెలిజాండా—నాకు తెలియదు...ఇంతసేపు మీరొక్కరే యీగదిలో నున్నారా తాతగారు?

ఆర్కేల్—లేదు. నిన్ను బాగుచేసిన వైద్యుడు కూడా వున్నాడు.

మెలిజాండా—ఆహాఁ.

ఆర్కేల్—ఆ తరువాత మరొకరుకూడా నున్నారు.

మెలిజాండా—ఎవరది?

ఆర్కేల్—అతడు...నువ్వు జడవకూడదు...' అతడు నీకొక పిసరంతైనా హానిచేయునుద్దేశములో లేడు. నమ్ము...నువ్వు భయపడితే అతడు వెళ్లిపోతాడు...అతడు చాల విచారంగానున్నాడు.

మెలిజాండా—ఎవరతడు?

ఆర్కేల్—అతడు...నీభర్త...గొలాడ్.

మెలిజాండా—గొలాడుగారిక్కడకేవున్నారా? అయితే నాదగ్గర కెందుకురాలేదు?

గొలాడ్—(పరుపుదగ్గరకు జరుగుతూ) మెలిజాండా!...మెలిజాండా...

మెలిజాండా—మీరేనా గొలాడ్.. మిమ్ములను నేను గురిపోల్చుకో లేకపోయాను...నాకళ్లల్లో అస్తమిస్తున్న సూర్యకాంతి పడుతున్నాది...మీరెందుకు గోడవైపుచూస్తున్నారు?...మీరు సన్నముగాను ముసలిగాను అయిపోయినారు ..మన మొకరినొకరు చూచుకొని చాలాకాలమైందా?

గొలాడ్—(ఆర్కేల్తోను వైద్యునితోను.) మీరీగదిలోనుండి ఒక్కమాటవకలకు వెళతారా? మీయిష్టమైతేనే, మీయిష్టమైతేనే... నేను తలుపు బారలాతీసేస్తుంచుతాను...ఒక్కక్షణంమాత్రమే. ఆమెతో కొంచెంచెప్పవలసివుంది. లేకపోతే నేనుమరణించలేను...వెళతారా? సంతుకొరకు వెళిపోండి. మీరు వెంటనే వెళ్లిపోరావచ్చు...ఈప్రార్థనమన్నించండి. నేను పరమదౌర్భాగ్యుడను...(ఆర్కేల్ వైద్యులు నిష్క్రమింతురు.)

మెలిజాండా! నీమీద నాకున్నట్టు నామీద నీకు కనికారంవుందా?...ఉందా మెలిజాండా?...నన్నుక్షమిస్తావా మెలిజాండా?

మెలిజాండా—అలాగే. అలాగే. క్షమిస్తాను...క్షమించడాని కేముంది?

గొలాడ్—నీయెడ నేను మిక్కిలి అపరాధము చేసేను. మెలిజాండా......నేను చేసిన అపచారం నేను చెప్పలేను ..కాని దాని నీరోజున ప్రత్యక్షంగానే చూస్తున్నాను ... మొదటిరోజునుండి... ఇదివరకు తెలియనిదంతా ఒక్కసారిగా నా కండ్లలో నేటిసాయంకాలము నాట్యమాడుతున్నాది...ఇదంతా నాతప్పే...జరిగినదీ జరగబోతున్నదీ...నేనొక్కసారిగాని చెప్పగలిస్తే నేనెలాగుచూస్తున్నది నీకే తెలుస్తుంది...నేనంతాచూశాను; నేనంతాచూశాను: కాని నిన్ను నేనలా ప్రేమించాను...నిన్ను నేనలా ప్రేమించాను...ఇప్పుడొకరు చనిపోనున్నారు...నేనే చనిపోనున్నాను...నాకు తెలుసుకోవాలనుంది...నాకు నిన్నడగాలనుంది...నువ్వు తప్పుగా తలవవుగదా?...నాకు కావాలి...చనిపోడానికి సిద్ధంగానున్నవారికి సత్యంచె

ప్పాలి...అతనికి నిజం తెలియాలి. లేకపోతే నిద్రపో లేడు...నువ్వు నాకు నిజం చెప్తానని ప్రమాణం చేస్తావా?

మెలిజాండా—అలాగే.

గొలాడ్—నువ్వు పెలియాజ్‌ను ప్రేమిస్తున్నావా?

మెలిజాండా—తప్పకుండాను. అతనిని నేను ప్రేమిస్తున్నాను. ఏడీ ఎక్కడున్నాడు?

గొలాడ్—నువ్వు నన్ను బోధపర్చుకో లేవా?... నువ్వు నన్ను బోధపర్చుకో లేవా? నా కిదంతా సరిగానే...సరిగానే...కనబడుతుంది నే నడుగుతున్నదిది. నువ్వుగాని వానిని తలపరాని ప్రేమతో ప్రేమించావా?...ప్రేమించావా?...నువ్వు దోషంచేసేవా? చెప్పుచెప్పు. ఆఁ. ఆఁ. ఆఁ.

మెలిజాండా—లేదు. లేదు. మేము దోషులము కాము. అదెందుకు నన్నడుగుతున్నారు?

గొలాడ్—మెలిజాండా! యథార్థంచెప్పు. దేవు ప్రేమనాసిస్తే.

మెలిజాండా—ఏమి నేను నిజంచెప్పలేదా?

గొలాడ్—ఈలా గీవచ్చిపోయేసమయంలో అబద్ధమాడకు.

మెలిజాండా—ఎవరా మరణించబోతున్నారు? నేనేనా?

గొలాడ్—నువ్వే నువ్వు. ఆతరగవాతనేను. నేను కూడాను...మనకు సత్యంకావాలి. మనకు కట్టకడపటికి సత్యంకావాలి? విన్నావా?...అంతా చెప్పు. అంతా చెప్పు. క్షమిస్తాను...

మెలిజాండా—నేనెందుకు మరణించ బోతున్నాను? నాకు తెలియదు.

గొలాడ్—ఇప్పుడు నీకు తెలుస్తుంది. వేళైంది. వేళైంది. లే. వేగం. వేగం. నిజంచెప్పు.

మెలిజాండా—నిజమే...నిజమే...

గొలాడ్—ఎక్కడున్నావు మెలిజాండా! ఎక్కడున్నావు? ఇది సహజంకాదు. మెలిజాండా. ఎక్కడున్నావు? ఎక్కడికి వెళుతున్నావు? (ఆర్కెల్ సువైద్యుని తలుపువద్దమాది) ఆఁ. ఆఁ. మీరు లోపలికి రావచ్చును...నాకేమి తెలిసిందికాదు. అంతానిష్ప్రయోజనమే...వేళమించిపోయింది. అప్పుడే ఆమెమనకు చాలదూరమై పోయింది...నాకింక తెలియదు. నేనిక్కడ మరణిస్తాను.

ఆర్కెల్—ఏంచేశావు?... ఆమెను చంపేస్తావు.

గొలాడ్...నేనిప్పుడే ఆమెను చంపేశాను...

ఆర్కెల్—మెలిజాండా...

మెలిజాండా—మీరేనా తాతయ్యగారు?

ఆర్కెల్—అవునమ్మా!...నన్నేమిటి చెయ్యమంటావు?

మెలిజాండా—ఇక్కడ చలికాలం తీవ్రంగా నుంటుందన్నమాట నిజమేనా?

ఆర్కెల్—అదెందు కడుగుతున్నావమ్మా!

మెలిజాండా—చలి మిక్కుటంగానుంది, అను లేమి కదలకపోవడంచేతను...

ఆర్కెల్—నీకు చలిగానుందా?—కిటికీతలుపులన్నీ మూసేమన్నావా?

మెలిజాండా—వద్దు వద్దు...సూర్యుడు పూర్తిగా సముద్రంలో మునిగిపోయిందాకవద్దు—అతడు మెల్లమెల్లగా క్రిందకు దిగిపోతున్నాడు. అప్పుడే శీతకాలం ప్రవేశించిందన్నమాట నిజమే?

ఆర్కెల్—అవును—అయితే నీకు శీతకాలం యిష్టంలేదా?

మెలిజాండా—అబ్బే! కాదు! నాకు చలివేస్తున్నది...నాకు మిక్కిలి చలివేస్తూవుండడంచేత...

ఆర్కెల్—ఇప్పుడు కొంచెము హాయిగానుందా?

మెలిజాండా—ఆఁ, ఆఁ; నాకు మునుపటిచికాకులన్నీ లేవు.

ఆర్కెల్—నీబిడ్డను చూస్తావా?

మెలిజాండా—ఏంబిడ్డ?

ఆర్కెల్—నీబిడ్డ—నువ్వు ఇప్పుడు తల్లివ య్యేవు. నువ్వొక ఆడపిల్లను కన్నావు.

మెలిజాండా—అదేదీ?

ఆర్కెల్—ఇదిగో...

మెలిజాండా—చాల వింతగానుంది.....దాని నెత్తుకుందామంటే చేతులు లేవకుండావున్నాయి...

ఆర్కెల్—అదెందుకంటే నువ్వు మిక్కిలి నీర సంగా నుంపడంచేత... నేనే యెత్తుతాను చూడు—

మెలిజాండా—అది నవ్వడంలేదు.....చాల చిన్నదిగానుంది...అది యేడవబోతున్నది కూడాను... దానినిచూస్తే నాకు జాలికేస్తున్నది...[కొంచెము కొంచెముగా, దాసీలు అగది నాక్రమించుకొని, నిశ్శబ్ద ముగా గోడలదరిని పంక్తులుదీర్చి నిలచియుందురు.]

గోలాడ్—[తటాలున లేచి] ఏమిటిది?—ఇక్కడీ యాడవాండ్రంతా యేమిటి చేస్తున్నారు?

వైద్యుడు—వాళ్లు దాసీలు...

గోలాడ్—వారి నెవరుపిలిచారు?

వైద్యుడు—నేనుకాను...

గోలాడ్—మీరందరూ ఇక్కడ కెందుకువచ్చారు?—మిమ్మెవ్వరూ పిలవలేదు...మీ రిక్కడేమిటి చేస్తున్నారు?—కానీ, ఏమిటి చెప్పండి...[దాసీలు నిరుత్తరలగుదురు.]

ఆర్కెల్—అంతగట్టిగా మాట్లాడకు...ఆమె నిద్రపోతున్నది. కండ్లుమూసుకున్నది...

గోలాడ్—ఇది దీర్ఘ...?

వైద్యుడు—కాదు కాదు చూడండి; ఆమె ఊపిరి తీస్తున్నది...

ఆర్కెల్—ఆమెకండ్లు నీళ్లతో నిండున్నా యి—ఇప్పుడామెయాత్మ యేడుస్తున్నది...ఎందు కామె చేతులుచాచుతున్నది? ఆమెకేమికావాలి?

వైద్యుడు—అచాచడం పిల్లకోసమే. సందేహం లేదు. అదిబిడ్డలనుగూర్చి తల్లియాతన...

గోలాడ్—ఇప్పుడో?—ఇప్పుడో? మీరుచె ప్పాలి. చెప్పండి. చెప్పండి.

వైద్యుడు—బహుశః—

గోలాడ్—తత్క్షణమే?...అయ్యో! అయ్యో! నేనామెకు చెప్పవలిసుంది...మెలిజాండా! మెలిజాం డా!...నన్ను విడిచిపెట్టేయండి. నన్నొక్కడినే ఆమె వద్ద విడిచిపెట్టండి...

ఆర్కెల్—లేదు. లేదు. దగ్గరకురాకు...ఆమె ను మరిబాధించకు...ఆమెతో మరిమాట్లాడకు...ఆత్మ యెటువంటిదో నీకుతెలియదు...

గోలాడ్—అది నాదోషంకాదు...అది నాదో షంకాదు.

ఆర్కెల్—ఊరుకో!...ఊరుకో!...మన మిక మెల్లిగా గొంతుకలో మాట్లాడుకోవాలి—ఆమెను మరి మనంబాధించకూడదు...జీవుడు ప్రశాంతంగాపోవాలని కోరుకుంది. అది బాధకు పికికితనం పడుతుంది...కాని యీదుఃఖమంతా, గోలాడ్! కాని యీదుఃఖమంతా చూచినవాళ్లదే. అయ్యో! అయ్యో! అయ్యో!(అంతట దాసీలు గిరిక్కొనను సాష్టాంగపడుదురు.)

ఆర్కెల్—(తిరిగి) అదేమిటి?

వైద్యుడు—(పరుపుదగ్గరకుపోయి దేహమును తాకి) అవునంతే.

[దీర్ఘకాలము నిశ్శబ్దము.]

ఆర్కెల్—నేనేమిచూడలేదు.—మీకు నమ్మ కమేనా?...

వైద్యుడు—ఆఁ, ఆఁ.

ఆర్కేల్ — నాకేమి వినిపించలేదు...అంతవేగమే. అంతవేగమే...హటాత్తుగా...ఒక్కమాటైనా లేకుండా...వెళ్లిపోయింది.

గొలాడ్ — (వెక్కివెక్కి) అయ్యో! అయ్యో! అయ్యో!

ఆర్కేల్ — ఇక్కడుండవద్దు. గొలాడ్...అమెకిప్పుడు ప్రశాంతికావాలి...రా, రా...అది మిక్కిలి దారుణమైనదే. అయినా నీదోషముకాదు...ఆమె శాంతికల, నెమ్మదైనపిల్ల...పాప మామె యీప్రపంచము వలెనే ఒక యద్భుతమైనజీవి...అక్కడామె తనబిడ్డకు అక్కవలె పండుకొన్నాది. రా, రా...అయ్యోదైవమా! అయ్యోదైవమా!...నాకుకూడా యేమిబోధపడదు...ఇక్కడనుండి పోదాం పద. రా, ఆబిడ్డ యిక్కడీగదిలో నుండకూడదు...ఆమెకు ప్రతిగా నీమె జీవించియుండాలి...పాప మిక నీ చిన్నిబిడ్డవంతు వచ్చింది.

[అందరు నిశ్శబ్దముగా నిష్క్రమింతురు.]

---

## ఎందుకోయి

అడివి బాపిరాజుగారు, B. A., B. L.

"ఓ శిల్పి! నీవిద్య ఉపదేశ మిచ్చేటి
నీతులే" మని నన్ను నిలిపి ప్రశ్నించావు
"సౌందర్యవిన్యాస చారురేఖల్లోన
నారాణి మూర్తింప నావిద్య" లన్నాను
"ఓ కవీ! నీపాట ఒదుగుమెలుపుల్లోన
చెలువారుసత్యమ్ము సెలవీయు"మన్నావు
"జ్వలితగీతాతటిచ్చలిత కాంతుల్లోన
నారాణి దీపింప నాతప" స్సన్నాను
"ఓహో సంధ్యానటా! నీహస్తముద్రాత్మ
సూక్ష్మమే" మని నీవు సూక్తిస్తి చూపులో
"కిటతకిటతంకిటా కేళీమహాగతిని
చేసి! నిన్నభినయించ దవ్వాయితు" డన్నాను.

---

## ౧

ఏమాట కామాటయే చెప్పవలె; సూపర్నెంటు అంతకుముందు బేడీలు వేయింపకయే ఖైదీలచే తనవాకిట పని చేయించుకొనుచుండెడివాఁడు. ఇటు లుండఁగా ౧౩౮౭ వ నెంబరు ఖైదీ అందఱికంటె నమ్మకముగా పని చేయుచు తప్పించుకొని పాఱిపోయెను. ఎంత ప్రయత్నము చేసినను వాని యానుపానులు దొరకలేదు. ఈ దుర్నయముచే ఖైదీ లందఱును చురల బేడీలు వేయించుకొని పనిచేయ వలసినవా రయిరి.

౧౩౮౭ తప్పించుకొని పోయినందువలన సూపర్నెంటుకు మాటరాలేదా? యని శంక కలుగవచ్చును. సూపర్నెంటు చాల చతురుఁడు. దిక్కులేని బిచ్చగాని నొకని దెచ్చి ౧౩౮౭ గాఁ జేసెను.

నాఁటినుండియు ఖైదీలకు వదులుగా గొలుసులు వేయఁబడుచుండెను. ఆ గొలుసులను గొంచె మటునిటు సర్దుకొనుచు నడుమ నడుమ మాటలు చెప్పుకొనుచు జీతనాతములు లేక సూపర్నెంటు వాకిట పనిపాటలు చేయుచున్న ఖైదీలు కొంద ఱొక్కపర్యాయము లికిపడిరి. జైలుసూపర్నెంటు తన బంగళాలో డ్రాయింగురూమునుండి రీడింగురూములోనికి వెళ్లెను. ఖైదీలకన్నులలో వైర్‌లెస్ టెలిగ్రాములు నడచెను. ఖైదీలందఱును తమ తమ పనులలో మునిఁగిపోయిరి.

సూపర్నెంటు తన వ్రాఁతబల్లకడ నిలిచి దానిమీఁద నున్న ఉత్తరముల నన్నిఁటిని దీసికొని పయిపేరు మాత్రము చూచుచు ఒక్కొక్క యుత్తరమునే బల్లమీఁదఁ బడ వయిచుచుండెను. తుద కాయుత్తరములనన్నిఁటిని కట్టగా కట్టి నేలకు విసరికొట్టెను. కోపము చెందినటులు ఆకట్ట ప్రిదిలెను. ఉత్తరము లన్నియు చిందరవందరగా నేలపైఁ బడెను.

సూపర్నెంటు వట్టిమాటల ప్రోగుకాఁడు; కార్యశూరుఁడు. పిదప నతఁడు నిస్సహాయము లయి పడియున్న ఆయుత్తరములపై తాండవమే చేసెనో, మఱి యేమిచేసెనో కాని ప్రతి యుత్తరమును అతని కాలిజోడుక్రింది లాడముల చేఁపగుఱుతులను తల దాల్చెను.

అతని యీపనివలన భూదేవి యేడుపువలె నొక శబ్దము బయలుదేఱెను. నేలమీఁదిగచ్చు ముక్కలు ముక్కలై లేచెను. అతఁడు తనబలమునకు సంతసించి కాఁబోలు ఆ గచ్చుముక్కలను చేతఁబుచ్చికొని పరీక్షించెను.

వాకిటఁ బనిచేయుచున్న ఖైదీల మోములలో అతికష్టముగా అఁపుకొనఁబడిన నగవు వారి దవడల నుబికించి ముక్కులను వెడద చేయించి నోరుమూయించెను. సూపర్నెంటు

పదధ్వని నియతతాళమానములతో ద్వారము కడకు వచ్చుచుండెను. ఖైదీలు కుక్కినపేల వలె తమతమ పనులలో నప్రమత్తులయి యుండిరి.

సూపర్నెంటు వాకిటికి వచ్చి కుర్చీలో కూర్చుండి ఒకరొక్కరినే చూచెను. దొర గారి కందఱును సలాముచేసిరి. ఒకఁడు మాత్రము పనిపోవునని కాఁబోలు సలాము చేయ లేదు. అతని నంబరు౧౫౭.

నూటయాభై యేడూ, అని సూపర్నెంటు పిలిచెను. అతఁడు ఉలికిపడి చూచి దాపునకు వచ్చెను. సూపర్నెంటు తనబూట్సులుచూచుకొనెను. బూట్సులుగూడ నతని కడలి కొంత చినిఁగెను. 'ఈబూట్సులు విప్పు' అని సూపర్నెంటనెను.

సలాము చేయనందులకు చెప్పుదెబ్బల వ్రాఁత వీని మోమున వ్రాసియున్నదని వారంద ఱనుకొనిరి.

౧౫౭ సూపర్నెంటు కడకు వెళ్లి వంగి చూచి—'ఏలినవారిపాదాలు చెప్పులను కఱచినవి. ఇంకా వాట్లకోపం చల్లాఱినట్లు లేదు; రక్తం కక్కుతున్నవి' అని నోటిమీఁద చేయి వేసికొనెను.

సూపర్నెంటు ౧౫౭ బుజమును తట్టి 'విప్పు' అనెను. ౧౫౭ విప్పి మేజోళ్లతో బూట్సులను తీసెను.

ఖైదీ లందఱును ౧౫౭ ఒంటిమీఁద చెప్పుదెబ్బలనువినుటకు సంసిద్ధులయి యుండిరి.

చప్రాసీ యొకఁడు లోపలినుండి క్రొత్త మేజోళ్లను క్రొత్తబూటుసులను తెచ్చినిలిచెను. సూపర్నెంటు ౧౫౭ ను చూచి ఆ బూటుసులకు సలాము చేయుమనెను. ౧౫౭ బూటుసులకును, పిదప సూపర్నెంటునకును సలాము చేసెను. ఖైదీలు లోలోపలనే నవ్వుకొనిరి. 'ఆబూట్సుతో ఆదవడ ఈదవడ కొట్టుకో' అని సూపర్నెంటనెను.

'నాయంతట నేను కొట్టుకొను వలవాటు లేఁగద నాకులేదు' అని అతఁడు వడివడిగా తన రెండు దవడలను కొట్టుకొనుట నభినయించెను. సూపర్నెంటు ౧౫౭ మొగము నొకతూరి చూచెను. అతఁడు మఱొకమాఱు సలాము చేసి తనపనికి వెళ్లిపోయెను.

చప్రాసీ మేజోళ్లును బూట్సులను సూపర్నెంటుకు తొడిగెను. సూపర్నెంటు మెల్లగా అడుగులు పెట్టుకొనుచు రీడింగురూములోనికిఁ బోయి కూరుచుండెను. అతని వెనువెంటనే చప్రాసీకూడ వెళ్లి నిలువఁబడియుండెను.

'కారు తీసికొనిరమ్మను పో' అని సూపర్నెంటనెను. సెలవు దొరకినటులు చప్రాసీ పరువెత్తెను.

పదినిమిషములలో కారు వచ్చి వాకిట నాఁగెను. తూనీఁగవలె సూపర్నెంటు కారులోని కుఱికెను. జయఘోష మొనరించుచు కారు పరువిడెను.

ఖైదీల కాలిగొలుసు లన్నియు ఒకతూరి గలగలమనెను. పనులు ముగించి యెచటివారచటఁ గూలఁబడిరి.

'ఇవ్వాళ నూటయాభైయేడుకు గండం చిత్రంగా దాటింది రా' అని ఒకఁ డనెను.

'దొరకు పిచ్చియెత్తెనేమోరా! గదిలో ఒకటేగంతులు' అని ఒకఁ డనెను.

'కాదురా, పెళ్లికి డేన్సు నేర్చుకుంటు న్నాఁడురా' అని ఒకఁ డనెను. అందఱును ఆమాటనే సిద్ధాంతము చేసిరి.

౨

మోటారుకారు స్త్రీల చెఱసాలకడ నాఁ గఁగనే మొగసాల తెఱవఁబడెను. సూప ర్నెంటు దిగి లోని కేఁగెను.

అచట పెద్దయుద్యోగమునందున్న ఆంగ్లో ఇండియన్ దొరసాని డిక్కు అనునామెయు సూపర్నెంటును కరస్పర్శ గావించుకొనిరి. కాసుపాసు మని మాటలాడుకొనిరి. దొర సాని తనపనిమీఁదఁ బోయెను. ఆఫీసుగదిలోఁ గూరుచుండి సూపర్నెంటు కాకితములుచూచు కొనెను.

దొరసాని [illegible]ల నందఱను బారుగా నిలువఁబెట్టెను. సూపర్నెంటు వారిని పరీక్షిం చుటకు వెళ్లెను. [illegible]లుపిలువు రతనికి సలాము చేసిరి. కొందఱు కరస్పర్శగావించిరి. కొందఱు స్తంభములవలె నిలువఁబడిరి. కొందఱు ప్రక్క కుఁ దిరిగి చూచుచుండిరి. కొందఱు తల గోఁకుకొనుచుండిరి. మఱికొందఱు వంగి నేలను పాదములను జూచుకొనుచుండిరి.

దొరసాని సూపర్నెంటుకుఁ దెలియ కుండ 'తిన్నగా నిలువుఁ' డని సైగచేసెను. దాని నెవరును పాటింపలేదు.

సూపర్నెంటు 'మిస్ డిక్!' అని పిలిచెను.

దొరసాని కొంచెము ఉలికిపడెను. తనకు పిలుపు వచ్చునని యామె యనుకొనలేదు. ఎవరిమీఁద సూపర్నెంటు కోరడా పడునో యనియే యామె భీతిల్లుచుండెను. ఇట్టిస్థితిలో ఈపిలుపు. 'యెస్ మిస్టర్ హెన్రీ!' అని యామె యనెను.

'చూచితివా [illegible]ను?'

'చూచితిని' అని బదులుపలికి 'అమ్మా! తిన్నగా నిలు!' అని [illegible]తో ననెను. [illegible] నిశ్చలముగా నిలువఁబడియుండెను.

సూపర్నెంటు [illegible] లలాటమును ఆది చూచెను. అతనిచూపు మొగమునుండి పాద ములవఱకును మెల్లఁగాఁ బ్రసరించెను. [illegible]కు ఆచూపు తొండ్రపాఁకినటు లుండెను. ఆమె Insult!-Insult!(అవమానము!అవమానము!) అనుచు అనుజ్ఞగొనకయే వెళ్లిపోయెను. పిదప నొకరితరువాత నొకరు [illegible] లందఱును వెళ్లిపోయిరి.

సూపర్నెంటుముఖ మంతయు మసి పూసినటు లాయెను. ఇంతలో డిక్కు కల్పించు కొని యేదోమాట యెత్తనిచో నతఁ డచేత నుఁడే యగువాఁడో, లేక పిచ్చివాఁడే యగు వాఁడో యెవరు చెప్పఁగలరు?

'32జ. నెలరోజులు జ్వరపడి యిపు డిపుడే కోలుకొనుచున్నది' అని డిక్కీ నెను.

'ఓ యెస్ మదామ్, ఓ యెస్ మదామ్' అనుచు సూపర్నెంటు డిక్కీ చేయి పట్టుకొని యూఁపెను.

వెనువెంటనే అతఁడు మొగముచిట్లించుకొని 'చూచితివా ఈఖైదీలు నా కెంత తిరస్కారము చేసిరో!'

'ఔ నౌను.'

సూపర్నెంటు అవుడు కటచి ఆలోచించుచు నిలువఁబడెను. కొంతవడి కాలము స్తంభించిపోయెను. డిక్కీ గుండియ లుడ్డుగుడుచు కొనెను.

'హిందూస్త్రీలను నేను Fair-sexఅనను.'

'ఔ' నని డిక్కీ నవ్వెను.

'నాముందర ఆఁడువా రింతటి అవినయము చేయుదురా? పశువులు!'

'పశువులు!' అని డిక్కీ అనువదించెను.

'కాఁబట్టి...కాఁబట్టి......' అని యేమేమో అనఁబోవుచు సూపర్నెం టొకసారి డిక్కీ మోమును జూచెను. ఆమె బిక్కమొగము కళాయిలేని అద్దమువలె నుండెను.

'చూచితివా?'

'ఆఁ.'

'పందు లీటుపోటులతోఁగాని మరలవు. 32జ. తప్ప తక్కిన వీరందఱకును ఈరాత్రి నుండి మూఁడురాత్రులవఱకును నిలువుబేడీలు వేయింపుము. వీరికి నడుమ నడుమ ఇట్టి పాఠములు చెప్పచుండవలయును.'

'32జ. తప్ప తక్కినవారికా?'

'ఔను.'

'సరియ' అని డిక్కీ లోలోపల నవ్వుకొనెను.

'డిక్!'

'ఆఁ.'

ఏమో అనవచ్చి ఆఁగిపోయి సూపర్నెంటు డిక్కీ చేతుల నొకపరి ఊఁపి 32జ. గది కడకు వెళ్లెను.

32జ. పాలిపోయియుండెను. తలముడుచుకొనుట కోపికలేక ఎఱ్ఱబాఱిన వేసలి నామె యెత్తి కట్టుకొనుచుండెను. బొట్టు పెట్టుకొనుటకు చెఱసాల నియమము లంగీకరింపవు. ఈ రీతిగా నున్న 32జ. మోము పున్నమనాఁటి వేకువ చందమామ.

సూపర్నెం టాచందమామను జూచుచు నిలువఁబడెను. అతనిహృదయానందము కన్నులకుఁ బెట్టని కాటుకగా మాఱెను. కొంతవడి చూచి యతఁడు గదిగుమ్మముమీఁదికి కాలిడఁబోయెను. వెనుకనుండి డిక్కీ వడిగా వచ్చెను. లోపల పరధ్యానముగా నున్న 32జ. సూపర్నెంటును హఠాత్తుగా చూచి గదితలుపును గభాలున వైచెను. ఆతలుపు హాహాకారము చేసెను. సూపర్నెంటు తొందరపడి వెనుదిరిగెను. డిక్కీను తప్పించుకొని ఆఫీసు గది

లోనికిన్ని పరుపడి మోటారులోనికిని బోయెను. మఱునిముసముననే మోటారు 'బుఱ్ఱ్రు' మనెను.

డిక్కు 3౭౬ గదిలోనికి వెళ్లెను. 3౭౬ ఎడమొగము పెడమొగముగాఁ గూరుచుండెను. డిక్కు దాపునకేఁగి కూరుచుండెను. కొంతసేపటులు కూరుచుండి — 'చూచితివా లక్ష్మీ! దొరగారికి మీమీఁద చాల ప్రేమ.'

'ఛీ పాడుప్రేమ! నామీఁద ప్రేమఏమిటి? నీమీఁద కాదూ?'

'ఔను. నామీఁదనూ ప్రేమే. ఐనను మీమీఁద ఎక్కువ.'

'ఇంకొకతూరి ఇటు లనవలదు. ఇప్పటికి క్షమించితిని.'

'కాదమ్మా! తొందరపడవలదు. మత్తేమియు తప్పులేదు. నీ మొగమున కేతరీను పోలికయున్నది. కేతరీను ఎవరో తెలియునా? దొరగారు ఇఁక ఆమెను పెండ్లిచేసికొందురు.'

'ఏమీ, చెప్పకపోతివి!' అని లక్ష్మి రంయిమని లేచి రెండుబొగ్గులు నూఱి మొగమంతయు పులుముకొనెను.

డిక్కు తెల్లఁబోయెను. 'నయమే, ఇచట కత్తులును కటారులును లేవు' అని అనుకొనెను. 'లక్ష్మీ! నీవు తొందరపడకు! నేనుండఁగా మీకే యపాయమును లేదు మీ రందఱును మామూలుగా ఆడుకొనుఁడు, దొరగారు వచ్చినపుడు మాత్రము బడిపిల్లలవలె నుండుఁడు' అని ఆఫీసుగదిలోనికి వెళ్లిపోయెను.

పరిచారకుఁ డొకఁడు వాకిట వ్రేలాడుచున్న కంచుసిబ్బిమీఁద నాలుగుమాఱులు కొయ్యసూటముతో కొట్టెను.

ఆఁడువా రందఱును ఆటలకు లేచిరి. ఖైదీలకు కాలిబేడీలు చెప్పకయే డిక్కు ఆఫీసుగదినుండి వెళ్లిపోయెను.

సూపర్నెంటు డిక్కు ఈ యిరువురును ఆస్థలమును ఖాళీ చేయఁగనే స్వాతంత్ర్యము కొంచె మాస్థలము నాక్రమించెను.

## 3

కారు మగవారి జైలుగోడలకు ఫర్లాంగు దూరమున ఆఁగెను. సూపర్నెంటు దిగి కొంతదవ్వు నడచిపోయి చెఱసాల బయటి గోడల బీటికఁనుంచి పొంచి చూచుచు నిలువఁబడెను.

చెఱసాల మొగసాల తెఱవఁబడెను. తలమీఁద నీలి పోలీసుపాగాయును, పావురాయి రంగు గల చొక్కాలాగూలును, చేతిలో లాటీయును దాల్చిన వార్డ రొకఁడు గర్వముతో బయటికి వచ్చెను. ఆవార్డరులను ఖయిదీలు సిపాయీ లని వ్యవహరింతురు. ఆసిపాయివెనుక నలుగురుఖయిదీ లొకబరువు బండిని లాఁగికొని వచ్చి బయటి పిట్టగోడ ప్రక్క నున్న చెట్టుక్రింద దింపిరి. సిపాయి దాపున నున్న ఒకచిన్నయింటిలోని కేఁగెను.

ఆబండి కెదురుగా నొకద్వారము కలదు. దాని తలుపులు తెఱవఁబడియుండెను. తమ బంధువులగుఖయిదీలనుకొందఱనుజూడవచ్చిన యిద్దఱు ఆఖయిదీలను బరువుబండిని బెరుకు బెరుకుగా చూచుచు వెలుపటి రోడ్డుమీఁద నిలువఁబడియుండిరి.

ఇంటిలోనికేఁగిన సిపాయి చాటుగానిలిచి ఖయిదీలను జూచుచుండెను. రోడ్డుమీఁద నిలువఁబడిన ప్రేక్షకులు ఖయిదీలను విచిత్రముగాఁ జూచుచుండిరి. జమఖాణపుగీటులు గల పొట్టిచొక్కాలును, మట్టిలాగులును, నెత్తి కంటుకొనియున్న పిచ్చికుళ్లాయిలును గల ఖయిదీలవేసములు వారిమనస్సు కరఁగించెను.

ప్రేక్షకులు తమదెస నదేపనిగా చూచుచుండుట ఖయిదీలలో నొకఁడు కనిపట్టెను.

'పొగాకుకు ఏదయినా ఒకదబ్బు ఇయ్యండి. సిపాయి వస్తాఁడు. వాఁడు చూస్తే మాకు దక్కదు. దబ్బునఇయ్యండి' అనిఖయిదీఅనెను.

ప్రేక్షకుఁడు బేడకాసొకటి విసరెను. ఖయిదీ దానిని కాలిబొటనవ్రేలితో నొక్కిపట్టుకొని అటు నిటు చూచి తీసికొనెను.

'సిపాయి చూచుచో మీకేది దక్కదా? పాపము!' అని రెండవప్రేక్షకుఁ డనెను.

'దయ్యంముందర బిడ్డలా అండి! నాకో దబ్బు పారెయ్యండి' అని రెండవఖయిదీఅనెను.

'అదేమి? ఆబేడ మీరు పంచుకొనుఁడు!' అని మొదటిప్రేక్షకుఁ డనెను.

'బాబూ! వాఁడింకా మాకిస్తాఁడాండీ!' అని రెండవఖయిదీ అనెను.

'ఏమిరా ఈయప్పా?' అని మొదటి ప్రేక్షకుఁ డనెను.

'ఇది నాకు అర్ధాకలి. ఇందులో జవానుకు భాగం. సిపాయికి భాగం. ఒకఅణా మిగిలితే కోమటి ఒకతుంపు ఇస్తాఁడు' అని మొదటిఖయిదీ అనెను.

'పోనీ పాపము!' అని రెండవప్రేక్షకుఁ డొకబేడకాసు గిరవాటు వైచెను. మూఁడవ ఖయిదీ దానిని పాదముతో నొక్కిపట్టి లాఁగుకొనెను.

'చూచితిరా బాబయ్యా, వీఁడు లాఁగుకున్నాఁడు. మఱోటీ పారెయ్యండి.' అని రెండవఖయిదీ అనెను.

'ఓరీ మీదుంపలు తెగ! మీరు నలుగురూ నాలుగణాలు పంచుకొనుఁడు! మీరు గజదొంగలు కాఁబట్టే మీకీగతి పట్టింది' అని మొదటిప్రేక్షకుఁ డనెను.

'బాబూ వాళ్లు మాకియ్యరు. సిపాయి వచ్చే వేళయింది. మఱిరెండుబేడలు పారెయ్యండి' అని రెండవఖయిదీ అనెను.

'మీ రేమినేరము చేసితిరిరా!' అని యడుగుచు ప్రేక్షకు లిరువురును చెరియొకబేడ విసరిరి. ఆరెంటిని రెండవఖయిదీ డేగవలె పట్టుకొని బొడ్డులో దాఁచికొని —'అయ్యా మేము దొంగతనం చేశాం; ఇహా బుద్ధివచ్చింది' అనెను.

'అయ్యా, చూశారా, బేడలు రెండూ మీరు చూస్తూడంగానే వీఁడు దొంగిలించాఁడు. ఇహ దొంగతనం చెయ్యఁడఁట! చూచారా! బుద్ధివచ్చిందఁట! బాబయ్యా! నా కో బేడ పాతెయ్యండి!' అని నాలుగవ ఖయిదీ అనెను.

'ఛీ ఛీ మీ కిచ్చుట మాదే తప్పు. మాకే బుద్ధి వచ్చినది' అని ప్రేక్షకు లనుచుండఁగా సిపాయి వడివడిగా నచటికి వచ్చెను. ఖయిదీలు ముగ్గురు బండిచాటునకు వచ్చి దాఁచిన డబ్బును దీసి మ్రింగిరి.

సిపాయి ప్రేక్షకులను బిలిచి 'ఏమి మాటలాడుచున్నారు? ఖయిదీలతో మాటలాడఁగూడ దని మీ రెఱుఁగరా? మీకు శాస్తి జరుగును' అనెను.

'మాకు తెలియదు మాకు తెలియ'దని ప్రేక్షకులు నసిగిరి. 'మీరు వారి కేమి యిచ్చితి' రని సిపాయి యడుగుచుండఁగా ఖయిదీలొక రొక రొకరొకరిని చాటుచేసికొని ప్రేక్షకులకు చేతులు త్రిప్పుచు సైగలు చేసిరి. గ్రహించి ప్రేక్షకులు 'ఏమియు ఈయలేదు' అనిరి. సిపాయి తల యూఁచెను.

ఖయిదీలు పొండని ప్రేక్షకులకు సైగ చేసిరి ప్రేక్షకులు వడివడిగా పోఁదొడఁగిరి.

'భయములేదు, ఉండుఁడు.' అని సిపాయి యనెను. ప్రేక్షకులు నిలువఁబడిరి.

సిపాయి ఖయిదీల కుళ్లాయిలీసి తల తడవెను. లక్ష్మి సామాన్యముగా దాఁగులాఁడి కదా! చెవులలోనికి చిటికెనవ్రేలు పోనిచ్చి శష్కులివఱకు వెతకెను. ముక్కు మూలలను దాఁక శోధించెను. ఒడ లెల్లెడ పరీక్షించెను. సిపాయికి సిగ్గులేదు; ఖయిదీలకును సిగ్గు లేదు. తుద కతఁడు విసికి ఒకఖయిదీని వంచి మెడమీఁద ఒకగుద్దు గుద్దెను. కొంత రక్తముతో కలిసి రెండుబేడలు నేలపైఁ బడెను. తక్కిన యిరువురును కిక్కురుక్కురు మని కాఁడి యుమిసి కంఠకూపమునుండి రెండు బేడలఁ దీసిరి. సిపాయి వానిని వారిచేతనే తుడిపించి తీసికొని జేబులో వేసికొనెను. ప్రేక్షకులు నిలువున నీఱయిపోయిరి.

ఆసమయమునను సూపర్నెంటు రంగమునఁ బ్రవేశించెను. పొండు పొండని ఖైదీలు సంజ్ఞ చేయులోపలనే సూపర్నెంటు కొరడా వారి వీఁపులమీఁద ముద్రవేసెను.

సిపాయి నాలుగుబేడలను దెచ్చి సూపర్నెంటుముంగల నిలిచెను.

సిపాయి చేయి వాచెను. ఖైదీల కాళ్లనుండి రక్తము కురిసెను. ప్రేక్షకులు తమ బంధువులను జూచుట కనుజ్ఞ గోరకయే పరుగెత్తిరి. సూపర్నెంటు కొరడా ఎగిరిపోయెను.

## ౪

అచటినుండి అన్నిమూలలు పరిశీలించుచు సూపర్నెంటు ముంగసాలకడకు వచ్చెను. డ్రైవరుమోటారునుగూడ నచటికి తోలి నిలిపెను.

వాకిట పారాయిచ్చుచున్న సిపాయులు అప్రమత్తులయి సెల్యూట్ చేసిరి. సూపర్నెంటు చూపులు ముండ్లా యేమి?—ప్రతివానికిని గ్రుచ్చుకొనియెను. సూర్యుఁ డతని తేజమున కోడి చెఱసాల గోడచాటునకేఁగెను. సిపాయులు బాకాలూఁదిరి. ఉద్యోగుల వందనము లందికొనుచు సూపర్నెంటు చెఱసాల లోని కేఁగెను. అతఁడు లోని కేఁగఁగనే మోసాల తలుపులు మూయఁబడెను.

చెఱసాల చుట్టును తాటియెత్తు రాతిగోడ. గోడలోపల వందల యెకరముల నేల. అర్ధచంద్రాకారముగాఁ గట్టఁబడిన ఖయిదీల గదులు. ఉరి తీయఁదగిన వారి గృహాలు. మాఱుమూల వధ్యశాల. సూపర్నెంటుకు అన్నియు కనువిందొనర్చుటకు గోపురాకారముగాఁ గట్టఁబడిన ఎత్తగు మేడ. దుమ్ము దూగర లేని ఘంటాపథములు. లోఁతు లేని నూతులు. గోశాలలు. అచ్చు కూటములు. తివాచీ నేఁతసాలలు. గానుగలు. ఇట్టి చెఱసాల మొగము స్వర్గము; గుండె నరకము. అందు పయివానికి వింతలు వినోదములు; లోపలివారికి చింతలు, చికాకులు. అందు మానవులతోపాటు మహావృక్షములును జన్మశిక్ష ననుభవించుచుండెను. వానితోపాటు అందు బంధింపఁబడిన ఘంటాపథముమాత్రము అనేకులను చెఱలోనికిఁ దెచ్చుచున్నను కొందఱి విడుదలకు దారి నిచ్చుటచేఁ గలకలలాడుచుండెను. సూపర్నెంటు ఆరస్తామీఁద నడచిపోయి ప్రత్యేకముగా కట్టఁబడియున్న ఒక గుహ చెంతకుఁ జనెను.

ఆగుహ గ్రుడ్డిది. దానికి తలలేదు. దాని క్రింద చవుడు. దానికొక ప్రవేశద్వారకంత గలదు. దానిలోనుండి చూచినచో కను లంధకారమయి పోవును.

ఆ గుహలో నొక పురుషుఁడు కలఁడు. అతఁ డాజానుబాహువు. అతనికనులు చేరేఁడు; రొమ్ము బారేఁడు. కంఠము శంఖము. ముఖము సూర్యబింబము.

అతఁడు బయటి యలికిడి విని వంగి కంతలో నుండి చూచెను. ఎదుట సూపర్నెంటు.

అతఁ డా సూపర్నెంటును జూచి గాలికి మొగ్గని పర్వతశిఖరమువలె నిలువఁబడెను.

తనకు సలాము చెప్పక నిలువఁబడియున్న ౨౫౬౭ ను జూచి సూపర్నెంటు లోలోపల మండిపడెను. ౨౫౬౭ ఆమంట నార్పను లేదు; ఎక్కువచేయను లేదు కావున ఆమంట యినుపగుండువలె మండి మండి తనలోఁ దానే చల్లాఱఁజొచ్చెను.

కొంతవడికి సూపర్నెంటు 'ఇరువది యయిదువందల అఱువదియేడూ' అని పిలిచెను.

'ఆఁ.'

'నీ ఉరి రేపే'

'నే నెల్లుండి యనుకొనుచున్నాను. రేపే యగుచో చాలమంచిది. బంధుదర్శనమువలనఁ గలుగు శోకము తప్పిపోవును.'

'నీ బంధువు లెవరు వత్తురు?'

ఆప్రశ్నకు సమాధానము రాలేదు. సూపర్నెంటు కొంచెము ఆగ్రహముతో 'ఎవరా బంధువులు?' అనెను. సమాధానము రాలేదు. సూపర్నెంటు 'మీకుటుంబము వారి కెవరికిని ఇచటికి వచ్చుట కనుజ్ఞ లేదు. ఇంక బంధువు లెవరు?' అనెను. మరల సమాధానము రాలేదు. ముమ్మాఱులకును సమాధానము రానందువలన సూపర్నెంటు కన్నులు రక్తము కురిసెను. మఱి చేయునది లేక అతఁడు 'రేపు సిద్ధముగా నుండుము' అనెను.

'నేను సిద్ధముగా నుండుటదేమి? మీరే సిద్ధముగా నుండవలయును.'

ఈసమాధానము నాలోచించుకొనుచు సూపర్నెంటు వెనుదిరిగెను. అచటనచట దీపములు వర్షాకాలనక్షత్రములవలె మిణుకు మిణుకుమని వెలుఁగఁదొడఁగెను. తమతమ పనులనుండి గూండ్లకు మరలుచున్న బందీలు చేతులయి సూపర్నెంటుకు వంగి వంగి సలాములు చేయుచు తప్పుకొనుచుండిరి. 'మీరే సిద్ధముగా నుండవలయును, మీరే సిద్ధముగా నుండవలయును' అని యనుకొనుచు తల వంచుకొని సూపర్నెంటు దూసిన యమ్ము వలెఁ బోయి కారులోఁ గూరుచుండెను డెప్యూటీజైలరు జైలరు వైద్యులు మొదలగు ఉద్యోగులువచ్చి సెలవుగొనకముందే కారు వెళ్లిపోయెను. సిపాయీలు బాకా లూఁదిరి.

'ఇపుడు దొరగారు ఆఫీసుకాకితముల నయినను తిన్నగఁ జూచుటలేదేమి?' అని డెప్యూటీజైలరు జైలరును అడిగెను.

'దొరగారిపెండ్లి ఎల్లుండి. అదియే పది యాఫీసులంతపనిగా నున్నది.'

'దొరగారి కింతవఱకు పెండ్లి కాలేదేమి?'

'సూపర్నెంటుకు పిల్ల నెవరిత్తురు?'

'జైలరు కిత్తురేమి?'

'జైలరునకును ఈయరు. జైలరును గాక ముందే నాకు పెండ్లి ఆయెను. కొన్నియుద్యోగములకు బాల్యవివాహములు మంచివి.'

'సంతకములు చేయవలసిన కాకితములు చాల నున్నవి. రేపు టపాలో పంపవలెను. దగ్గఱకుఁ బోవుచోఁ బెండ్లికొడుకు చిర్రుబుస్సు మనుచున్నాఁడు. నడుమ నాపని పిడుచకట్టునట్టు లున్నది.'

'దొరపెండ్లి యెల్లుండి. ౹౹గంటలకు ఉరి యెల్లుండి. ఈచిక్కులో దొరగారి పెండ్లికి ముందు మనకు పెద్దపెండ్లిగా నున్నది. రేపు ప్రొద్దున బంగళాకు వెళ్లుఁడు. దొర మిమ్ముల నచట నిలుపఁడు. వెంటనే వ్రాలుపెట్టి మిమ్ము తోలివైచును. దీనికన్న వేఱుపాయము లేదు.'

'ఊహు, నేను పోను. హిందువులకు ఎట్టికెట్ తెలియదని నిందించును. కాకితముల నింటికిఁ బంపుదును.'

వీ రిటులు మాటలాడుకొను చుండఁగా వైద్యులు వచ్చిరి. అందఱును వెడలిపోయిరి.

రెండవచీటి దీసికొని ఆగదిమూసి పడకగది లోనికి వెళ్లిపోయెను.

తరువాత ఆబాగాలాతలుపు లన్నియు మూయఁబడియెను. పట్టఁగలు ఆ బంగళా నిద్రించెను.

సాయంసమయమున బంగళాముందఁలకు డ్రైవరు మోటారును తీసికొనివచ్చెను. తలుపు తెఱచికొనివచ్చి సూపర్నెంటు అం దధిష్ఠించెను. అది పెద్దజైలునకుఁ బోయెను.

సిపాయులు జైలుముంగల డేరామేకుల వలె నిలువఁబడియుండిరి. వారి 'సెల్యూటు' గూడ వారివలెనే నిలువఁబడియుండెను.

మొగసాల తెఱవఁబడఁగనే సూపర్నెంటు గోపురాకారముగా నున్న నడిమేడమీఁది కేఁగి కాకితములపని కొంతచూచుకొనియెను. పిమ్మట నతఁ డుద్యోగుల నందఱను అచటి కాహ్వానించెను. ఒకరితరువాత మఱియొక రందఱును అచటికి వచ్చిరి.

వ్రాసిన కాకితము నొకటితీసి వారి కిచ్చి సూపర్నెంటు—'దీనిని చదివికొని మీ యందఱ సమ్మతిని తెలుపుఁ' డనెను.

ఒకరితరువాత మఱియొక రా కాకితమును జదివికొనిరి. అందఱు నొకవిధమగు సంకోచముతో ఒకరిమొగము మఱియొకరు చూచుచు తలలూఁపుచు బయటికి వచ్చుచు లోపలికిఁ బోవుచు నుండిరి.

సూపర్నెంటు వారిని బిలిచి—'మీకొక పావుగంట గడు విచ్చితిని. బాగుగా ఆలోచించుకొని మీ నిశ్చయమును ఏకగ్రీవముగాఁ దెలుపవచ్చును' అనెను. ఈమాటలు విని వా రాలోచించుకొనుటకు వెళ్లిపోయిరి.

వారందరటు వెళ్లిన వెంటనే సూపర్నెంటు ముంజేతిగడియారమును ముందుంచుకొని ఒక్కొక్క నిముసమునే పరికించుచు—ఒకటి, రెండు, మూఁడు, నాలుగు, ఐదు, ఆఱు. దీనికడుపు కాల! నడవదు' అనుకొనెను.

వలయువాని కేడాది యొక నిముసము. అక్కఱలేనివానికి నిముస మొక యేడాది.

పట్టుమని పదినిముసములు కాకముందే డెప్యూటీజైలరచటికి వచ్చెను.

'మీ రయిదునిముసములు కాకముందే వచ్చుటవలన సమ్మతించితిరని భావింపవచ్చునా?'

'మే మందఱమును సమ్మతించితిమి గాని జైలరుమాత్రము........'

'మంచిది. నాకు చాల సమయమును కూడఁదీసిపెట్టినారు. అతని నొకతూరియిటకు బంపుఁడు!'

డెప్యూటీజయిలరు వెళ్లెను. జయిలరు వచ్చెను.

'ఉరికాకితముమీఁద రేపటి తారీఖు వేసి సంతకము చేయవా?'

'రేపు నేఁడుగా మాఱునా?'

'చెడకు. నీకిది నేరము తెలియునా? రాజద్రోహముకన్న పెద్దది. Lese Majeste. రేపు జరుగవలసిన ఉరి నేఁడే జరుగును. రేపు నేనిచట నున్నచో నాపెండ్లికి ఉరి.'

'ప్రాణములు నేఁడు పోయినచో రేపు రావు. పెండ్లి రేపుగాకున్న నెల్లుండి. ఎల్లుండి గాకున్న నేఁడాదికేఁ కావచ్చును.'

'రేపు నీ వతనికి ప్రాణములు తెచ్చి యిత్తువా?'

'నే నీయఁజాలనుగాని ఈ యిరువదినాల్గు గంటలు ఇత్తును.'

'దానికేని నీకు స్వాతంత్ర్యము కలదు కాఁబోలు. కలరా వచ్చి చచ్చుచో? ఇఁకఁ జాలు. చదువులు చదువకు. సూపర్నెంటు కీచదువులు తెలియును. నీకు ఇష్టము లేదేని వెళ్లి పోవచ్చునుగాని ఇదిగో నీప్రమోషనుకు ఆర్డరు తెప్పించితిని. తీసికొని పొమ్ము.'

జైలరు తీసికొనెను. అతని మొగము చెఱువాయెను. సూపర్నెంటు కనిపట్టెను.

'ఇఁక నీవు వెళ్లవచ్చును.'

జైలరు బొటవ్రేలితో నేల రాచుచు 'సంతకము చేయుదును' అనెను.

'ఇష్టములేనిచో బలాత్కారము లేదు.'

చిఱునగవుతో జైలరు 'చేయుదును' అనెను.

'మంచిది' అని సూపర్నెంటు కలమును కాగితమును కొన్ని కాకితములను అతనికిచ్చి వధ్యశాలలోనికిఁ బోయెను.

ఆకాశమునుండి వ్రేలాడు నుర్రిత్రాడు, దానికిసూటిగా క్రింద రాతితోఁ గట్టఁబడిన పెద్దగోయి, దానిలో వేసియుంచిన ఎత్తుబల్ల, బరువునకుఁ గాను రెండు కాళ్లకును కట్టఁదగిన రెండు ఇసుకబస్తాలు మొదలగు పరికరము నంతయు నతఁడు పరీక్షించి [illegible] కొఱకు ప్రతీక్షించుచుండెను.

జైలుసూపర్నెంటు పెద్దపెద్దశిక్షలిచ్చిన వాఁడే. ఉరిశిక్ష ఉండనగునా, ఉండఁగూడదా యని విచారణము చేయఁగలవాఁడే. వేలాది జీతము తీసికొనువాఁడే. సంఘమునందు చాల మరియాదగలవాఁడే. కాని దుఃఖదగ్ధు లగు జీవులతో నతని క్రీడ. ఈక్రీడ నాఁపివైచుట కాతనికన్న నధికారి యెవఁడు?

యమవాహనపు ఘంటాధ్వనులతో [illegible] ఆగుహలోఁ బ్రవేశించెను. 'సిద్ధముగ నుంటివా?' అని సూపర్నెంటనెను. 'మీరే సిద్ధముగ నుండవలయును' అని [illegible] అనెను. పనిబాగులవారి కీయవలసిన సొమ్మిచ్చి సూపర్నెంటు తలుపులుమూసి బయటికి వచ్చి పనులుచూచికొని మోటారెక్కి వెళ్లిపోయెను. తానుపోయిన పొడుగునను 'మీరే సిద్ధముగ నుండవలయు' ననుమాట అతనిని వెంబడించుచునే యుండెను.

## ౬

డెప్యూటీజయిలరు వైద్యులు మొదలగు నుద్యోగు లందఱు పెండ్లికి వెళ్లిరి. రేపు రాఁగలరు.

నేఁడు జయిలరే డెప్యూటీజయిలరు, వైద్యుఁడు, మఱియు సూపర్నెంటు. ఖయిదీల

కును పనిబాగులవారికిని చిల్లర మల్లర ఉద్యోగులకును అతఁడు నేఁడు పెద్ద.

పంతులు లేనపుడు బడిపెద్దయే పంతులు. బడిపెద్ద తాను పంతు లనుకొనును. కాని బడిపిల్ల లతనిని వెక్కిరింతురు.

జయిలరు సూపర్నెంటుపనులు చూడ దొరకొనెను. నేఁటి సూపర్నెంటు దేనికిని అనుజ్ఞ యిచ్చుటలేదు. విజిటరులకు ఖయిదీలను జూడ ననుజ్ఞ లేదు. ఖయిదీలకు వచ్చిన ఉత్తరములను చింపి చదివించికొని వినుటలేదు ఖయిదీలపరీక్ష లేదు. ఖయిదీల మనవులను చిత్తగించుటలేదు. ఏమియు లేదు. కాని అతఁడు సూపర్నెంటు. దానికి చిహ్నముగా నతఁడు సూపర్నెంటు కుర్చీమీఁదఁ గూరుచుండెను. సిగరెట్లు కాల్చుచుండెను.

అతని కేమియు తోఁపలేదు. మేడ దిగి క్రిందికి వచ్చెను. పాకశాలలోనికిఁ బోయి చూచెను. ముగసాలముంగిలికి వచ్చెను. వీథి దెస చూచుచు నిలువఁబడియెను. కొంతవడి కొకతె యతనిచూపునఁ బడెను. ఆమెముఖము గాండ్రిల్లియుండెను. కలువరేకులవంటి కనుల నుండి నీరు జాఱుచుండెను. గండస్థలములు రక్తోత్పలములు. వాఁడిపోవఁగా నీటఁ బడవయిచిన గులాబీరేకులా పెదవులు.

తాను సూపర్నెంటనుమాట నతఁడు మఱచిపోయెను. మామూలు మనుష్యుఁడై వాకిటికి వచ్చెను.

ఆమె కట్టుకొనినచీరెను, తొడిగికొనిన రైకను, మేనిమార్దవమును, సౌందర్యమునుజూచి ఒకడుగు వెనుకకు వయిచెను.

దూరముగా నొకచెట్టుక్రింద తలలువంచుకొని దుఃఖించుచుఁ గూరుచుండిన స్త్రీలు కొందఱును పురుషులు కొందఱును అతనికిఁ గానిపించిరి.

'అమ్మా! ఏలదుఃఖించెదవు? దుఃఖము గూడ భయపడుప్రదేశమే యిది.'

'కాఁబోలును. కాని నాదుఃఖము భయ మెఱుఁగదు. నా కిఁక దుఃఖ మెంతసేపో ఉండదు.'

'ఏ మది?'

'నేఁడు ఉరితీయఁబడువారి శరీరమును నా కీయఁగోరెదను. తాము నా కిందులకు సాయము చేయఁ గోరెదను.'

జయిలరు నేలదెసఁజూచి మూగవాఁడై పోయెను.

ఆమె యతనిని ఆచి చూచుచుండెను.

'అయ్యా! మాటాడరు.'

జయిలరు మాటాడలేదు. వెనుదిరిగిపోవఁ జూచెను.

'వారసలు రాజద్రోహ మేమియుఁ జేయలేదు. ఉరి తప్పిపోవుచో మీకు శ్రమయే లేదు.'

'ఉరి తప్ప ననుఆశ మీకుఁ గలదా?

'తప్పక కలదు.'

'ఎటులు?'

'ఆయన ద్రోహికాఁడు. సత్యమే సాక్షి. ఉరితప్పుట కింతకంటె ప్రబలమగు నుపాయము వేఱేది?'

'పిచ్చితల్లీ! ఈ కాలమున సత్యము కూట సాక్షి. ఒక అసత్యమును సత్యము చేయుటకు పదిమంది చెప్పుటయే తరవాయి. ఇది వోట్ల యుగము.'

'కాదు, సత్యమునకే జయము'

'ఆమాట నిక్కమే. సత్యము బయటఁబడ వచ్చును. ఫలము మాత్రము శూన్యము.'

'పోనిండు! వారిశరీరమును నాకిప్పింపరా!'

'అదియు వీలుండదు. అతఁడు రాజద్రోహి.'

'ఆమె కనులనుండి ధారాళముగా నీ కురులఁజొచ్చెను.

'మీ రిచట నిఁక నుండరాదు. ఆవలికి పొండు.' అని యతఁడు వెనుదిరిగి పోఁజొచ్చెను. ఆమె వెక్కి వెక్కి ఏడ్చుచు వెంబడించుచుండెను. అతఁడు ముందు, ఆమె వెనుక.

ఇంతలో టపాజవానొకఁడు త్రొక్కుడు బండిమీఁద వడివడిగా వారిరువురను తప్పించుకొని మొగసాలకడ నాఁగి 'సార్ సార్' అని పిలువఁదొడఁగెను.

జయిలరు వడిగా నడచి 'ఏమిటోయీ ఆగోల? మెల్లగా పిలువరాదూ?' అనెను.

'మెల్లగా గాదు. బిగ్గరగా పిలువవలెను. నే నొక ప్రాణాన్ని రక్షించడానికి నురుఁగులు కక్కుకుంటూ వచ్చా. సూపర్నెంటుగారేరీ? సార్ సార్!'

'ఏమిటోయ్ గడబిడ! మెల్లగా చెప్పు.'

'ఆ జమీందారుకు రాయనకు ఉరిశిక్ష తొలఁగించ దని అర్జంటు టెలిగ్రాము వచ్చింది. నాకు జమీందారుగారిదగ్గఱ ఈనాముకూడా దొరుకుతుంది. ఏరీ ఏరీ, దొరగారు?'

'నాయనా! నూఱేండ్లు బ్రతుకు! ఇదిగో నీకు ఈనాము' అని వెనుక నిలిచియున్న యామె తన మెడలోని హారమును టపాజవానుకు ఈయ చేయిజాఁపెను. ఆశ్చర్యపడి టపాజవాను తీసికొనుటకు తటపటాయించుచుండఁగా ఆమె దాని నతనిమీఁదికి విసరివైచెను.

అతఁడు పుచ్చుకొని 'అమ్మా మీ రెవరు?' అనెను.

ఆమె మాటాడలేదు.

'అమ్మా, మీ గులామును నన్ను మఱవకుఁడు.' అనెను.

జయిలరు తెల్లఁబోయి చూచుచుండెను.

'ఏదయ్యా సూపర్నెంటు' అని టపాజవాను గద్దించెను.

'జయిలులో పని చూచుకొనుచున్నారు. అక్కడ పడవయిచి పొమ్ము!'

'మీరయినా కొంచెం చెయ్యి దులపండి.'

'సరే' అని జయిలరు సంకేతము చేసెను. టపాజవాను మఱియొకమారు ఆమెకు నమస్కారము చేసి 'రాజావారిని రైలు దగ్గఱ దర్శనం చేసుకుంటాను.' అని వెళ్లిపోయెను.

'అమ్మా! మీ రీ చుట్టుఁబ్రక్కల నుండ రాదు. బయటి పిట్టగోడ కావల నుండుఁడు. ఊఁ. వడిగా పొండు! సిపాయికి పని కల్పింపకుఁడు!'

ఆమె నగుమోముతో గోడయావలి కేఁగెను.

కొంతవడి కామె బంధుగుల మొగము లన్నియు ఆనందముచే దీపించెను. వా రందఱును వాకిలిని కనులతో కాపలా కాయుచుండిరి.

తమతమ పను లయినపిదప వార్డరులు రాకపోకలు చేయుచుండిరి. జయిలరు వెళ్లిపోయెను.

ఆమెయు ఆమె బంధుగులును సూపర్నెంటునుగుఱించియు, జైలరు నుగుఱించియు ప్రశ్నించిరి. కాని వారి కెవరును సమాధానమొసఁగలేదు. ఇటు లారాత్రి గడఁచెను.

మఱునాఁడు సూపర్నెంటు పెండ్లికొడుకై వచ్చెను.

అతడు కురిచీలోఁ గూర్చుండి వ్రాఁత బల్లమీఁద ఎదురుగా పడియున్న టెలిగ్రాము ను విప్పి చూచికొని అప్రయత్నముగా కురిచీ వెనుక కానుకొనియెను.

---

# వనదేవతలు

ఎ. వి. రత్నముగారు

ప్రకృతి కాంత యనంత విలాసలీల
విశ్వనాట్యరంగమునను విశ్వమోహ
నముగ సల్పెడి నృత్యమునకు దగనట
రాజు పట్టిన మాయతెరయన మున్ను,—

గగనము వెలసె క్రమముగఁ గగ్గె నందు
స్పర్శరసరూప సురభుల పరిమిత మహి
మాన్విత మహాపదార్థము లనిల వహ్ని
సలిలధాత్రులు, ప్రకృతిలాంఛనము లనఁగ.

వెలిఁగె తేజము, పరమాత్మ విమల దివ్య
సత్త్వరూపము, విశ్వవిస్తారమై, ది
గంతరాళములందు నిరంతరముగ
ప్రకృతి ముఖమండల మనోజ్ఞ రాగమనఁగ.

దివ్యతేజుల్ నభోమణి దినకరుండు
మోహనరజత మృదుకాంతిమూర్తి రజని
కరుఁడు జ్యోతిర్గణులు తారకలును గడు ర
హించెను ప్రకృతి మాళిధరించె ననఁగ.

తేజమున కుదయించిరి దేవవిభులు
పావనులు మహేంద్రాది దిక్పతులు మహిత
యశులమృతభోజనులు భక్తివశులు, మఱియు
స్వర్గధాములు విశ్వభాస్వరులు సురలు.

ఒనర సత్త్వమూర్తికి వాయువునకు నుద్భ
వించిరి మరుత్తులురుబలాన్వితులు; కుసుమ
కోమలస్పర్శలు మరుద్వతీమహిళలు;
యక్షవిద్యాధరాదివియచ్చరులును.

జలజగాత్రలు తరళలోచనలు వరుణ
కాంతలు మనోజ్ఞలాస్యలు కాంతిమతులు
చారుచంచలలీలావిహారిణు లుద
యించిరి జలదేవతలంత యంచితగతి.

వారి కమృతాంశుతేజమువలన నుద్భ
వించి సురలోకము నలంకరించిరి యన
మానరూప కాంతిమతులు మానినుల్ సు
రాసుర కలహకారణ లప్సరసలు.

పవనపావకసలిలసంభవలు దేవ
తాంశజనితలు లోకకల్యాణులు వన
దేవతాసతు లతనుతనూవిలాస
వైభవోపేతలు సుగంధవతులు దివ్య
మానిసేవ్యలు ధారుణీమహిత భావ
లనఁగ వెలసిరి భాసురంబైన గతుల.

వీకతో వారలకు సర్వలోక జీవ
నప్రదాయినులకు నిచ్చె నయము మీఱ
తరళకాంతిని తారలు; వరమృగాంక
రవులు భవసుధారస రాగకళల
సొగసుగా నిచ్చి రింద్రాది సురవరేణ్యు
లరసి నందన సిరులను; నప్సరసలు

దివ్యభవ్యరహస్యము లవ్యయముగ;
ఘనత గంధర్వులొసఁగిరి గానకళల
సరస జలదేవతలు సఖీజనములైరి;
యవనిరాజిత వనరాజులయి వెలయఁగ.

రాణవనములఁ బాలించి రాణులైరి
ఖగసమూహము వందిమాగధులు కాఁగ
వరలు హేలావిలాససంపదలఁ దనరి
రమ్యావనరమతో మనోరమలు కాఁగ.

అనుదినము నవ్యకాంతి కళానురాగ
ములను గాంచి యతిథి సత్క్రియల నుదార
చరితలై యాశ్రితుల కనవరత శాంతి!
సుఖము గూర్చుచుందు రెలమి సుస్థిరముగ.

---



తీర్థం

"రేపు కాదుటే అమావాస్య?" అని సీతి సూరిని అడిగింది.

"రేపేనే అమావాస్య. తెల్లారకుండానే నాన్న బండి తీసుకొస్తాట్ట. ఆబండిలో ఎక్కి మనంఅంతా సముద్రానికి స్నానానికి వెళ్లాలిట" అంది సూరి.

"అక్కడే కాదుటే తీర్థం సూరీ" అంది సీతి.

"అక్కడేనే. సీతోయి, అక్కడకేం ఎన్ని దుకాణాలు వస్తాయనుకొన్నావు. బొమ్మలూ, బూరాలూ, బుడగలూ, అన్నీ ఉంటాయి" అంది సూరి.

"ఎంచక్క, ఎంచక్క" అంది సీతి చంకలు గుద్దుకుంటూను.

"నేనూ వత్తా" అంది వెంకి.

"మరి నేనేం నాన్ననడిగి ఇన్ని డబ్బులిచ్చు కొని అన్నీ కొనేసుకుంటాను" అంది సీతి.

"నాన్న నాకుమాత్రం ఇవ్వడా ఏమిటి" అంది సూరి.

"నాకూ ఇత్తాలు" అంది వెంకి.

"సాగరాలమావాస్య కాదుటే సూరీ" అంది సీతి.

"అవునే" అంది సూరి.

"ఒసే మరీ సముద్రమెలాఉంటుందే అక్కయ్యా" అంది సీతి.

"నీళ్లు ఉప్పగా ఉంటాయి. కెరటాలొచ్చి తోసేస్తాయే. భయమేస్తుందమ్మా నాకు" అంది సూరి.

సీతి ఆలోచించడం మొదలుపెట్టింది.

"మనం స్నానం చేస్తాం కాదుటే" అంది సీతి.

"నాన్నా అమ్మా అన్నయ్యా నువ్వు నేనూ వెంకీ అందరూ స్నానంచేస్తాము" అంది సూరి.

సూరీ, సీతీ, వెంకీ కలిసి పెరట్లో తులసెమ్మ కోటదగ్గిర కూర్చుని మాట్లాడు కుంటున్నారు. వాళ్లమ్మ వాళ్లదగ్గిరే కూర్చుని బియ్యంలో బెడ్డలేరుతోంది. వాళ్ళ తువ్వాయి దొడ్లో గంతులేస్తూ ఆడుకొంటోంది. వాళ్లనాన్నగారు కచేరీ కెళ్లారు. వాళ్లన్నయ్య ఆడుకో బోయాడు.

"అమ్మా మరి నన్నుకూడా తీర్థానికి తీసుకెళ్లవుటే" అంది సీతి

"అందరం వెడదాము. సూరోయి, మీరేం పాతపరికిణీలతో స్నానంచేద్దురుగాని, ఉతికిన పరికిణీలూ జుబ్బాలూ తలొకటి తీసుకొండి. తీసుకొని చిన్న మూట కట్టుకొండి. తుడుచుకో డానికి నేతెస్తాలే" అంది వాళ్లమ్మ.

"మరి నీబట్టలో అమ్మా" అంది సూరి.

"నావీ నాన్నగారివీ అన్నయ్యవీ నేమూట కడతానులే" అంది వాళ్లమ్మ.

సూరీ సీతీ వెంకీ లోపలికి పరిగెత్తుకు వెళ్లారు. సూరి ఒక ఎర్రపరికిణీ తీసుకొని సీతికి ఒక ఎర్రపరికిణీ తీసింది.

"దానికి చిరుగులున్నాయే, అది వద్దు" అంది సీతి. ఇంకోపరికిణీ బాగులేదంది సీతి. చివరకి ఒక తెల్లపరికిణీ సీతికి తీశారు. వెంకికి ఒకపట్టుపరికిణీ తీశారుగాని 'అమ్మ కొడుతుంది' అని అది మళ్లీపెట్టెలోపెట్టి ఒకగళ్ల పరికిణీ తీశారు. తరవాత ముగ్గురికీ చార్ల జుబ్బాలు తీసుకొన్నారు. అవన్నీకలిపి ఒక గుడ్డలో మూటకట్టుకొని ఆమూట వాళ్లనాన్నగారి బల్లమీద దాచుకొన్నారు.

తరవాత వాళ్లమ్మ వాళ్ల ముగ్గురికీ జడలు విప్పి చమురురాసి తలదువ్వింది. తరవాత ముడివేసింది.

"ముడేస్తావేమే అమ్మా, జడెయ్యవుటే" అంది సూరి.

"రేపు స్నానాలు కాదూ" అంది వాళ్లమ్మ.

దీపాలుపెట్టాక వాళ్లనాన్నా అన్నయ్యా కూడా వచ్చారు.

అందరూకలిసి భోజనాలుచేసి పడుక్కున్నారు. సూరీ సీతీ రాత్రి ఒకమంచంమీదే పడుక్కున్నారు. మధ్యమధ్య సీతి లేచి "తెల్లారిందే అక్కయ్యా" అని అడిగేది. "ఇంకాలేదే పడుక్కోవే" అనేది సూరి.

... ... ... ... ...

తెల్లారింది రెండెడ్లబండి గుమ్మంలో నిలబడి ఉంది. నారాయణ వాళ్లమ్మ ఇచ్చిన బట్టల సంచీ మూట పట్టుకొని బండి ఎక్కి కొరడా పుచ్చుకొని చల్ చల్ అంటున్నాడు. తరవాత వాళ్లమ్మ వెంకినీ సీతినీ బండి ఎక్కించి తను కూడా బండెక్కింది. సూరి తన బట్టలమూట పట్టుకొని బండెక్కింది. వాళ్లనాన్నగారు తలుపులు తాళమువేసి వచ్చి బండి చివర ఎక్కి కూర్చున్నారు.

బండివాడు బండితోలాడు.

సూరీ సీతీ ఒకచోటే కూర్చుని పక్క ఇళ్లూ రోడ్డూ తొంగి తొంగి చూస్తున్నారు. వెంకి

# చిత్రసంచయము



అంకోరునందు పాడుపడియున్న మహా హిందూ దేవాలయము.

(A Silhouette)

చిత్రకారుడు: శ్రీ తలిశెట్టి రామారావుగారు.



షణ్ముఖదైవము (విచిత్ర - ఛాయాచిత్రము)

'వైస్స ఆఫ్ ఇండియా' సాప్తాహిక సంచికనుండి.

వాళ్ళమ్మ పక్కని కూర్చుని బండి ఎద్దులకేసి చూస్తూ ఎద్దులమెళ్లో గంటలమోత వింటోంది. నారాయణ చల్ చల్ అంటున్నాడు.

"అబ్బాయీ లోపలకూ రారా. బండితోల్తారురా నిర్భాగ్యుడా" అన్నాడు వాళ్లనాన్న. నారాయణ లోపలికి వచ్చాడు.

"ఈమూట ఎవరిదే" అన్నాడు వాళ్ల నాన్న.

"ఇది మాది" అంది సూరి.

"ఇదకూడా ఆ సంచిలో పెట్టుకోరాదూ" అన్నాడు వాళ్లనాన్న.

"ఇలా తేవే సంచిలో పెడతాను" అని వాళ్లమ్మ పుచ్చుకొని సంచీలో పెట్టింది.

సముద్రానికి ఎన్నో బళ్లు వెళుతున్నాయి. ఆ బళ్లతోపాటు ఈబండీ వెళుతోంది. తోవలో బొమ్మలదుకాణాలూ, మేడలూ, బట్టలదుకాణాలూ, మిఠాయిదుకాణాలూ, ముష్టివాళ్లూ అందరూ వాళ్లకి కనిపించారు. సీతి వెంకి అందరినీ వింతగా చూస్తున్నారు. తాళాలూ తప్పట్లూ వాయించుకొంటూ కొందరు వెళుతున్నారు. కొందరు అచ్చుకాకితాలు పంచి పెట్టుతున్నారు. కొందరబ్బాయిలూ అమ్మాయిలూ ముస్తాబై నడిచి వెళ్లుతున్నారు.

"చూడవే సూరీ, ఆ అమ్మాయి మిఠాయిఉండ తింటూ వాళ్లమ్మ వెనక్కాలే నడిచి వెళ్లుతోంది" అంది సీతి.

"చూడొసే ఆ అమ్మిని. పిల్లకు పాలిస్తూనే నడిచి వెళ్లుతోంద" అంది సూరి.

"ఊరుకో" అన్నాడు వాళ్ళనాన్న. సీతి నిము ళంగా వాళ్ళనాన్నకు వినబడకుండా సూరిని గిల్లి పిలిచి "చూడొసే, ఆ అబ్బి, కొరడ పుచ్చుకు ఎలాకొట్టుకుంటున్నాడో. ఆపెట్టలో దేమిటే" అంది సూరి.

"అదేదో అమ్మవారే. వాళ్లు అడుక్కునే వాళ్లు" అంది సూరి.

"ఇంకా ఎంతదూరమే సముద్రం" అంది సీతి.

"నాకు తెలియదమ్మా, నాన్న కోప్పడుతాడూరుకో" అంది సూరి

కొంతసేపటికి వాళ్లబండి సముద్రం దగ్గిరి వచ్చింది. అందరూ అక్కడ స్నానం చేస్తున్నారు. బండివాడు బండాపి దిగమన్నాడు. అందరూ దిగారు. సీతి నేను దిగగలనని బండి లోంచి ఉరికింది. వాళ్లనాన్న కోప్పడ్డాడు. వెంకిని వాళ్లమ్మ దింపింది.

బట్టలనచీ బండిలో నేఉంచి చూస్తూ ఉండమని బండివాడితో చెప్పి వాళ్లు స్నానంచెయ్యడానికి సముద్రందగ్గిరికి వెళ్లారు.

"ఇదేనుటే సముద్రం. అమ్మయ్యో! నాకు భయమేస్తోందే" అంద సీతి. వెంకి వాళ్లమ్మ బట్ట గట్టిగా పట్టుకొంది. వాళ్లమ్మ చేతితో కంచెంబు పట్టుకొని వెంకిని రెండోచేత్తో పట్టుకొని స్నానంచెయ్యడానికి సముద్రంలో దిగింది.

సీతి, సూరి చెయ్యిపట్టుకొని సముద్రాన్ని చూచి నవ్వుతూ "నాకు భయమేస్తోందే" అంది. వాళ్ల నాన్నగారు "దిగండి ఈపాటి. స్నానం చెయ్యండి" అన్నారు.

నలుగు రైదుగురు బ్రాహ్మలు నేను స్నానం చెయ్యిస్తానంటే నేను స్నానం చేయిస్తా నని వాళ్ల చుట్టూ మూగారు.

వాళ్లమ్మ మోకాలిలోతు నీళ్ళల్లోకి వెళ్లింది. వెంకి వాళ్ళమ్మ వెనక్కాల నిలబడింది బట్ట గట్టిగా పట్టుకొని. వాళ్ళమ్మ వెనక్కాలే పరికిణీలు పైకిపట్టుకొని సూరీ సీతీ నిలబడ్డారు. కొంగున మూటకట్టుకొన్న పసుపుపొట్లం తీసి వాళ్లమ్మ పసుపు నీటితో తడిపి తన మొహానికి రాసుకొని సూరి మొహానికీ సీతి మొహానికీ వెంకి మొహానికీ రాసింది. తరవాత సూరినీ సీతినీ నీటిలో కూచోబెట్టి జుట్టుముడివిప్పి చెంబుతో నీళ్లుముంచి వాళ్ల నెత్తిమీద పోసింది. అలాగే వెంకినికూడా స్నానం చేయించింది. నీ ళ్లెలా వుంటాయో అని సీతి ఎవరికీ చెప్పకుండా కొంచెం నోట్లో పోసుకొని ఉప్పగా ఉండడంవల్ల ఉమ్మివేసింది.

సముద్రపు కెరటాలు చిన్నవి ఒకదాని వెనక ఒకటి వచ్చి వాళ్లను ఉక్కిరిబిక్కిరి చేశాయి. వాళ్లు భయపడి గట్టుమీదకు వెళ్లి నిలబడి గచ్చులా ఉన్న ఇసుకమీద కాళ్లదువుతూ తీస్తూ నవ్వుతున్నారు.

వాళ్ళమ్మకూడా నీళ్ళల్లోకూచ్చుని చెంబుతో నీళ్లుముంచి నెత్తిమీదపోసుకొని స్నానం చేసి గట్టుకు వచ్చింది.

వాళ్ల చుట్టూ బ్రాహ్మలు మూగారు. వాళ్ల అమ్మకు స్నానం చేయించారు. వాళ్లమ్మ కొంగు మూటవిప్పి సూరిచేత ఒకడబ్బా సీతిచేత ఒకడబ్బా వెంకిచేత ఒకడబ్బా బ్రాహ్మల కిప్పించింది. తనుకూడా ఇచ్చింది.

వాళ్లనాన్నా అన్నయ్యా దూరంగా పెద్ద కెరటాలలో స్నానంచేసివచ్చారు. అందరూ మళ్లీ బండిదగ్గిరికి వచ్చారు.

వాళ్లమ్మ అందరితలలూ తుడిచి సూరిమూట తీసి పరికిణీలూ జుబ్బాలూ తొడుక్కోమని ఇచ్చింది. సూరీ, సీతీ, వెంకీ తడిపరికిణీలు వదిలివేసి కొత్తపరికిణీలూ జుబ్బాలూ తొడుక్కున్నారు. తడిజుత్తు విరబోసుకున్నారు ఆరడానికి. మొహంమీద కుంకుంబొట్టు పెట్టింది వాళ్లమ్మ ముగ్గురికీని.

వాళ్లమ్మ తడిబట్ట వదిలేసి పట్టుచీర కట్టుకొంది. వాళ్లనాన్నా అన్నయ్యాకూడా కొత్త బట్టలు కట్టుకొన్నారు.

తరవాత వాళ్లన్నయ్య అరటిపళ్లూ, కొబ్బరికాయా, హారతికర్పూరం తేవడానికి వెళ్లాడు. “అమ్మా, మరి ఎక్కడికే వెళ్లడం” అని సూరి అడిగింది.

“దేముడిగుళ్లోకి” అంది వాళ్లమ్మ.

“దేముడిగుళ్లోకి వెడదామే, వెంకీ?” అంది సీతి.

“ఊఁ” అంది వెంకి.

ఆదారిని ఒకముసలమ్మ స్నానంచేసి తడిబట్టలతోనే వెడుతూ వాళ్లమ్మనుచూచి ఆగింది. ఆగి వాళ్లమ్మకేసి నిదానించి చూస్తోంది. వాళ్లమ్మ ఆవిడకేసిచూచి, “దొడ్డమ్మా” అంది.

"నువ్వాటే నాతల్లీ. అవునో కాదో అని చూస్తున్నాను. ఎన్నాళ్లి కనిపించావమ్మా. ఎన్నాళ్లకి కనిపించావమ్మా తల్లీ" అంది.

సూరీ సీతీ వెంకీ ఆవిడకేసి చూచి నవ్వుకొంటున్నారు.

"స్నానాని కొచ్చావా, దొడ్డమ్మా" అంది వాళ్లమ్మ.

"అవునే నాతల్లీ. ఇలారా అమ్మా, ఇలారా. ఎప్పుడో చిన్నప్పుడు చూడ్డమే. మళ్లీ చూడనే లేదు. న న్నోమాటు చూచుకోనియ్యి, ఇలారా" అంది ఆవిడ.

వాళ్లమ్మ ఆవిడదగ్గిరికి వెళ్లింది. ఆవిడ వాళ్లమ్మ ఒంటిమీద చెయ్యివేసి తడుముతూ, "ఈవేళ ఎంతపుణ్యమమ్మా, నాతల్లిని చూశాను. మీ ఆయన ఏడే అమ్మా" అంది ఆవిడ.

"అరుగో బండిదగ్గిర ఎవరితోనో మాట్లాడుతున్నారు" అంది వాళ్లమ్మ.

"ఏం, నాయనా, బాగున్నావా. ఒకమాటు తల్లినీపిల్లలనూ తీసుకురమ్మంటే తీసుకొచ్చావు కాదు గదా. చచ్చే ముసలిదాన్ని ఒకమారు చూడాలని ఎంతో మనస్సు పీకుతూ ఉంది. పోనీ ఇక్కడైనా కనిపించారు" అంది ఆవిడ.

"బాగున్నా అత్తయ్యా. ఏదో తీరుబడి లేక పిల్లల్ని తీసుకురాలేదు" అన్నాడు వాళ్ల నాన్న.

"ఒస్సే నర్సమ్మా, నీకెంతమందే పిల్లలూ" అంది ఆవిడ.

"ఒక మగపిల్లాడూ ముగ్గురు ఆడపిల్లలూను. అబ్బాయి పళ్లు తేవడానికి వెళ్లాడు. అమ్మాయిలు వీళ్లే" అంది వాళ్లమ్మ.

"పిల్లేనటే. చెప్పావు కావు. రత్నాల్లాగ ఉన్నారమ్మా పిల్లలూ. రాఅమ్మాఎత్తుకుంటా రా" అని వెంకిని పిలిచింది. వెంకి రాలేదు.

"నీపేరెవరే" అంది సూరిని ఆవిడ.

"సూరి. మాచెల్లాయి పేరు సీతి. చిన్నిచెల్లాయి పేరు వెంకి" అంది సూరి.

"మా అమ్మే, ఎంత బుద్ధిమంతురాలో. చచ్చి నీకడుపున పుడతానే. అవునే నర్సమ్మా, పెద్దమ్మాయికి మీఅమ్మ పేరేనే పెట్టావేమిటే పెట్టింది" అంది.

"అవును దొడ్డమ్మా" అంది వాళ్ళమ్మ.

"ఏదో పదిపువ్వులూ పదికాయలూ కాసి పదికాలాలపాటు అయిదోతనం గలిగి బతకడం కావాలి" అంది ఆవిడ.

వాళ్లన్నయ్య పళ్లూ అవీ తెచ్చాడు. వాళ్ల నాన్నా, వాళ్ళఅమ్మా, దొడ్డమ్మా అందరూ కలిసి దేముడిగుళ్లోకి వెళ్లి కొబ్బరికాయా అరటిపళ్లూ హారతికర్పూరం దేవుడికిచ్చారు. సూరికీ సీతికీ వెంకికీ దేవుడు కనిపించనేలేదు. అంతా జనమే. లోపలికి వెళ్ళడానికి స్థలమే లేదు. ఎలాగో వాళ్లనాన్న లోపలికి తీసుకెళ్లాడు. కొబ్బరికాయముక్కా అరటిపండూ దేవుడు ప్రసాదం ఇచ్చాడు. పూజారి అందరికీ శఠగోపం పెట్టాడు.

నలుగు రైదుగురు బ్రాహ్మలు నేను స్నానం చెయ్యిస్తానంటే నేను స్నానం చేయిస్తా నని వాళ్ల చుట్టూ మూగారు.

వాళ్లమ్మ మోకాలిలోతు నీళ్ళల్లోకి వెళ్లింది. వెంకి వాళ్ళమ్మ వెనక్కాల నిలబడింది బట్ట గట్టిగా పట్టుకొని. వాళ్ళమ్మ వెనక్కాలే పరికి ణీలు పైకిపట్టుకొని సూరి సీతి నిలబడ్డారు. కొం గున మూటకట్టుకొన్న పసుపుపొట్లం తీసి వా ళ్లమ్మ పసుపు నీళ్తో తడిపి తన మొహానికి రాసుకొని సూరి మొహానికీ సీతి మొహానికీ వెంకి మొహానికీ రాసింది. తరవాత సూరినీ సీతినీ నీటిలో కూచోబెట్టి జుట్టుముడివిప్పి చెంబుతో నీళ్లుముంచి వాళ్ల నెత్తిమీద పోసింది. అలాగే వెంకినికూడా స్నానం చేయించింది. నీళ్లెలా వుంటాయో అని సీతి ఎవరికీ చెప్పకుండా కొం చెం నోట్లో పోసుకొని ఉప్పగా ఉండడంవల్ల ఉమ్మినేసింది.

సముద్రపు కెరటాలు చిన్నవి ఒకదాని వెనక ఒకటి వచ్చి వాళ్లను ఉక్కిరిబిక్కిరి చేశాయి. వాళ్లు భయపడి గట్టుమీదకు వెళ్లి నిలబడి గచ్చులా ఉన్న ఇసుకమీద కాళ్లిదమతూ తీస్తూ నవ్వుతున్నారు.

వాళ్ళమ్మకూడా నీళ్ళల్లోకూర్చొని చెంబుతో నీళ్లుముంచి నెత్తిమీదపోసుకొని స్నానం చేసి గట్టుకు వచ్చింది.

వాళ్ల చుట్టూ బ్రాహ్మలు మూగారు. వాళ్ల అమ్మకు స్నానం చేయించారు. వాళ్లమ్మకొంగు మూటవిప్పి సూరిచేతి ఒకడబ్బూ సీతిచేతఒక డబ్బూ వెంకిచేత ఒకడబ్బూ బ్రాహ్మల కిప్పిం చింది. తనుకూడా ఇచ్చింది.

వాళ్లనాన్నా అన్నయ్యా దూరంగా పెద్ద కెరటాలలో స్నానంచేసివచ్చారు. అందరూ మళ్లీ బండిదగ్గిరికి వచ్చారు.

వాళ్లమ్మ అందరితలలూ తుడిచి సూరిమూట తీసి పరికిణీలూ జుబ్బాలూ తొడుక్కోమని ఇచ్చింది. సూరీ, సీతీ, వెంకీ తడిపరికిణీలు వదిలివేసి కొత్తపరికిణీలూ జుబ్బాలూ తొడు క్కున్నారు. తడిజుత్తు విరిబోసుకున్నారు ఆర డానికి. మొహంమీద కుంకుంబొట్టు పెట్టింది వాళ్లమ్మ ముగ్గురికీని.

వాళ్లమ్మ తడిబట్ట వదిలేసి పట్టుచీర కట్టుకొం ది. వాళ్లనాన్నా అన్నయ్యాకూడా కొత్త బట్టలు కట్టుకొన్నారు.

తరవాత వాళ్లన్నయ్య అరటిపళ్లూ, కొబ్బరి కాయా, హారతికర్పూరం తేవడానికి వెళ్లాడు. "అమ్మా, మరి ఎక్కడికే వెళ్లడం" అని సూరి అడిగింది.

"దేముడిగుళ్లోకి" అంది వాళ్లమ్మ.

"దేముడిగుళ్లోకి వెడదామే, వెంకీ?" అంది సీతి.

"ఊఁ" అంది వెంకి.

ఆదారిని ఒకముసలమ్మ స్నానంచేసి తడిబట్టల తోనే వెడుతూ వాళ్లమ్మనుచూచి ఆగింది.ఆగి వాళ్లమ్మకేసి నిదానించి చూస్తోంది. వాళ్లమ్మ ఆవిడకేసిచూచి, "దొడ్డమ్మా" అంది.

"నువ్వేటే నాతల్లీ. అవునో కాదో అని చూస్తున్నాను. ఎన్నాళ్ళ క్కనిపించావమ్మా. ఎన్నాళ్ళక్కనిపించావమ్మా తల్లీ" అంది.

సూరి సీతీ వెంకీ ఆవిడకేసి చూచి నవ్వుకొంటున్నారు.

"స్నానానికొచ్చావా, దొడ్డమ్మా" అంది వాళ్లమ్మ.

"అవునే నాతల్లీ. ఇలారా అమ్మా, ఇలారా. ఎప్పుడో చిన్నప్పుడు చూడ్డమే. మళ్లీ చూడనే లేదు. నన్నోమాటు చూచుకోనియ్యి, ఇలారా" అంది ఆవిడ.

వాళ్లమ్మ ఆవిడదగ్గిరికి వెళ్లింది. ఆవిడ వాళ్లమ్మ ఒంటిమీద చెయ్యివేసి తడుముతూ, "ఈవేళ ఎంతపుణ్యమమ్మా, నాతల్లిని చూశాను. మీ ఆయన ఏడే అమ్మా" అంది ఆవిడ.

"అరుగో బండిదగ్గిర ఎవరితోనో మాట్లాడుతున్నారు" అంది వాళ్లమ్మ.

"ఏం, నాయనా, బాగున్నావా. ఒకమాటు తల్లినీపిల్లలనూ తీసుకురమ్మంటే తీసుకొచ్చావు కాదు గదా. చచ్చీ ముసలిదాన్ని ఒకమారు చూడాలని ఎంతో మనస్సు పీకుతూ ఉంది. పోనీ ఇక్కడైనా కనిపించారు" అంది ఆవిడ.

"బాగున్నా అత్తయ్యా. ఏదో తీరుబడి లేక పిల్లల్ని తీసుకురాలేదు" అన్నాడు వాళ్ల నాన్న.

"ఒస్సే నర్సమ్మా, నీకెంతమందే పిల్లలూ" అంది ఆవిడ.

"ఒక మగపిల్లాడూ ముగ్గురు ఆడపిల్లలూను. అబ్బాయి పళ్లు తేవడానికి వెళ్లాడు. అమ్మాయిలు వీళ్లే" అంది వాళ్లమ్మ.

"వీళ్లేనటే. చెప్పావు కావు. రత్నాల్లాగ ఉన్నారమ్మా పిల్లలూ. రాఅమ్మా ఎత్తుకుంటా రా" అని వెంకిని పిలిచింది. వెంకి రాలేదు.

"నీపేరేవరే" అంది సూరిని ఆవిడ.

"సూరి. మా చెల్లాయి పేరు సీతి. చిన్ని చెల్లాయి పేరు వెంకి" అంది సూరి.

"మా అమ్మో, ఎంత బుద్ధిమంతురాలో. చచ్చి నీకడుపున పుడతానే. అవునే నర్సమ్మా, పెద్దమ్మాయికి మీఅమ్మ పేరేనే ఏమిటే పెడత" అంది.

"అవును దొడ్డమ్మా" అంది వాళ్ళమ్మ.

"ఏదో పదిపువ్వులూ పదికాయలూ కాసి పదికాలాలపాటు అయిదోతనం గలిగి బతకడం కావాలి" అంది ఆవిడ.

వాళ్లన్నయ్య పళ్లూ అవీ తెచ్చాడు. వాళ్ల నాన్నా, వాళ్ళఅమ్మా, దొడ్డమ్మా అందరూ కలిసి దేముడిగుళ్లోకి వెళ్లి కొబ్బరికాయా అరటిపళ్లూ హారతికర్పూరం దేవుడికిచ్చారు. సూరికీ సీతికీ వెంకికీ దేవుడు కనిపించనేలేదు. అంతా జనమే. లోపలికి వెళ్ళడానికి స్థలమే లేదు. ఎలాగో వాళ్లనాన్న లోపలికి తీసుకెళ్లాడు. కొబ్బరికాయముక్కా అరటిపండూ దేవుడు ప్రసాదం ఇచ్చాడు. పూజారి అందరికీ శఠగోపం పెట్టాడు.

"నాకూ టోపీపెట్టాడే" అంది సీతి.

"నాకూను" అంది వెంకి.

"టోపీ అనకూడదు. శఠగోపం అనాలి" అంది సూరి.

"దేవుడుగుళ్లోనుంచి వచ్చినతరవాత వాళ్లమ్మ వాళ్ళదొడ్డమ్మతో, "దొడ్డమ్మా, వెళతామే. బండొచ్చింది. బండీమీద వెళతాము. పోనీ నీవొకమారు రాకూడదూ, ఒక నెల్లాళ్లపాటు మా ఇంట్లో ఉండవచ్చును గదా" అంది వాళ్లమ్మ.

"అమ్మకుకూడా అమ్మ ఉంటుందా" అని సీతి సూరిని అడిగింది.

"అన్నకి అమ్మేంతీ" అంది వెంకి. సూరి నవ్వింది.

దొడ్డమ్మ అందికదా "ఇప్పుడు వెళ్లడమేమిటే నాతల్లీ. పిల్లలుండగలరా. వద్దు. వద్దమ్మా ఎండలో వెళ్లకండి. ఇక్కడికి అరకోసెగా మాఇల్లు. అక్కడికి రండి. పిల్లలకు కడుపు నిండా అన్నంపెట్టుకొంటాను. మీరూ తిందురుగాని. తరువాత తీర్థంచూచి సాయంత్రానికి ఇంటికి వెడుదురుగాని" అంది ఆవిడ.

"మాకు ఉపోష్యంకాదు దొడ్డమ్మా" అంది వాళ్లమ్మ.

"పోనీ పిల్లలే తింటారు. అయినా కనీ పెంచీదా నవు నీ కుపోష్యం ఎందుకుతల్లీ" అంది ఆవిడ.

"నాకు రావడాని కేమిటే దొడ్డమ్మా. నే వస్తాను. మాఆయనతోకూడా చెప్పు" అంది వాళ్లమ్మ. వాళ్లనాన్నకూడా దొడ్డమ్మాగారింటికి వెళ్లడానికి ఒప్పుకొన్నాడు.

అందరూ కలిసి వాళ్లఇంటికి వెళ్లారు. దొడ్డమ్మా వాళ్లమ్మా కలిసి మడికట్టుకొని వంట చేశారు.

సూరీ, సీతీ, వెంకీ, వాళ్లన్నయ్యా, వాళ్ల నాన్నామాత్రం భోంచేశారు. వాళ్లమ్మ ఉపోష్యం ఉండి ఫలారంచేసింది. దొడ్డమ్మా, వాళ్లమ్మా కలిసి చాలాసేపు కబుర్లు చెప్పుకొన్నారు.

సూరీ సీతీ వెంకీ నిద్రపోయారు. వాళ్లన్నయ్య ఊరుచూడ్డానికి వెళ్లాడు. వాళ్లనాన్న వీధరుగుమీద తాటాకుచాపమీద కూర్చుని ఆప్రూరి మునసబుతో మాట్లాడుతున్నాడు.

చల్లబాటువేళని మళ్లీ బండికట్టించుకొని అందరూ తీర్థాని కెళ్లారు.

"అమ్మా, మరి ఆవిడెవరే" అని సీతి అడిగింది.

"నాతల్లి నాతల్లి నేనెవరని అడుగుతున్నావా" అంది దొడ్డమ్మ.

"ఏమే అమ్మా" అంది సీతి.

"ఆవిడ మాఅమ్మ పెత్తల్లికూతురే. నాకు దొడ్డమ్మవుతుంది" అంది వాళ్లమ్మ.

"అమ్మా నీకుకూడా అమ్ముందా" అంది సీతి.

"నాకుమాత్రం అమ్మలేదూ." అంది వాళ్ళమ్మ నవ్వుతూ.

బండి తీర్థపుదుకాణాల దగ్గిరికి వచ్చి ఆగింది. అందరూ దిగారు. వాళ్లమ్మ రవికల గుడ్డలూ,

పసుపుకుంకుమం అన్నీ కొంటోంది. సూరీ సీతీ వెంకీ వాళ్లమ్మ వెనకాలే అన్నీ చూస్తూ బయలుదేరారు. వాళ్లనాన్న అన్నయ్యా ఇంకోదుకాణంమీద ఒకచాకూ ఒక ఈలా కొనుక్కొన్నారు.

దొడ్డమ్మా, వాళ్లమ్మా వాళ్లన్నయ్యా కలిసి గరిటెలూ, రాచ్చిప్పలూ కొనుక్కొడానికి వెళ్లారు.

వాళ్లనాన్నా సూరీ సీతీ వెంకీ బొమ్మలు అవీ కొనుక్కోడానికి ఇంకోవేపు వెళ్తున్నారు. "నాన్నా నాకేమేనా కొనుక్కోడానికి డబ్బు లియ్యవూ" అని సూరి అడిగింది.

నాకూడా ఇయ్యవు నాన్నా" అని సీతి అడిగింది.

"నాకో నాన్నా" అంది వెంకి. వాళ్లనాన్న ముగ్గురికీ తలోపావలా ఇచ్చి పారేసుకోకండి సుమా అన్నాడు. పావలాపుచ్చుకొని చేతుల్లో గట్టిగా పిటకరాయిలాగ పట్టుకున్నారు.

వాళ్ళనాన్న దుకాణాలన్నీ చూపెడుతున్నాడు. అన్నీ చూస్తున్నారు. ఒకచోట దొమ్మరి వాళ్లు మొగ్గలువేస్తూంటే కొంతసేపు నిలబడిచూశారు. దొమ్మరి అబ్బి తాడును పాముచేశాడు. వాళ్లు ఆశ్చర్యపోయారు. ఒక దొమ్మరిఅమ్మి ఒకపెద్ద వెదురుగెడఎక్కి ఆగడమీద బోర్లాపడుకొని గిర్రునతిరిగింది. సూరీ సీతీ వెంకీ చూచి ఎంతోనవ్వారు. వాళ్లనాన్న దొమ్మరివాళ్లకు ఒకడబ్బు ఇచ్చాడు.

ఇంకోచోట రంకులరాట్నము ఉంది. లక్క గుర్రాలమీద కూచుని అందరూ గిర్రున తిరుగుతున్నారు. సూరీ సీతీ వెంకీ కూడా కూచుంటామన్నారు. "పడ్డమ్మా పడతారు" అన్నాడు వాళ్లనాన్న. వాళ్లు మారాం చేశారు. అప్పుడు వాళ్లనాన్న ఊరికే ఒక మాటు గుర్రాలమీద కూచోబెట్టాడు. లక్కగుర్రంమీద కూచుని సీతి "చల్ చల్ గుర్రం" అంది. వెంకిని వాళ్లనాన్న పట్టుకొన్నాడు సూరి ఇనపఊస గట్టిగాపట్టుకొని నవ్వుతూ కూచుంది. ఒక్కమాటు రాట్నం తిప్పించి వాళ్లనాన్న దింపేశాడు. వాళ్లు ఎంతో సంతోషించారు.

ఇంకోచోట ఒకఅబ్బి ఒకపెట్టె నిలబెట్టి అందులో కన్నాల్లోంచి బొమ్మలు చూపిస్తున్నాడు.

చూడుతమాషా వింతతమాషా
కాశీపట్నం చిత్రంచూడు
మధురాపట్నం చిత్రంచూడు
చూడుతమాషా చిత్రంచూడు
చూడుతమాషా వింతలుచూడు

అంటూ డబ్బామీద వాయిస్తున్నాడు.

"అదేమిటినాన్నా" అంది సూరి.

"అదిచూపించవునాన్నా" అంది సీతి.

"అది బాగుండదు. అది వద్దన్నాడు వాళ్ల నాన్న

కొంతదూరం వెళ్లాక వాళ్ళనాన్నని ఎవరో ఆపి, "ఏమిరోయి రామ్మూర్తీ. పిల్లలిని వేసుకు ఎక్కడికి బయలుదేరావు" అన్నారు.

"పిల్లలకి తీర్థంచూపుతున్నానురా" అన్నాడు వాళ్ల నాన్న.

"వాళ్ళకు చూపించేదేమిటి. ఒక అరుగుమీద కూచోబెట్టిపోయి, వాళ్లే చూస్తారు. మనం ఒకమారు అలా తిరిగి వద్దామురా" అన్నాడాయన.

"ఎక్కడ కూచోబెట్టడం" అన్నాడు వాళ్ల నాన్న.

సూరీ సీతీ వెంకీ కొత్తాయన్ని చూచి మంచి వాడు కాడనుకొన్నారు.

"అదిగో మావాళ్లరుగే అది. అక్కడకూచోబెట్టు. మా వాళ్లు చూస్తూ ఉంటారులే" అన్నాడు.

"సరే"అని వాళ్ల నాన్న ఒప్పుకొన్నాడు. సూరీ సీతీ వెంకీ అరుగుమీద కూర్చున్నారు. వాళ్ల నాన్న "నే వచ్చేదాకా కదలకండేం" అని చెప్పి వెళ్లిపోయాడు. ఆయింటివాళ్లు"చూస్తూ కూచోండమ్మా భయంలేదు" అని లోపల పని చేసుకుంటున్నారు.

సూరీ సీతీ వెంకీ కబుర్లు చెప్పుకుంటూ అరుగు మీద కూర్చున్నారు. ఆదారిని పోయే నెత్తి కోతలవాణ్ణి చూచి భయపడ్డారు. కాని వాడు దూరంగా పోయాడు. వాళ్లు చాలా సేపు కూచున్నారు. ఎంతకూచున్నా వాళ్లనాన్న రాలేదు. ఆ దారిని డక్కీలు అమ్మేవాణ్ణిచూచి "నాక్కానిపెత్తు"అంది వెంకి. ఆ అబ్బిని పిలిస్తే వచ్చాడు కాదు. మళ్లీ అరుగు మీదకు రావచ్చుననుకొని ముగ్గురూ చేతులు పట్టుకొని డక్కీలవాడిదగ్గిరికి వెళ్లారు. ముగ్గురూ మూడు డక్కీలు కొనుక్కొన్నారు. డక్కీలబ్బి మూడుడబ్బులూ తీసుకొని మిగిలిన డబ్బులు ఇచ్చాడు. వాళ్లు డక్కీలు వాయించుకొంటూ రాబోతూంటే "మంచిఖర్జూరం తియ్యఖర్జూరం మంచిఖర్జూరం" అని ఒక దుకాణంఅబ్బి కేకలువేయడంచూచి అక్కడకు వాళ్లు ముగ్గురూ వెళ్లారు. ముగ్గురూ మూడుడబ్బు లిచ్చి మూడు పొట్లాలు పుచ్చుకొని అవి విప్పితింటూ చుట్టూ చూస్తూ నిలబడ్డారు. దూరాన్ని లక్కపిడతల దుకాణం కనిపించింది.

"రావే లక్కపిడతలు కొనుక్కుందాం" అంది సీతి.

"నాన్న వస్తాడేమో" అంది సూరి.

"మళ్లీ ఇప్పుడేవద్దాం" అంది సీతి.

సూరీ సీతీ వెంకీ లక్కపిడతల దుకాణందగ్గిరికి వెళ్లారు.

సూరి ఒకలక్క మరచెంబూ, రెండు గంధం గిన్నెలూ కొనుక్కొంది. సీతి రెండు లక్క పిడతలూ ఒక గంధంగిన్నీ ఒక పెద్ద దొండ కాయా కొనుక్కొంది. వెంకి ఒక గంధంగిన్నె రెండు దొండకాయలు రెండు లక్కపిడత లూ కొనుక్కొంది. లక్కపిడతలన్నీ వెంకి రుమాలులో పోసి మూట కట్టి సూరి పట్టుకొంది. ఖర్జూరం తింటూ వాళ్లు మిగిలినడబ్బులు పట్టుకొని అరుగుకోసం తిరిగారు. అరుగు కనిపించింది కాదు. అక్కడ ఒక

పాములాడు పాములని నాగస్వరం ఊది ఆడి స్తూంటే కొంచెంసేపు దూరంగానిలబడి పాముకేసి చూశారు. తరవాత వాళ్లు ఒక గంగి రెద్దును చూశారు. గంగిరెద్దులబ్బి "డూడూం వెంకన్నా, డూడూఅప్పన్నా" అంటూ పాడు కొంటూ వెడుతున్నాడు. గంగిరెద్దును చూస్తూ వాళ్లు కొంతదూరం దానితో నడిచివెళ్లారు. గంగిరెద్దునిండా బట్టలూ గంటలూచూచివాళ్లు సంతోషించారు. మళ్లీ వాళ్లు కూర్చున్న అరుగు కోసం వెతికారు. కనిపించింది కాదు.

చాలాసేపుతిరిగారు. అరుగు అపుపించింది కాదు. వాళ్లు ఏడుస్తూ రోడ్డుపక్కని నిలుచున్నారు.

వాళ్లనాన్న తిరిగి తిరిగి అరుగుదగ్గిరికి పిల్లల కోసం వచ్చాడు. పిల్లలు అరుగుమీద లేరు. ఇంటివాళ్ల నడిగితే "ఇప్పటిదాకా ఇక్కడే కూర్చున్నారండీ. ఎక్కడికి వెళ్లారో కాని" అన్నారు.

వాళ్లనాన్న వాళ్లబండి ఉన్నచోటికి వెళ్లాడు. అక్కడ వాళ్లమ్మా, అన్నయ్యా దొడ్డమ్మా ఉన్నారు. గరిటెలు రొచ్చిప్పలూ పెట్టుకు కూచున్నారు.

వాళ్లనాన్నను చూచి వాళ్లమ్మ నిలబడి "పిల్ల లేరీ" అంది.

"పిల్లలిక్కడకు రాలేదూ" అన్నాడు వాళ్ళ నాన్న.

"అయ్యో అయ్యో తప్పిపోయారా ఏమిటి. కొంపములిగింది. ఏమిటి తోవ" అని వాళ్లమ్మ బిక్క మొహం వేసింది.

"తప్పిపోయారు కాబోలే తీర్థంలోనూ. రావే చూద్దాము" అని వాళ్లదొడ్డమ్మ అంది.

"మీరిక్కడేకూచోండి నేనువెళ్లి చూస్తాను" అన్నాడు వాళ్లనాన్న.

"నేనూవస్తాను. అయ్యో నాపిల్ల లేమైపోయా రో అమ్మా"అని వాళ్లమ్మ ఏడ్చింది.

"అబ్బాయీ నేనూ వెడతాము మీ రిక్క డుండండి" అని చెప్పి వాళ్లనాన్న వాళ్లన్న య్యను తీసుకొని వెళ్లాడు.

ఉండబట్టక వాళ్లమ్మా దొడ్డమ్మా ఆ చుట్టు పట్ల వెదుకుతున్నారు.

వాళ్లనాన్నా అన్నయ్యా దుకాణాలన్నీ వెదుకుతున్నారు. ఒకచోట ఒకపెద్దమనిషి వాళ్లకగపడి,

"ఎవరికోసంఅండీ వెదుకుతున్నారు"అన్నాడు.

"మా అమ్మాయిలు ముగ్గురు తప్పిపోయారండీ తీర్థంలోను"అన్నాడు వాళ్లనాన్న.

"మీపేరు రామమూర్తిగారా" అన్నా డాయన.

"అవును"అన్నాడు వాళ్లనాన్న.

"ఎవరో రామ్మూర్తిగారి పిల్లలమని చెప్పారు. ముగ్గురుపిల్లలు ఏడుస్తూ రోడ్డుపక్క నిల బడ్డారు" అన్నా డాయన.

"ఎక్కడ" అని వాళ్లనాన్న అడిగాడు.

"అదిగో అక్కడ నూకాలమ్మగుడిదగ్గిర" అని వెళ్లిపోయాడు.

నూకాలమ్మ గుడిదగ్గిరికి వెళ్లి వాళ్లు కనుక్కొన్నారు. అప్పుడే ఎవరో ముగ్గురు పిల్లలు ఏడుస్తూ ఉంటే వచ్చి తీసుకువెళ్లారని చెప్పారు. వాళ్లు వెళ్లినదారిని వెళ్లి వాకబు చెయ్యగా చెయ్యగా ఒకగృహస్థు ఇంట్లో వాళ్లు ఉన్నట్లు తెలిసింది. అక్కడ ఆయింట్లో ఆడవాళ్లదగ్గిర సూరీ సీతి వెంకీ ఉన్నారు.

వాళ్లనాన్నను చూడ్డంతోనే వెంకి ఏడ్చింది. సూరీ సీతి నవ్వారు.

రోడ్డుపక్క ఏడుస్తూ ఉంటే ఆ ఇంటి ఆయన ఇక్కడకు తీసుకువచ్చి బొమ్మలూ మిఠాయిూ పెట్టి "మీ నాన్నను తీసుకువస్తా నన్న"ని చెప్పారు.

"మా అమ్మాయిలిని మళ్లీ మాకిచ్చారు. మీ మేలు మరిచిపోలేను" అని వాళ్లనాన్న చెప్పి ముగ్గురు పిల్లలనూ తీసుకొని బండి దగ్గిరికి వచ్చారు. బండిదగ్గిర వాళ్లమ్మ ఏడుస్తోంది. దొడ్డమ్మ ఊరుకోబెట్టుతోంది.

పిల్లలను చూడడంతోనే వాళ్లమ్మ గబగబా వచ్చి వాళ్లను ఎత్తుకొని కౌగలించుకొని ముద్దెట్టుకొంది.

"వచ్చారా నాతల్లులు. తప్పిపోయారా నాతల్లీ" అందదొడ్డమ్మ. వాళ్లమ్మ పిల్లలకోసం కొన్న బొమ్మలూ జిలేబీపొట్లాలూ వాళ్ళకుపెట్టింది. దొడ్డమ్మకూడా కారప్పూసపొట్లాలు వాళ్ళకు ఇచ్చింది. వాళ్లా పొట్లాలు తీసుకొన్నారు. బొమ్మలూ పొట్లాలూ చేతుల్లో ఇమడకపోవడంవల్ల వాళ్ళమ్మ అవన్నీ మూటకట్టిపెట్టింది. వాళ్లు కొనుక్కొన్న లక్కపిడతలూ డక్కీలు అవన్నీ వాళ్లమ్మకు చూపించారు సూరీ సీతీ వెంకీని.

"అయ్యో మీపాడుపాక్క! మీరే కొనుక్కున్నారట్రా ఇవన్నీని" అందవాళ్లమ్మ.

"మేమే కొనుక్కున్నాం" అంది సీతి.

"నేకొనుక్కున్నా" అంది వెంకి. వాళ్లు ఏమేమి చేశారో ఎలా తప్పిపోయారో అంతా వాళ్ళమ్మతో చెప్పారు.

తరవాత వాళ్ళందరూ బండిఎక్కారు. దొడ్డమ్మ మాత్రం బండెక్కలేదు.

"వెళతా దొడ్డమ్మా" అంది వాళ్లమ్మ.

"ఉంటానే నాతల్లి. పిల్లల సంగతి ఓ ఉత్తరం రాస్తూండమ్మా" అంది దొడ్డమ్మ.

"వెళతా అమ్మమ్మా" అన్నాడు వాళ్లన్నయ్య.

"మంచిది నాయనా. బాగా చదువుకో" అంది దొడ్డమ్మ.

"వెళుతున్నా అత్తా" అన్నాడు వాళ్లనాన్న.

"ఉత్తరం రాస్తూండమ్మా నాయనా" అంది దొడ్డమ్మ.

"వెళుతున్నా అమ్మమ్మా" అంది సూరి.

"వెళతా అమ్మమ్మా" అంది సీతి.

"వెళతా అమ్మమ్మా" అంది వెంకి.

"మీచెల్లెలు మాతల్లులు వెళ్ళొస్తమ్మా. అల్లరి చెయ్యకుండా బాగా ఆడుకోండి. బదికి బాగుంటే సూరిపెళ్లికి రావాలి" అంది దొడ్డమ్మ.

బండి కదిలింది.

"సూరిపెళ్లి" అని సీతి నవ్వింది.

"సూరిపెళ్లి" అని వెంకినవ్వింది.

సూరి సిగ్గుతో తనలో తాను నవ్వుకొంది.

## *విద్యార్థిప్రబోధము

ఉభయభాషాప్రవీణ, తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు

ఆద్యాఖండయశోధనం బెడసి దాస్యస్ఫూర్తిఁ జింతాభరా
పాద్యంబై భరతోర్వి నేఁడు విలపింపన్ సాగెఁ దద్రోదన
ప్రోద్యద్ధ్వానము వీనులం జొరదొ? యేబుద్ధుల్ నినుంజుట్టెనో?
విద్యార్థీ! నినుఁగన్నతల్లి మొఱ నీవే యిట్లుపేక్షింతువా.

చెంఁగిమార్తురఁ జించి చెండాడివైచిన యభిమన్యుఁ డేతల్లి యంకమెక్కె
చిచ్చఱపిడుగు పుంజీభూతశౌర్యంబు బాలుఁ డేయమ జోలపాటమెచ్చె
నెఱజోదు పగఱగుండెలలో నిగాలమై మనినశివాజి యేజననిఁ గొల్చె
జగదేకవీరప్రశస్తతేజోరాశి జవహరుఁ డేమాత చన్నుగుడిచె?
నమ్మహాసాధ్వి సకలలోకైకజనని-భారతాంబకుఁ బండినపంట వీవు
అన్నలకు మచ్చఁదేఁబోకు మెన్నఁడేని-నుతగుణాధార! వీరభారతకుమార.

నవయుగమేగుదెంచెఁ బరిణామము సెందె జగంబు నూతన
చ్ఛవులు నటించుచున్నవి దిశావలయంబులు ముక్తికామినీ
నవనవదివ్యయౌవన మనంతముఖంబుల నిండి భారతీ
యువజనచిత్తవృత్తులు నూపుచుఁ జూపుచునుండెఁ దళ్కులన్.

తెమ్మిఁక మీనమేషముల లెక్కలుమానుము భావదాస్యబం
ధమ్మును ద్రెంపివేయుము వితండవివాదము లుజ్జగింపుద
ద్దమ్ములు భేదవాదసముదాయముతోడఁ బనేమినీకు నీ
యమ్మఋణమ్ముఁ దీర్చి చరితార్థత నందుము మిత్రసత్తమా.

అమరులుగుంపుఁగూడి "విజయో" స్త్వని నందనచందనస్ఫుర
త్సుమనసముదాయముం గురియఁ జొచ్చిరి నీపయి దిక్తటంబులం
ఘుమములమై ధ్వనించె జయదుందుభిఘోషలు మంచిలగ్నమీ
సమయము లెమ్ము లెమ్ము పటుసాహసదోహల దుర్భరార్భటిన్.

---

* ఈపద్యములు 18-2-51 తేదిని గుంటూరులో జరిగిన "కమ్మవిద్యార్థి వసతిగృహ వార్షికోత్సవసభ"లోఁ బఠితములు.

8, 6. 9 ౯-౨3

లోకు లిసీయనన్ జగతిలోఁ గలకాలము నూఁగులాడుచున్
గాకముకైవడిం బ్రదుకుకంటె బుధుల్ తలలూఁపఁ గంటయోఁ
గోకిలమై వెలుంగుటది కూడదా? విజ్ఞుఁడు కీర్తికాయము౦
గైకొన రక్తమాంసమయకాయము హేయము నీసడింపఁడో.

ఆధివ్యాధిపరీత మంబుజదళవ్యాలోలపాథఃకణం
బీదేహంబు సమస్తభోగములు నిస్సీ హాస్తికర్ణాంతముల్
సాధుస్తుత్య మఖండ మవ్యయదశాసంపూర్ణమక్కీర్తి యో
యోధాగ్రేసర! తెమ్ము సమరవ్యూహంబులం దీర్పఁగన్.

భావిచరిత్రకారుఁడు సెబా సని మెచ్చి సువర్ణవర్ణసం
భావితమై వెలుంగఁగ భవచ్చరితంబు రచింప నింపుమైఁ
ద్రోవలుదిద్దుచుండెఁ గరతోయజలేఖిని శీఘ్రకింకిణీ
రావపరంపరాకలకలధ్వని వీనులవిం దొనర్పఁగన్.

శంక లిఁకేల నీవిజయశాసనముల్ కకుబంతకామినీ
కుంకుమపంకసంకలితగూఢకుచాద్రితటంబులన్ నిరా
టంకతఁదీర్చి దిద్దుము హుటాహుటిఁ గట్టుము కంకణం బిఁకన్
జంకితివేని యెన్నఁటికి జాతికి మోక్షము లేదు సోదరా.

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్న సైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.




యనమండ్ర సాంబశివరావుగారు

౧

"ఏమేవ్! నువ్వు గింజుకు చచ్చినీ, నీ తాతల పెద్ద నూతులో పడ్డేనీ, పిల్ల పురేసుకోనేదీ, నేను మా రంగారెడ్డికి తప్ప అమ్మాయిని మరోహాళ్ళకిచ్చి పెళ్లి చెయ్యను" అన్నాడు గౌరరెడ్డి వీధి అరుగుమీద ఎదురుగుండా మోకాళ్ళు ముడిచి కూచున్న పెళ్లాం పున్నమ్మతోటి.



"మీరంటే అన్నారు కాని నా బొందిలో ప్రాణం పెనుగులాడుతున్నదాకా. కానుల్ని ఆ ముసలిముండాకొడుక్కి కట్ట పెట్టనిస్తే అనండి. పెళ్లిపీటలమీదకి ఎవర్ని తెచ్చుకుంటారో తెచ్చుకోండి. ఆకాళం బద్దలైనా నేనురాను" అంది చురచురలాడుతూ పున్నమ్మ.

"నువ్వురాకపోతే నీలాంటిది మరోత్తి" అని చేతికర్ర పూంతచేసుకుంటూ స్నానానికని వెళ్లిపోయేడు గౌరరెడ్డి.

పున్నమ్మ ఆవేళ వంట చేయడం మానేసింది కోపంవచ్చి. కేకవేస్తున్నా మొగుడికి కుంకుడు కాయలైనా కొట్టి ఇచ్చింది కాదు. అప్పుడు ఆపసోడుచు అంకమ్మ వెళ్లి నీళ్లుకాచి ఇంత నవురుముక్క ఇచ్చేదాకా దిక్కేలేకపోయింది గౌరరెడ్డికి.

౨

కొసలికిప్పుడు పదహారో ఏడు నడుస్తోంది. ఈవిడ తల్లికడుపులో వున్నప్పుడు

దీపావళి అమావాస్యకి పున్నమ్మ పుట్టింట్లో ఆవులసాల తగలడిపోయిందిట. అందులో చిక్కుపడి బందరు కోడి దూడని కాపాడ్డామని పున్నమ్మ తండ్రి రామిరెడ్డి వెళ్ళి అందులో మాయమైపోయేడు. అప్పుడే యీ సంవత్సరం జరిగి పదిహేనేళ్లు పూర్తయి పదహారెళ్లయిందిట. ఆ లెక్కని చూస్తే కాసులికి నిండా పదహారేళ్లు లేకపోయినా అయినా పదహారేళ్ళకి తక్కువ వుండదంటుంది పున్నమ్మ. కాస్తో కూస్తో తెలివైందన్నీ చదువైందన్నీ అనిపించేక తనపెళ్లి గురించి ఆరాటపడుతూన్న తల్లినీ తండ్రినీ చూస్తూ తల తిప్పుతోంది కాసులు.

కాసులి అందం చెప్పనక్కర్లేదా తనుసులో భావం లేదని చెప్పుతూండేవాడు మారెడ్డి సుబ్బన్నకవి. ప్రయత్నంమీద వ్రాయగా వ్రాయగా ఒక చిన్నగీతం ఆవిడమీద వ్రాసి ముమ్మాటు చదివేడు. ముమ్మాటూ కూడా పున్నంచంద్రుడు అతనికి కనిపిస్తూండేవాడు. "ఛీ! చంద్రుడికి కాసులి అందంలో సాటెక్కడ" అని ఆ కాగితం చింపిముక్కలుచేసే డాయన.

నందిగిరి ఊరి లోగిట్లో బసచేసిన సుంకారెడ్డికి కాసుల్ని పెళ్లాడాలని వుండేది. కాని, నాగన్న పిల్ల నిమ్మని అడిగితే అరుగుపక్కనున్న తంబోతుని వెంటతరిమేట్ట గౌరరెడ్డి. సూరపరెడ్డి పెద్దబుల్లాకుగారి ముత్యాలు, కాసులు గోదావరిలో నీళ్లుతీస్తూంటే చూసి పెళ్లాడాలని మనసేసి పినతండ్రిచేత కబురుపెడితే వూళ్లో వూరకుక్కల్ని ఉసికొల్పేట్ట గౌరరెడ్డి. సీతారామయ్యగారు యీసంగతి తెలుసుకుని, తనకి ఎదురు చెప్పగలవాడా గౌరరెడ్డి, అని ధైర్యంతోటి తనకొడుకు బుచ్చిరెడ్డికి కాసుల్నిమ్మని, ఆవూరి కరణంగారిని, పసుపుకుంకం, కొబ్బరికాయలు, నేంచీర, కుంకుమ కాయలు, నువ్వునూని కావడిచ్చి పంపిస్తే.

"కాసులు మా చక్కని చుక్కండి, దాని ఎక్కదనం పోషించే లక్షాధికారికాని దాన్నియ్యనండి" అని చెప్పి కావిడిని కరణాన్ని తిరగ్గొట్టేసేట్ట గౌరరెడ్డి.

ఎంతజమీందార్లకో పోతే మహారాజులుం గారికో ఇచ్చి పెళ్లిచేస్తాడు కాసులికని కోరమాపులు చూస్తూన్నారు వూళ్లో వాళ్లంతాను.

# 3

ఆవేళ ముగుడిమీది కోపంవల్ల పున్నమ్మ అందరికంటే ముందు భోజనం చేసేసింది. అన్నగారు రాకుండా వొదినగారికి కుంభం పోయాలని విసుక్కుంటూ అంకమ్మ నెయ్యి వెయ్యకుండా అన్నం పెట్టింది కన్నమ్మకి. ఈవిడమీద కోపం మొగుడిమీద కోపం జంటచేసి కుంభంమీద విసిరిగొట్టింది పున్నమ్మ. విస్తట్లో పదార్థాలన్నీ ఒకేమట్టు కలిపేసుకుని మాంచి గేదపెరుగులోటి మద్దనాచేసి కష్టంమీద మింగి, యీ ఆయాసంతో వచ్చిన నిద్దర్ని ఆపరిస్తూ పరంటింట్లో పందిరిపట్టె మంచంమీద దొర్లాపడుకుని గుర్రెట్టుతోంది. గౌరరెడ్డిమాత్రం శాంతంగా భోజనం చేసేడు. భోజనం చేసినంతసేపూ దృష్టంతా పున్నమ్మమీదే వుంది. ఆవిడ మాటకాదని కొట్టకే ఏం చేస్తుందనే జాలి ఒకపక్కని, ఆవిడమాట విని పిల్లకి సంబంధం చెయ్యడం మానేస్తే, ఇంతవరకున్న పెళ్లికొడుకు దొరకడం కష్టం అనేమాట ఒకపక్క నీకుపిస్తున్నాయి గౌరరెడ్డికి. ఎలాగైనా మంచిమాటలు చెప్పి పెళ్లాన్ని ఒప్పిద్దామని ఉద్దేశించుకొని, భోజనం చేసి, ఆవిడ పడుకున్న మంచంమీదే ఒకపక్కని ఇరికేడు.

ఒక అరగంటకి లేచింది పున్నమ్మ. నిమ్మళంగా లేచి మంగళసూత్రాలున్న తాను కట్టుకుంటోంది. తల్లోని ముగుర్ని దాటి అవతలపడ్డానికి ప్రయత్నం చేస్తూంటే గౌరరెడ్డి గట్టిగా పట్టుకు,

"ఏమే……" అని ఏమో అనబోతూంటే

""నన్ను వదిలెయ్యండి"అని అరుస్తూ కూచుంది పున్నమ్మ. ఎలాగో మంచిమాటలు చెప్పి ఆవిడ నోరు కట్టేసేడు రెడ్డి.

"నన్ను వదిలేయండి"అనే పున్నమ్మ అరుపు విని ఏదో కొంప మునిగిపోతూందని కాసులు పక్కగ

పని కాబోలు గన్నేరుపువ్వొకటి గాలికి వొంగి ఆవిడ కళ్లనేపి కొట్టింది. ఆపువ్వును కోసి చేత్తో పట్టుకుని యీవిధంగా ఆలోచించుకుంటోంది కాసులు. "ఎనభై ఏళ్లుట—తన తాతకైనా లేవుట అన్నేళ్లు.—గెడ్డం గంటి లమీద కొగ వ్రాసతోందిట—ఒకమాటు వాళ్ల వూరొచ్చిన చిటికెలభైరాగికి తప్ప ఇంకెవ్వరికీ అంతగెడ్డం చూడలేదుట. పళ్లువూడిపోయేయిటకూడాను. ఒకవేళ తాను వక్కలాలు చేసిపెడితే ఎలాగతింటాడు పాపం—అని గోలుమని ఏడ్చింది కాసులు. తాను చుట్టే తాంబూల పొడుం లరవి కివ్వడానికి నోచుకోలేదా అనుకుంది. ఇంతకీ తండ్రి పెళ్లిచెయ్యాలని పట్టుపట్టేడు. తానెంత చెప్పినా వినడు. ఇంకా అనుర్ధాపడితేమాత్రం ఏంకార్యం. తన అదృష్టం న్నెవ్వళ్లు మళ్లిస్తారు. మంచీ మాటా తండ్రికిచ్చి మనసుమిరిచే స్వభావం కాదు కాసులిది. కనక, తండ్రి ఎలాగ చెప్తేఅలాగ తలవంచడమే భావ్యం అనుకుంది. అంతకంటే పుద్దేశాలు పరిగెడితే కామా ఆవిడకి? దాక్టరుగారికి డబ్బు బాగావుందిట! పెద్దమేడలూ, పొలాలూ, కార్లూ, నౌకర్లూ, ఇంకా ఎన్నో వున్నాయిట. వాళ్ల తండ్రి కిచ్చినట్టు పుకిళ్లూ, మిద్దేనా? గూతులబండి, ఎడ్లబండీ, సవారీలూ నామరి! యీతిమెకడిలాగ ఒక్కడేనా మరి గాలికాపు? ఇది కాకుండా వస్తువు లెన్నో పెట్టారుట. అని అనుకుంటూ తన ఒళ్లంతా చూసుకుంది కాసులు. ఒళ్లంతా బంగారం మయం. ఇంకెంగుమ్మా శరీరంలో చోటేలేదు. ఆనగిషీల ఒంటిపేటగళీయారం తెలుసా! మోహల్లుకట్టిన కాసుల పేరా! పలకసర్లు! ముత్యాలసర్లు తమా! ఆరత్నపుల్లో లక్కులా! ఇవేవి టవేవిటి? ఎన్నో కనిపించేయి. ఇంక పైముచ్చిలకా! తన "మెనుగుడే" వున్నాట్ట. తర్వాత చెప్పడున్నాపంది కాసులు. అంతేకాని, తండ్రిమాట కాదన్డానికి తలంపే వచ్చిందికాదు పాపం.

౫

ఆషాఢబహుళ సప్తమీ సోమవారంనాడు, ఉత్తరా నక్షత్రంలో రాత్రిపదకొండు ఘడియల ముహూర్తం అయిదు విఘడియలకి రాజమండ్రిడాక్టరుగారు బాపినీని రంగారెడ్డిగారు పూలరెడ్డి గౌరరెడ్డిగారి కూతురు కాసులు మెడలో మంగళసూత్రం కట్టేసేరు. అది కట్టబోయ్యేటప్పుడు పెళ్లికొడుక్కి వచ్చిన వణుకు చూడలేదు. కాని చేతినున్న "రిస్టువాచీ"నిమాత్రం చూచి పొంగిపోయింది కాసులు.

పెళ్లైనమర్నాడే కాసుల్ని సారిచ్చి అత్తింటికి పంపేరు. పెళ్లిసమయంలో డాక్టరుగారు చేయించిన వైభవానికి రాజమండ్రిపురవాసులంతా ఆశ్చర్యపడ్డారు. పెళ్లికూతుర్ని చూడ్డానికొచ్చిన ఆడాళ్లూ మొగాళ్లూ "ఎక్కనిమక్క—రత్నంలాంటిపిల్ల — ఇంతందమైనఅమ్మాయి ఎక్కడాలేదు" అనుకున్నారు. ఒకళ్లిద్దరు మొగాళ్లమాట లనడం విన్నారు డాక్టరుతాతగారు. ఇహనొచ్చెయెక్కడలేని రోషం, అనుమానంనూ. తను చేతకానివాడనీ ముసలాడనీ ఎంచి పెళ్లాం ఎవరివేపైనా చూస్తుందేమో అనేభయం, అనుమానము అతన్ని పిశాచంలాగ పట్టుకుని బాధించేస్తున్నాయి. దీనికే "పడుచు పెళ్లాం,ముసిలిమొగుడు" నే సామెత. ఈ అనుమానంతోటి ఆయన ఇల్లువాటి పెళ్లడానికి జంకేవాడు. రోగులు మొత్తుకుంటే, అయిదునిమిషాలు కారుమీద రంయని పోయి తిప్పునచ్చేసేవాడు. కాంపౌండరు సాహేబు బజార్లోంచి బత్తాయిపళ్లు తెచ్చి అమ్మగారిక్కి స్వయంగా ఇస్తే బాబుగారిక్కి అనుమానం. గెడ్డాం కిందకి దింపి నోరుబిగబెట్టి సాహేబుకాసి ఎగాదిగా చూస్తాడు. అప్పుడుపుట్టిన పిల్లాడైనా కాసులువేపు చూసి చిరునవ్వునవ్వితే, డాక్టరుగారికి మింగేడ్డామూ అనివుంటుంది. ఆపిల్లాడేతుస్తూంటే, కాసులు తనకిలేసనే నంటూ డేపుస్తున్నాడనుకుంటాడు రంగారెడ్డి. కాసులికి ఆసుపత్రివాళ్లకీ సంపర్కం లేకుండా ఆసుపత్రిని మరోమేడమీదికి మార్చేసేడు. తనమాత్రం పెళ్లాన్ని కనిపెట్టుకూర్చునేవాడు. ప్రేమచేతకాదు అనుమానంచేతే. పెళ్లాడితే సౌఖ్యం వస్తుందనుకుంటే, మనస్సులో ఆవేదనా, అనుమానం, భయం ఎక్కువయ్యేయి పాపం మన వైద్యుడిగారికి. ఆఖర్దాఇంకా తీరక ముసిలివీరమ్మని దగ్గిరపెట్టి, డాక్టరుగారు పెళ్లాన్ని గదిలోపెట్టి పైని తాళం వెయ్యడం మొదలెట్టేరు.

నీ నీటువంటి వృత్తుల్లో దిగేవని పైకి తెలిస్తే నా పరపతికి భంగంవస్తుంది జాగ్రత" అన్నాడు.

చంద్రారెడ్డి.— అయ్యా! నేను కావలసినంత జాగ్రతతో ప్రవర్తిస్తాను. రేపటిరోజున ఏమిజరిగినదన్నీ మనివిచేరకుండుకు యీవేళకే, ఇక్కడే నిందర్శనం చేస్తాను-అనిచెప్పి వెళ్లిపోయేడు.

రంగారెడ్డి ఒంటరిగా కూర్చుని జరిగినకథ మళ్లీ జ్ఞాపకంచేసుకుని విచారిస్తున్నాడు. ఆలోచిస్తూన్నకొద్దీ కాసులు తనకి దూరంఅయిపోతోంది. పిచ్చెత్తినట్టు తోటంతా తిరుగుతున్నాడు.

ఈలోగా, యథాప్రకారం చంద్రారెడ్డి భాండాగారంనుంచి వస్తూ, కాసుల్ని కిటికీదగ్గరనుంచి చూసేడు. ఈరోజున మరింత ప్రేమపూరితమైన చూపు తోటి, ఆవిడ ఇతన్ని ఆదరించింది. ఇదికొంత రెడ్డికి ధైర్యంఇవ్వడంచేత ఆవిడగుమ్మంలోకి వెళ్లి తలుపు గుద్దేడు. వీరమ్మ తలుపుతీసింది. "మా అమ్మగారిని చూడాలి" అన్నాడు చంద్రారెడ్డి. ఇంతలోనే కాసులు మేడదిగి, చంద్రారెడ్డిని ఆదరణతోటి తనగదిలోకి తీసుకెళ్లింది. ఇంకా చిన్నతనంచేతనో, మరి కొత్తగా వుండడంచేతనో చాలాబిడియంగా వుంది రెడ్డికి. కొంతతడువు ధైర్యం తెచ్చుకుని, కాసుల్ని చూస్తూ ఆవిడని తాను వరించినట్టున్నూ, కలకాలం ఆవిడస్నేహితుడై వుండి సేవచేయడానికి ఆజ్ఞ ఇయ్యాలసినదనిన్నీ కోరేడు. కాసులు చంద్రారెడ్డిని ప్రేమించిందని ఇదివరకే చెప్పేం. కాని, పూర్తిగామాత్రం ఆవిడ మనసు వెలిబుచ్చలేదు. రేపటిరోజున నాలుగ్గంటలకి ఫలహారానికి రావలసిందని రెడ్డిని ప్రార్థించింది. తప్పకుండా వస్తానని మాటఇచ్చి వెళ్లలేక వెళ్లలేక రెడ్డి కాసులివేలికి తనవుంగరం తగిలించి వెళ్లిపోయేడు.

డాక్టరుగారు, చంద్రారెడ్డి ఏమివార్త తెస్తాడో అని ఎదురుచూస్తున్నారు మ్యూజియంలో. ఇంతలోకే చంద్రారెడ్డి అక్కడికి వచ్చేడు. ఇతన్ని చూసి డాక్టరుగారు,

"ఏమయ్యా! చంద్రారెడ్డి, ఏమిటివింతలు? పాచికలా పారింది?" అన్నాడు.

చంద్రా.—మనం అనుకున్నట్టే. ఆవిడతో చాలా సరసమాట్లాడేను. కొంత లొంగినట్టుగానే కనపడుతోంది. ఇంక ఆముసిలిగాడిదకొడుకుని రెండుచెవులూ పట్టుకుని ఈడ్చెయ్యొచ్చును.—ఈమాటలు వినగానే రంగారెడ్డి పడిన అవస్థ వర్ణించడానికి శక్యంకాదు. అసూయ అంటే ఎంతబలమైందో తెలిసినవారు వూహించవలసిందే కాని మేము చెప్పలేము. కాస్త స్తిమితపడి రంగారెడ్డి "మళ్లీ ఎప్పుడు రమ్మంది?" అన్నాడు.

చంద్రారెడ్డి.— రేపుసాయంత్రం నాలుగ్గంటలకి

రంగా.—రేపు మళ్లీ కలుసుకుందాం అని చెప్పి ఇంటికి వెళ్లేడు. తనవిచారం అంతా నవ్వులో దాచుకుని తెల్లవారే వరకూ శాంతంగా పడుకున్నాడు.

౮

రంగారెడ్డి భోజనంచేసి, బట్టలువేసుకుని, ఎన్నడు నాలుగంటలవుతుందా అని ఆ దుర్గాతో వూరల్లా తిరుగుతున్నాడు. అతనిపట్టుదల, ఏమైనా సరే, చంద్రారెడ్డీ కాసులూ మాట్లాడుతూంటె చూసి పట్టుకుని వీలైనమార్గంగా ఇద్దరినీదా పగతీర్చుకుందాం అని.

ఇంతలోకే డాక్టరుగారింట్లో లేని సమయం చూసి చంద్రారెడ్డి కాసులున్నగదిలో కెళ్లేడు. వీరమ్మ వీథితలుపు మూసేసింది. కాసులున్నూ చంద్రారెడ్డిన్నీ కూచుని మాట్లాడుతున్నారో లేదో హఠాత్తుగా వీథితలుపు "బడబడ" చప్పుడైంది. అప్పుడే నాలుగ్గంటలయిందన్నమాట. బెదిరి బేజారైపోయి వీరమ్మ కాసులదగ్గర కెళ్లి "అమ్మా! డాక్టరుగారొచ్చేరు. లెండి! లెండి!" అని అరిచింది. కాసులు మొదట చాలా భయపడింది. కొంప మునగడానికి సిద్ధంగా వుందనుకుంది. కాని, ఆయుక్తిలికి కాసులుకీ పెట్టింది పేరు. వెంటనే చంద్రారెడ్డిని యీడ్చుకెళ్లి భర్త పరుపుకుట్టించుకుందుకు తెప్పించిన హంసయీకలున్న పీపాగొట్టంలో కూచోబెట్టి, మూతేసి, ఏమీ ఎరగనట్టుగా వూలుతో సంచులు కుట్టుకుం

టోంది. ఈలోగా రంగారెడ్డి కారుదిగి, హడిలిపోయి పడిపోయి, ఏదో మరిచిపోయినట్టుగా, గదితాళాలు పుచ్చుకుని, ఇల్లంతా సుభ్రంగా ప్రతిమూలా వెతికేడు. చిన్న ఎలకబొర్రయినా తనచాటున పడలేగు ఇంట్లో చంద్రారెడ్డి కనపడకపోవడంచేత విసుగుపడి, కుర్చీలో కూలబడి, అస్వస్థతగా వుందని చెప్తూ విసుగుకుంటూ ఇంట్లోనే వుండిపోయేడు రంగారెడ్డి. అంటూ బాగా నిద్రపోయేక వీరమ్మ చంద్రారెడ్డిని పెరట్లోంచి పైకితీసి పెరటితోవని పంపేసింది.

మర్నాడు మామూలుగా చంద్రారెడ్డి రంగారెడ్డిని మ్యాజియాంలో కలుసుకుని రాత్రి జరిగిన కథంతా పూర్తిగా చెప్పేసేడు.

"ఎంతపని చేసిందిరా! కాసులు" అని అనుకుని ఏమీ ఎరగనట్టు నటిస్తూ,

"అయ్యోపాపం, కష్టం అంతా వృధాగా పోయిందే" అన్నాడు రంగారెడ్డి.

"అయితే నేమండీ! లక్ష్మీవారం నాడు ఆముసలాయన వూరికి నాలుగుమైళ్లలో వున్న స్నేహితుడింటికి విందుకని వెడతారుట. ఆవేళ నాలుగ్గంటలకి తప్పకుండా రావలసిందని దాసీదానిచేత ఇంటికి కబురు పంపించింది కాసులు" అన్నాడు చంద్రారెడ్డి

"అలాగనా! ఎంత అదృష్టవంతుడివోయి నువ్వు" అంటూ ముఖంలోంచి రాలుతున్న అగ్నికణాల్ని చెమట చేత చల్లార్చేడు రంగారెడ్డి.

కథానాయకులకీ, సూత్రధారుడికీ కూడా ఎంతో కష్టంమీదట లక్ష్మీవారం వచ్చేసింది. ఇంచుమించుగా నాలుగ్గంటలకి రంగారెడ్డి ఇల్లువిడిచి, సమీపంలో వున్న స్నేహితుడింట్లో కూచుని, ఎదురుగుండా కనిపించే తన ఇంటి గుమ్మం కేసి చూస్తున్నాడు.

ఇంతలోకే చంద్రారెడ్డి ముస్తాబై తను ప్రేమించిన వనితతోటి కులాసాగా చాలాసేపు కాలక్షేపం చెయ్యొచ్చునని తలచి అతిగోటుగా వచ్చేడు కాసులింటికి. ఇతను రావడం ప్రత్యక్షంగా చూసేడు రంగారెడ్డి.

గదిలో కాసులూ చంద్రారెడ్డి ఒకరికౌగిట్లో ఒకరున్నారు. ఇంతలో వీరమ్మ గంతులేస్తూ "బాబు! బాబు" అని కేకలేస్తూ రంగారెడ్డిగారి రాక తెలియజేసింది. ఏమాత్రపు వుపద్రానికేనా జాగ్రత్తగా వున్న కాసులు, చంద్రారెడ్డిని పుస్తీ యీడ్చుకెళ్లి, అటకమీద గుండిగల మాటున కూచోబెట్టి, తనబల్లదగ్గరకి వచ్చేసి పుస్తకం చదువుకుంటోంది ఏమీ ఎరగనట్టుగా.

చెమట్లు కక్కుకుంటూ, అగ్నికణాలు రాల్చుకుంటూ, వేడి నిట్టూర్పులు వదలుస్తూ, ఎక్కడాలేనిబలం తెచ్చుకుని పరుగెత్తుకొచ్చేరు ఏండ్రుగా రింటికి.

ఏదోకొంప మునిగిపోయినట్టుగా కాసు లెదురుగుండా వెళ్లి భర్తను పట్టుకుని, "అదేవిటి! విందుకనిపోయి ఇంతవేగిరం వచ్చేరూ" అంది.

రంగారెడ్డి. "ఒనేవ! ఈవేళ చెప్పడం మరిచిపోయేను. నిన్నరాత్రి ఒక చెడ్డకల వొచ్చింది. ఎవడో దుర్మార్గుడుట, దురుద్దేశంతోటి మనింట్లోకి దూరబడి ఎక్కడో దాంకున్నాట్ట. ఎంతవెతికినా నాకు కనిపించేడు కాడుట. ఆవుగ్రంమూలంగా నాముక్కులోంచి రక్తం వచ్చిందిట. ఈసంగతి జ్ఞాపకానికి వచ్చి, భయంవేసి తిరిగివచ్చేసే. ఏదీ! చూదాం వుండు. ఇల్లంతా వెతికి ఏవడేనా గాడిదకొడుకు దాంకున్నాడేమో కని పడదాం" అన్నాడు.

కాసులు "అయ్యో! అంత పాడుకలే? ఏదీ చూసుకుదాం రండి" అంది.

వెంటనే ఏండ్రుగారు అన్ని తలుపులూ మూయించి, ఇంట్లోవున్న గదులు, గాబులూ, భోషాణాలూ, కాపిడిపెట్టెలూ సుభ్రంగా వెతికి, కనిపించిన బస్తాలు, మూటలి, హంసయాకలిని, పేపాలు, కర్రతో కొట్టికొట్టి, ఎవరూ కనపడకపోవడంచేత "అన్నీ అబద్ధపు కలలేనే, పాడుకలలు" అంటూగదిలో కూలబడ్డాడు. "అటకమీద వెతకడం మరచిపోయేరు" అనుకుంది కాసులు నవ్వుకుంటూను. తాతగారి కేమీతోచక తెల్లారేవరకూ నిద్దరపట్టలేదు. చంద్రారెడ్డి చెప్పినవిషయాలు మాస్తే ఒకలాగున్నాయి. తాను వెళ్లి పరిశీ

లిస్తే ఆచోకీ ఏమీ దొరకదు. ఇంతకీ చంద్రారెడ్డి తన గుమ్మం దాటి లోపలికి వెళ్లడం చూసేముకామా? ఇల్లంతా వెతికి అతను లేకపోవడంమాసి అదిపొట్టి భ్రమ అనుకున్నాడు పాపం ఈముసిలిమొగుడు. ముసిలిమొగుడూ పడుచుపెళ్లాం అయితే ఇదే గ్రహచారం. ఈవ్యూహాల్లోటి తెల్లవారేక సిద్ధగపోయేరు డాక్టరుగారు. ఆసమయం కనిపెట్టి వీరమ్మ చంద్రారెడ్డిని ఇంటికి పంపేసింది.

చంద్రారెడ్డిని ఇంకపట్టుకోవడం దుర్లభం అనుకున్నాడు రంగారెడ్డి. ఇంటనెట్టు ప్రమాదావస్థలోకి వస్తుందేమో అనుకున్నాడు. "ఇంటికీ గ్రహచారం కాకపోతే, ఎనభైఏళ్ల కొడుక్కి పెళ్లాంయుం డేవిటే, తిన్నగా బతక లేక? ఎవరు కొడ్తున్నారో చెప్పుదెబ్బ బాగాకొడ్తున్నారు" అనుకున్నాడు ముసలాయన. అయినా పంతం, కోపం ఆపుకోలేకపోతున్నాడు. ఎలాగైనా చంద్రారెడ్డిని బహిరంగంగా పట్టుకుని మూడు చెరువులనీళ్లు తాగించితీరాలనుకుని బుర్రలో గొప్ప పన్నాగం ఒకటి పన్నేడు. అదేమిటంటే, తనభార్య కాసులదగ్గర కెళ్లి "ఓసేవ్! నేనీవేళ సీతానగరం వెళ్లాలి పనిమీద. పదిరోజులదాకా రానేను. అంతవరకు నువ్వు యీ ఇంట్లో వుండడం నాకిష్టం లేదు. ఆర్యాపురంలో మనపురింటిలో వుండు నేనొచ్చేవరకు" అన్నాడు.

"సరే మీ ఇష్టం" అంది కాసులు.

ఈఏర్పాటు చేయించి రంగారెడ్డి మ్యాళియంలో చంద్రారెడ్డిని కలుసుకుని,

"ఏమయ్యా! ఇప్పటికి నువ్వు వరించిన స్త్రీ నీసొత్తు చేరిందని తెలుస్తా"నన్నాడు.

"ఏమి చేరడమండీ. ఆముసిలితండాకొడుకు దగ్గర కర్ణపిశాచం వుంది కాబోలు. లేకపోతే ఏమిటండీ, నేనతనింట్లో అడుగుపెట్టేనో లేదో, వెంబడి తరిమినట్లు తానూ వచ్చేస్తున్నాడు. నిన్ననూ అలాగే అయింది. రాత్రల్లా అటకమీద వుండి తెల్లారింతర్వాత లేచొచ్చా"నన్నాడు చంద్రారెడ్డి.

"అమ్మ! పీడ సిగాతరగా, ఎంత పనైందిరా" అని అనుకుని రంగారెడ్డి, "అబ్బాయి! నీదినాలు బాగా లేవు." అన్నాడు.

"ఇదిగో తాతగారూ! ఇంకొక్కమాటు ఆఖరు ప్రయత్నం చేస్తాను. ఈవేళనుంచీ నాఅదృష్టం బాగుంటుంది. ఏమూ! ఆముసలాయన సీతానగరం వెళ్లి పదిరోజులవరకూ రాడట. అంతవరకూ ఆడాళ్లు ఆర్యాపురంలో బస. వాడు లేనిసమయం చూసి, నాకష్టాలు దాటేటట్టు నాపగ తీరేటట్టు, ఆర్యాపురంలో నేనూ బసచేస్తాను" అన్నాడు చంద్రారెడ్డి. "నీకోజులు దగ్గిర పడ్డాయిలే" అనుకుని రంగారెడ్డి, చంద్రారెడ్డితో వెడతానని చెప్పి వెళ్లేను.

౬

మర్నాడు రంగారెడ్డి, భార్యనీ, వీరమ్మనీ వెంటబెట్టుకుని ఆర్యాపురంలో తన పురింటిలో దింపి, అందరతోటి చెప్పి, సీతానగరందారి పట్టేడు. సగంమార్గం పోయి గొందిగుండాయిల్లి పోవు వేసుకుని, వెనక్కి మళ్లి పురింటి వెనకాలున్న తుప్పల్లో దాగుని, ఇంట్లో ఏమి జరుగుతున్నదీన్నీ కనిపెడుతున్నాడు.

మధ్యాహ్నం అవగానే చంద్రారెడ్డి గుర్రం మీద ఆర్యాపురంవరకూ వచ్చి, "సైసు" చేత గుర్రాన్ని ఇంటికి పంపేసి, కాలినడకని కాసులున్న పురింటిలో దూరేను. ఈసంగతంతా కనిపెడుతున్నాడు రంగారెడ్డి చెట్లసందుల్లోనుంచి. కాసులు స్వయంగానే ఎదురుగా వచ్చి చంద్రారెడ్డికి స్వాగతం ఇస్తూ తిన్నగా తనపడకగదిలోకి తీసుకెళ్లింది. అక్కడ కాసులు,

"ఈబీదపురింట్లోకి రావడానికిమీరు సంకోచించవద్దు" అంది చంద్రారెడ్డితో.

"నిర్మలమైన ప్రేమ వుంటే పురిల్లైతేనేమి?" అన్నాడు చంద్రారెడ్డి నవ్వుతూ. ఇంతలోకే వీధిలో నుంచివీరమ్మ కేకలేస్తూ వచ్చి "అయ్యో! అయ్యో! బాబు వందమందితో ఇల్లుసోదాచేయడానికి వచ్చేరు.

లే! లే" అంది. ఈమాటలు వినడంతోటే చంద్రారెడ్డి గుండెలుబద్దలైనాయి. తన ఆఖరుమాటగా, "కాసులూ! నాకుమృత్యువు తప్పదు. కడసారి ప్రార్థన, ఒకముద్దు" అన్నాడు.

కాసులు నవ్వుతూ "భయపడవద్ద"ని అతనిరెక్కపట్టుకుని ఒకగదిలోకి యీడ్చుకెళ్లింది. అందులో రంగారెడ్డి తాలూకు రికార్డువున్న భోషాణం ఒకటి వుంది. ఆభోషాణంలో చంద్రారెడ్డిని కుక్కి అతనిమీద రికార్డుకట్టలు కప్పేసింది. ఆహా! చంద్రారెడ్డి అవస్థ. స్త్రీవాంఛాపరుల గతి ఇంతేకదా! క్షణక్షణము ఇటువంటివారికి ఆయుఃపరిమాణము తగ్గుచుండడమే కాకుండా, మానము, గౌరవమునూ అసలికే శూన్యం అయిపోతాయి. అయినా చంద్రారెడ్డి అదృష్టం బాగుంది. తాను వరించిన వనిత ఇంతకీ ఉద్దండురాలు.

చంద్రారెడ్డిని భోషాణంలో దాచి, భర్త కెదురెళ్లింది కాసులు. ఆవిడని చూసీ మండిపడి రంగారెడ్డి,

"ఓసీ రాక్షసీ! నీమొగుడెక్కడున్నాడే? వాడీఇంట్లోకి రావడం మేము చూసేం. ఇక నీతంత్రగొట్టుతనం పనికిరాదు. నీఅటుక నీగోనుసంచులూ నీపిపాలు ఇక్కడెందుకూ పనికిరావు. ఇంటికి చిచ్చుపెట్టేస్తున్నాను" అన్నాడు.

"నేనేమీ ఎరగను. అనవసరంగా నన్ను తూలనాడొద్దు. మీపిచ్చికి చేతనైన పనిచేయండి. నా అభ్యంతరం లేదు" అంది కాసులు. మరింత మండిపడి రంగారెడ్డి ఇంటికి చిచ్చుపెట్టేసేడు. పొగలో ఉబుకుతోంది పూరిల్లు. ఆకాశాన్ని అంటుతున్నాయి అగ్నినాలికలు. ఇటువంటి సమయంలో చంద్రారెడ్డి స్థితి ఎలాగ వర్ణించడమో తెలియకుండా వుంది. చేసేది లేక రామనామం జపిస్తున్నాడు భోషాణంలోపల. దురాత్ములకి కాలం అయినప్పుడు, వారు తలచినపని జయప్రదంగా అవుతుంది. న్యాయమైన ప్రవర్తన వుంటే ప్రపంచంలో జీవించడం కష్టంగావుంటుంది. అందచేత, అన్యాయంగా ప్రవర్తిస్తూ వలుకరితో పాటు "నారాయణా" అని ఆఖరు గుటక వెయ్యడమో, లేక, అందర్లోనూ న్యాయస్థుడై నక్షత్రాల్లో చంద్రుడై వుండడమో చెయ్యాలి. ఇట్టివారు ఇప్పట్లో చాలా అరుదు. కాకపోతే, చంద్రారెడ్డి అగ్నిలో మలమలమాడక ఎలాగ బయటపడ్డాడో చూడండి. తనప్రియుడు అగ్నిలో పడి చచ్చిపోతున్నాడని తెలుసుకుంది కాసులు. కాని ఏమాత్రంను చలించక, వీరమ్మని చూచి, "వీరమ్మా! నీయజమాని అనూయచేత మతిపోగొట్టుకుని ఇంటికి చిచ్చుపెట్టేసేరు. ఆభోషాణంలో మన ఆస్తిపాస్తుల వివరం అంతా కాగితాల్లో వుంది. అదికూడా ఇంటితోపాటు తగలబడితే, ఆయనా నేనూ చిప్పపట్టుకుని తిరగవలసిందే. ఇప్పుడైనా పోయి మనం మోసుకొద్దాం రం" అంది.

ఆహా! ఆడది ఎంత చమత్కారి. దానివ్యూహాలు కనిపెట్టగల పురుషుడు ప్రపంచంలో వున్నాడా? ఆ యుక్తులూ, ఆ తంత్రాలూ, ఆ ఆలోచన్లూ పైవారి కుండగలవా? దీనికి తార్కాణం మన కథానాయిక కాసులే కాదూ? "భోషాణం" "రికార్డు" అనడంతోటే వులిక్కిపడి చూసేడు రంగారెడ్డి. అదికూడా ఇంటితోపాటు తగలబడితే కాసులు చెప్పినట్టు చిప్పచేతికి వస్తుందనుకున్నాడు. ఇద్దరి మనుష్యులచేత భోషాణాన్ని ఇవతల కీడ్పించి మామిడితోపులో వుంచి తిరిగి ఇంటికి పంపేసేడు. ఇల్లంతా పూర్తిగా కాలేంతవరకు అక్కడే వుండి అందుల్లోపడి, చంద్రారెడ్డి చచ్చిపోయేడని సంతోషిస్తూ, ఇక శాంతంగా నిద్రపోవచ్చునని, రాజమహేంద్రవరం కుటుంబంతోటి వెళ్లేడు రంగారెడ్డి.

కాసులికి రంగారెడ్డి ప్రవర్తనచూస్తే, అసహ్యం, భయంపుట్టావేసి, పుట్టింటికెళ్లి తలితండ్రులతో మొరపెట్టుకుంటూ, అన్యాయంగా తనమీద భర్త నిందఆరోపించేడని చెప్పింది. ఇదంతా తనకూతురికి ముసిలిమొగుడ్ని కట్టినందుకు వచ్చిన గ్రహచారంఅనుకుని, గౌరరెడ్డి అల్లుడిదగ్గరికి కుటుంబసహితంగా వచ్చి, కాసులు చెప్పిన విషయానికి సమాధానం అడిగేడు. ఒకరోజులో ఇదంతా నిశ్చయంగా జరిగిందని ఋజువుచేస్తానని మామగారివద్ద ఇరవైనాలుగుగంటలు గడువు పుచ్చుకొన్నాడు రంగారెడ్డి. ఇందుకంతా ఒప్పుకున్నారు. ఆమర్నాడు

విందుకు రావలసినదిగా పున్నమ్మ అల్లుణ్ణీ కూతుర్నీ కోరింది. విందుసమయం అప్పుడే అంతా ఋజువు చెయ్యడానికి నిశ్చయించేరు.

## ౧౦

యథాప్రకారంగా డాక్టరుగారు షికారుకని మ్యూజియంలోకి వెళ్లేరు. అక్కడికి వెళ్లగానే చంద్రారెడ్డి మళ్లీ సిద్ధపడ్డేడు. అతన్ని చూసి తెల్లబోయేడు తాత. "చచ్చిపోయినవాడెలాగ బ్రతికివచ్చేడో" అని ఆశ్చర్యపడ్డాడు. జాగ్రతమనిషి కనక ఇదంతా కప్పి పుచ్చి,

"ఏమయ్యా! చంద్రారెడ్డి! విశేషాలేమి"టన్నాడు. "విశేషాలంటే విశేషాలా" అంటూ కడుపు పట్టుకుని నవ్వుతున్నాడు చంద్రారెడ్డి. అతని నవ్వు కొక్కొక్కటి రంగారెడ్డిని బొటనవేలినుంచి దహించేస్తోంది. కాని ఏమి చేయగలడు! ముసిలిముగుడై బ్రతికి వుండకూడదనుకున్నాడు పాపం. చంద్రారెడ్డి నిన్న ఆర్యాపురంలో జరిగిన వృత్తాంతం అంతా చెప్పేడు. ఆశ్చర్యంగా చూస్తూ రంగారెడ్డి,

"భోషాణంలోంచి ఎలా తప్పించుకున్నావు" అన్నాడు.

"భోషాణానికి తాళం లేదు. పురిట్లోంచి నేనున్న భోషాణాన్ని ఇంటికి యిచ్చుకెళ్లడం గ్రహించేను. కూలీలు భోషాణం వొదిలి వెళ్లడంతోటే, నా అంతట నేనే తలుపు తెరుచుకొచ్చే"నన్నాడు నవ్వుతూ చంద్రారెడ్డి.

ఈమాటవినడంతోటే గుండెల్లో రాయిపడినట్టయింది రంగారెడ్డిగారికి. స్త్రీ అంటే ఏమిటో గ్రహించుకుని గజగజ వణికేడాయన. "తాయిమామని పెళ్లాడితే బాగుండేది, ఇంతవయస్సులో కాసుల్ని పెళ్లాడేకంటే" అని అనుకుని,

"అబ్బాయీ! కనీరోజున మాఅత్తారింటికి విందుకెడుతున్నాను. నువ్వుకూడా రావడం నాకోరిక. అక్కడ నీకున్నూ డాక్టరుగారి భార్యకిన్నీ వున్న సంబంధం విషయం సంతోషంగా ముచ్చటించుకుందాం" అన్నాడు చంద్రారెడ్డితో.

"అలాగే మీమాట కద్దుచెప్తానా" అన్నాడాయన శిష్యుడు.

అత్తవారింటికి వెళ్లగానే, భావమరదుల్నీ, అత్తమామల్నీ చేరదీసి చంద్రారెడ్డిని చూపించి, ఈతనే కాసుల్ని వరించేడనిన్నీ, తాను కాసులు పెనిమిటనే సంగతతనికి తెలియదనిన్నీ, యీసంగతంతా గుట్టుగా వుంచాలనిన్నీ చెప్తుతూ రంగారెడ్డి విందుకి కాసుల్ని రానియ్యొద్దని ఆజ్ఞాపించేడు.

అత్తమామలు చంద్రారెడ్డికి స్వాగతం ఇచ్చేరు. విందు జరుగుతోంది. అందరూ ఒకచోటకి కూచున్నారు. చంద్రుడొక్కడూ ఒకపక్కని కూచుని, తన ఇష్టం వచ్చినట్టూ మతిలేని వాడిలాగ, వెనకాముందు ఆలోచన లేకుండా, తన కాసులికీ వున్న సంపర్కం ఆదినుంచి తుదవరకూ చెప్తున్నాడు. ఈవృత్తాంతం వింటున్నవారి అందర్లో నవ్వు లేక, భయంగా చూస్తున్నది సిక్కకాసుతో గడమానుకుంది. తన గుట్టంతా తెలివితక్కువగా చెప్తున్నాడు. అన్ని అంశాలూ చెప్పడం అయింది. ఇంక తనకీ కాసులికీ అయినసమావేశం గురించి చెప్పబోతూ మంచినీళ్లు కావాలన్నాడు చంద్రుడు. ఇదే సమయం కనిపెట్టి, ఒక గ్లాసులో నీళ్లుపోయించి, అందులో ఒక లోకప్పకాయ, అనగా, వారిరువుర మొదటి సమావేశంలోనూ చంద్రుడు తనకిచ్చిన వుంగరాన్ని పడేసి పిన్నమ్మచెల్లెలి చేత పంపింది కాసులు. ఇంతలోకే చంద్రుడికి, ఆర్యాపురంలో ఇల్లుతగలపెట్టడంవరకూ వచ్చింది. నిజంగా తనని కాసులు ప్రేమించిందని నిర్ధారణచేయబోతూ, గ్లాసెత్తి నీళ్లుతాగబోతూంటే ఉంగరం కనిపించిందతనికి. ఆశ్చర్యంతో దానివేపు చూసేడు. నాలిక కరుచుకున్నాడు. తన భావనమాత్రం వెలిబెట్టలేదు. "నాదేనా యీవుంగరం? ఇక్కడికెలా వచ్చింది?" అనుకున్నాడు. ఆలోచించేడు. గ్రహించేడు చంద్రుడు. కాసులు తన సలహాదారు పెళ్లామే నా అనుకున్నాడు. చిరునవ్వు నవ్వుకున్నాడు. "డాక్టరుగారు

రంగారెడ్డిగారేనా? ఎంతమోసం." ఉంగరం నీళ్లతో మింగేశ తనకథ ఇంకా చెప్తూవున్నాడు. కథంతా పూర్తిచేసి, గౌరరెడ్డికేసి చూసి

"అయ్యా! ఎలాగ వుంది నేనుచెప్పిన నా చరిత్ర" అన్నాడు చంద్రారెడ్డి.

"మహాఅద్భుతంగా వుంది. ఇదంతా నిజంగా జరిగిందేనా బాబూ!" అన్నాడు నవ్వుకుంటూ గౌరరెడ్డి.

చంద్రారెడ్డి.—ఏమిటయ్యా! అలాగ అనుమాని స్తారు. నిజంగా ఆవిడభర్త ఇక్కడుంటే ఆయనదగ్గర మాత్రం దాస్తానా యీసంగతి.

గౌరరెడ్డి, రంగారెడ్డి తెల్లబోయి ఒకరినొకరొక్క రు చూసుకుంటున్నారు. ఎవరేమనాలో తెలియడం లేదు. అప్పుడు చంద్రారెడ్డి మళ్లీ ప్రారంభిస్తూ,

"అయ్యా! రెడ్డిగారూ, కాసులిభర్తగారు యీ రంగారెడ్డిగారే అని నేను మొదట్లో ఎరుగను. ఈయ న పట్టి అమాయకలవాడన్నూ, ఈ నేనిచాసినన్నీ వా పూర్తిగా వాడుక. ఈయనకి యీవేళుక కష్టలన్నీ చెప్తూ, కాసులిమీద ఏవిధమైన అనుమానంనూ లేకండా ఉండే టట్టు చేద్దామని యీకథలు చెప్తూనూ, ఈయన్ని ఒక మార్గంలో పెట్టేను. అంతేకాని, నిశ్చయంగా కాసులిం రో నేనెరగను ఆవిడ దేంట్లోనో నేనెరగను. ఆ విడతో నేనెన్నడూ మాట్లాడలేదు. మీరు నిజంగా ఆ విడని తీసుకువచ్చి కాసులప్రనా కాదా అంటేమాత్రం నేను పోల్చలేను. రంగారెడ్డిగారికి తలతిక్క కలగడం తాను ముసలాయన నవడంచేతనూ, పెళ్లాం పడుచుపడుచు చేతనన్నూ, ఇంతేకాని సత్యంగా నేనూ కాసులూ దూరా

నిర్దోషులం. కాని ఒకటి; ఈయన ఇప్పటి చరిత్ర ప్ర పంచంలో ఒక నిదర్శనం కాగలదు; ఎలాగంటే, ఎవరై వీళ్లు నెత్తికొచ్చి, గడ్డంబలిసి, పళ్లుపూడి, శరీరంకుష్కించి, ఒరదులాగ బ్రతికి, ఇంకా "పెళ్లాం పెళ్లాం" అని ఏడ్చే బుద్ధిహీను లితని కథవిని పెళ్లివద్దని ఒట్టుపెట్టుకుంటారని నానమ్మకం." అని చెప్తూతూ చమత్కారంగా దోషం అం తా రంగారెడ్డినెత్తి నేసి తను తప్పించుకుని, కాసుల్ని అ మర్యాదనుంచి తప్పించేడు చంద్రారెడ్డి.

ఈకథంతా విని, కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వు తూ బాంబురుదులంతగా "బాబా! మతాబా కాల్చేవా" అని అడిగేరు. "ఇది నా గ్రహచారం" అన్నాడు రంగా రెడ్డి. అంతా నవ్వేరు. వృద్ధుడైన రంగారెడ్డి అద్భుతం గా చూసి, "ఆ! ఆ!" అంటూనే నేలమీద పడి చచ్చిపో యేడు. ఉత్తరక్రియలైనాక కాసులు రాజమహేంద్ర వరంచేరి, ఆస్తికి అధికారం పుచ్చుకుంది. విధవావివాహ సమాజంవారు యీవిషయమై మాట్లాడి చంద్రారెడ్డికి అవిడకీ కలసంబంధం కనుక్కొని, ఇద్దరికీ శాస్త్రోక్తంగా పెళ్లిచే సి సంఘాన్ని వరపించేరు.

"నేనెటేగ ఘనవ్వనున్న తేగానే తాగనుందికాని, ఏనుగుపాలైనన్ని పమురు గెలుస్తుందా" అంటూ కాసు లు దగ్గరకెళ్లి సంతోషంగా కౌగలించుకున్నాడు చం ద్రారెడ్డి.

"బుద్ధొచ్చిం"దంటూ రంగారెడ్డి ఆత్మ, పైనుంచి చేకేసినట్టు పిల్లిదరూ విని నవ్వుకున్నారు "ఎవరి వృద్ధి వారితలలో వుందికదా" అని సంతోషిస్తూ.

---

# పద్మినీవిలాపము

సోమంచి వాసుదేవరావు గారు

ఏకార్ణవమున శయించు శేషశయాను నాభిఁ దొలుత జన్మంబు నొంది
సర్గక్రియాకళాసంపద్ధురీణుఁడౌ నజునకుఁ బుట్టినిల్లయి తనర్చి
కలశపాథోరాశి కన్యకామణియైన రమకుఁ గ్రీడామందిరముగఁ బరఁగి
హరిహరవిధిరూపధరునకు ఖరధామునకును బ్రేమపదంబనంగ నెసఁగి
యఖిలసుమనః ప్రకాండంబులందు నెందు-ననుపమవిలాసగౌరవం బంది తుదకుఁ
దోడఁబుట్టు విరోధంబుతోడఁబుట్టు-వకట! యిట్లు కళంకితంబయ్యెఁ గాదె.

తమ్ములు నాకపాదములఁ దాచుచు మాసిరి పెంపులెల్ల హా
ధ్యమ్మున దొంగిలించుచుఁ గటా! శశిసోదరుఁడయ్యె మానుషా
నెమ్మి నొకించుకేనియు గణింపఁడు; సజ్జనులైన వారు దుః
ఖమ్మునఁ గూరుపల్లఁ గృపఁ గాంతురు హా! పగవారలేనియున్.

శ్రీరామామణిఁ గన్నతండ్రి యల రాజీవాసురావాసశృం
గారాగారము లేమిఁగల్మి నొకపీఁకన్ జెందవర్తించు గం
భీరశ్రీనిధి నూత్నరత్నములకున్ బెన్నిక్కయై పొల్చునా
క్షీరాంభోధికిఁ బుత్రుఁడయ్యె శశి నేత్క్రౌర్యల్ గణింపండయో.

కల్లోలినీపతి గంభీరమూర్తి రత్నాకరేంద్రునకుఁ బుత్రకుఁడునయ్యె
శ్రీసుధాకల్పక చింతామణీ సురభులకు నెన్నంగఁ దోఁబుట్టువయ్యె
భావజవైరి సర్వజ్ఞుఁడౌ గిరిసుతానేతకు మౌళిమాణిక్యమయ్యె
వివిధకళాకలాపవిదుండు ననఘుఁడౌ సురదేశికునకు శిష్యుండునయ్యె
వంశమును శీలమును వన్నెవాసి సుంత-యరయలేనట్టి చెన్నంటి యయ్యెఁ జంద్రుఁ
డిను వియోగార్తిఁ గుందఁ దపియించు సహజ-పద్మిని గలంపఁ దన కేమిఫలముగలుగు.

ఇను నికరంబులన్ బెరిగి యెంతయు శోభవహించి ధాత్రిఁ గాం
తిని మెఱయించి రాజను సుకీర్ణవినిర్మలకీర్తిసంపదన్
దనరియుఁ దాను గేవలకృతఘ్నుతె మిత్రవియోగతప్త ప
ద్మిని బతిదేవతన్ గలఁచు; మేలుదలంతురె రాజులెన్నఁడున్.

రా జనినంత మాత్రమున రాజగునే యలచంద్రుఁ డక్కటా!
భ్రాజితసర్వచక్రపరిపాలనమున్ బొనరింప దక్షుఁడో?
రాజితసర్వధర్మపరిరక్షణమున్ బొనరింప దక్షుఁడో?
తేజముమీఱ సద్వ్రతిఁ దేఁకువఁ బొందఁగ జేయ దక్షుఁడో.

రమణీరమణీయముఖోపమసందర్భమునఁ గలిగె వైరంబలచం
ద్రమునకు మాకును దానోడి మదిన్ గడుఁగినుకనటమటించున్ మిగులన్.

హాలాహలం బుదగ్రగతి నంబుధిలో నుదయించి కీలలన్
గ్రాలుచు లోకజాలము దెగన్ దగ్రమింగఁగఁడంగ దానినా
ఫాలవిలోచనుం డుచితభంగిని మ్రింగి శిరోధినుంచెఁ ద
ద్ధాలాహలానుజున్ శశినిదాఁ దలనుంచెఁ ద్రినేత్రసన్నిధిన్.

కారణమింత లేకయు జగమ్ములఁ దమ్ముల బాధపెట్టియోఁ
గ్రూరుఁడనాట రుద్రుఁడు శిరోమణి యన్మిష మెల్లమెల్లనన్
జేరఁగఁదీసి క్రొవ్వడఁగఁ జేయఁ ద్రినేత్రము పొంతనుంచెనం
చారయుఁ డాశశాంకుఁ డనయంబు శిరోమణినంచు నెంచెదున్.

అదిగాకుండిన నెన్నఁడేని గురుభార్యాలోలుపస్వాంతు దు
ర్మదుఁ జేతోజహితున్ వియోగిజనధైర్యశ్రీహరున్ బద్మవై
రి దయాహీను నిశాచరున్ గిరికుమారీభర్తసర్వజ్ఞ మూ
ర్తి దయాంభోనిధి యుత్తమాంగమున నర్థిన్ మాళిఁగాఁ బూనునే?



శ్రీ మార్గరోటా మొహాస్సర్ కన్య.

(చక్కని దేహపుష్టి గలదిగ ఖ్యాతిగాంచి పోటీలో ముమ్మారు. ప్రథమబహుమతి పడసినది) G. S. A.



మాడెల్ వెయిల్డ్ బాల.

తనతోడిజాతి సముద్రప్రయాణముల జేయుచుండుట గాంచి యీ పసిబిడ్డ అసూయతో దానను సాహసించి యొక మోటారు తొట్టి నెక్కి నీట పయనము సాగించుచున్నది. —G. S. A.

# చిన్నప్పుడు

కపిల కాశీపతిరావుగారు, B. A.

౧

"కృష్ణా! కృష్ణా!...గోపలా!"

"ఓయి!"

"ఇదుగో, ఇల్లారా. పొద్దున్నించీ..."

"అమ్మా! నా పిల్లంగోవి లేదే?"

"అన్నయ్య దాచేశాడు. వాడితో నువ్వు ఆడుకోవడం లేదుటగా? వెతికి వెదికి విసిగి పోయాడు, పాపం. నీకోసం."

"పిల్లంగోవి లేదే?"

"ఇస్తానుగానీ, ఎక్కడకి పికారుమళ్లీ? ఆ ఏటిగట్టున తిరక్కురా, నాయనా. చెట్లు పుట్టలూ ఎక్కితే యెన్ని దెబ్బలు విరుగుతుందో. ఏ పురుగు అంట పొడుస్తుందో? బయటికి వెళ్లితే మళ్లీ తిన్నగా ఇంటికొచ్చేదాకా నా ప్రాణం కొట్టుకొంటూనే ఉంటుంది."

"రాము డేడే?"

"అన్నయ్య నాన్నతో పొలంవెళ్లేడు. నువ్వు ఏంచేస్తున్నా వక్కడ? ఇల్లారా. తలదువ్వుకో లేదు నిన్నటినుంచీను. వారం రోజులయింది తలంటుకుని."

"ఎప్పుడూ తలంటే. నాకొద్దే."

"దొంగా! దొరికావు. ఎక్కడికి వెడతా వింక?"

"తలదువ్వుకున్నానే, అమ్మా, పొద్దున్న"

"అబద్ధాలు. బండా! దువ్వేదాన్ని నాకు తెలియదురా?"

"నువ్వేనా? ఇంకెవరూ లేరా?"

"అన్నీ పెద్దకబుర్లు. ఎవరున్నార్రా? నీ మేన మామ పెళ్లాం?"

"చూడవే, నిజంగా తలకూడా అంటింది."

"ఎవరూ?"

"రాధ"

"అన్నా! దేశద్రిమ్మరీ. 'సత్రా భోజనం, మఠా నిద్రా' అన్నట్టు వాళ్లపంచలోను వీళ్ల పంచ లోను బతుకుతావా దిక్కులేని పిల్లాడిలాగ! పో. అక్కడికే వెళ్లు ఆతలంటిందాన్నే అన్నం కూడా పెట్టమను? నువ్వొస్తావు తినకుండా. తిన్నావా? ఇల్లాచూడు నా కేసీ......"

"ఊఁ"

"పెట్టమని నాలుగురోజులపాటు ఇంటిపట్టున అన్నం తిన్నావూ? నాన్న దగ్గిర అన్నయ్య తిన్నాడు ఈవేళ. నీ కోసం వెన్నపూస దాచాను. రా నా దగ్గిర తిందుగాని. ఎంతసేప యిందో—ఏమీ కడుపేదీ? చూడూ పొట్టవీడు స్తోంది. రా, నాన్నగిన్నా. కలిపి గోరుముద్దలు పెడతాను. చెప్పినమాట వినమ్మా మరీ— వాళ్లకృష్ణమ్మ ఉట్టికి అల్లరికుంక అంటున్నారు అంతాను."

"అమ్మా!"

"ఊఁ"

"రాధ నాకు ఏమవుతుందే?"

"అత్తయ్య."

"ఏమిటే, అమ్మా, అవీ?"

"మిరపకాయలు."

"ఎందుకు అల్లా తిప్పుతావు నా చుట్టూ?"

"దేశాలన్నీ తిరిగివచ్చావు గిలగిచ్చకాయలాగ. ఎవరికళ్లు ఎటువంటివో?"

"రాధకళ్లు బాగుంటాయే, అమ్మా! వాట్లతోటి నాకళ్లలోకి చూస్తుంది."

"చూశావా, కాస్తగోడైనాలేదు పోయి లోంచి?"

"అయితే రాధచూస్తే అల్లా అవుతుందా?"

"ఏమో, ఎవరికళ్లో నువ్వింక యిల్లుకదలకూ."

"అల్లాఅనకే, అమ్మా, రాధమంచిదే. నిన్న నేను వెళ్లలేదని ఏడ్చిందే. అమ్మ కోప్పడుతుందంటేను అడిగిరమ్మందే. వెళ్లొద్దుటే, అమ్మా? ఇంకెక్కడికీ వెళ్లనే, రాధగారింటికితప్ప. నిన్న కోపంవచ్చి నేనువెళ్లలేదే. అందుకనీ అన్నం తినలేదుట."

"కోపం ఎందుకు?"

"అదికాదే, చూసిచూసి గబుక్కుని రెండు చేతులు పట్టుకని ముద్దుపెట్టుకుంటుందే. అందుకని"

"చిన్నపిల్లాడవుగదా అనిముద్దూ. నేను పెట్టుకోనూ, ఇల్లారా. ఏమిటిమొహమ్మీద?"

"నువ్వుపెట్టుకున్నట్టుకాదే. నువ్వుపెట్టుకుంటే చల్లగా ఉంటుందే. రాధ వేడిగా ఊపిరిసలపదే. ఉక్కిరి బిక్కిరి అవుతుందే. ఎంతసేపటికీ వదల్దు."

"పాపం! ఇంతోటి నల్లబంగారం అంటించుకుందామనీ"

"రాధ నలుపుకాదేమిటమ్మా మరి?"

"అందుకనే రంగులో రంగుకలిసింది."

"అమ్మా!"

"ఊఁ."

"రాధని పెళ్లిచేసుకోవద్దుటే?"

"ఏడిశావు. నీకంటె పెద్దదిరా. నీకు అత్తయ్య అవుతుంది."

"అవుతే ఏం? నే పెళ్లిచేసుకుంటాను."

"అదికాదు, రేపెళ్లినవ్వుతే, అత్తా! అత్తా! ఓ మంచికూతుర్ని కని నాకిమ్మని అడుగు"

"ఇద్దర్నీ చేసుకుంటాగా."

"ఓరి నీఅఘాయిత్యం కూలా! ఎవరిదగ్గిర నేర్చుకున్నావురా ఈ పనికిమాలిన మాటలూ? పుట్టికొన్నీ, పుట్టకకొన్నీ విపరీతపుబుద్ధులు..."

౨

"అత్తా! అత్తా!"

"..........."

"రాధా!"

"ఓయి."

"ఎంతపిల్చినా పల్కవేం? ఎక్కడ"

"దొడ్లో; ఇల్లా; పాకలో; అల్లరి చెయ్యకు మెల్లిగా రా."

"ఏం?"

"ఆవు బెదురుతుంది మాట్లాడితే ఎగచేపుతుంది"

"నువ్వో మరి?"

"నాదగ్గిరంటే అలవాటు. అదుగో చూడు. అప్పుడే అడుగు లేస్తోంది అమ్మవారు. అల్లా కూచో కొబ్బరిచెట్టుకింద."

"మాఅమ్మ రోటిమీద కూచోవద్దంది."

"రోళ్లు ఎక్కుమందా? దొంగతనాలు చెయ్యడానికి........అదుగో అదే వొద్దన్నది. జడ నెప్పిపెడుతోంది. అయ్యో! అయ్యో! పడిపోతాను. పాలొలికిపోతాయి."

"ఇల్లా ఇయ్య, నాపొట్లలో వలకపోస్తాను."

"పూర్తిగా పితకనీ, నీకోసమే. కూచో మరీ ఒక్క నిమిషం......పోదూ, అంతా మోట సరసం. అయిందిలే నాకేం. ఆవు బాదం తెంపుకుంది ఇంకోగుక్కెడైనా ఇవ్వదు...... ఇదుగో పిల్లంగోరు ఊదు, నుంచుంటుంది."

"అమ్మదొంగా, తెలిసిందిలే నీ వేషం. నువ్వు కూడా వినడానికి కాదూ? ఊరికే అడిగితే పాడనని"

"అయితే నేపాలివ్వను."

"బలవంతంగా తాగుతాను."

"చూద్దాం."

"....................................."

"అత్తయ్యోయి! నీకుదణ్ణం, నీకుదణ్ణం, విడిచిపెట్టవూ?... బాబోయి, బాబోయి, ఊపిరి సలపడంలేదు. అత్తా! అత్తోయి!"

"అదేవొద్దన్నది. అత్తేంవిటి? అత్త. రాధ అనరాదూ. శుభ్రమైన పేరుంటే? అత్తట. అత్త."

"రాధోయి! రాధోయి! రాధోయి! రాధోయి!"

"తాగు. ఎల్లా తాగుతావో? పాలు...తప్పించుకుందామనుకున్నావేం? ఇందుకే ఈ ఎత్తు. తెలిసిందా?"

"ఇంక చెయ్యను విడిచిపెట్టవు?"

"ఏమిస్తావు?"

"చాల్దేంవిటమ్మా? అన్నిమాట్లు పెట్టుకున్నావు, ఇంకెంత సేపు?"

"అయితే ఖయిదువిడుదల లేదు."

"సరే. ఇంకోమాటు. ఏం?"

"కాదు ముఖ్యంగా మూడుమాట్లు."

"ఊం......ఊం—ఒకటీ......రెండూ పెట్టుకో దబ్బున."

"నాయిష్టంవచ్చినప్పుడు పెట్టుకుంటాను, నీకెందుకు? అది దాచుకుంటాను. మొన్నటిదొకటి—ఇదొకటి రెండుముద్దులు బాకీ. తెలిసిందా?"

"సరే. విడిచిపెట్టు మరి."

"అప్పుడే అయిపోలేదు. ఇంకావుంది."

"అబ్బా! విడిచిపెట్టమంటే. వేడిగా ఎర్రగా కళ్లా నువ్వూను. బాగున్నావులే."

"అందుకనే చల్లబడడానికే."

"ఈవేళ విడిచిపెట్టవా?"

"వేణువుమీద పాడతావా మరి?"

"నువ్వల్లాపట్టుకుంటే ఎల్లా పాడతాను?"

"విడిచిపెట్టేసతరవాత పాడకపోతే?"

"నీయిష్టంవచ్చినన్ని ముద్దులుపెట్టుకో."

"ఇల్లా కూచునేపాడాలి మరి"

"నీవొళ్లోనా? నన్ను ముట్టుకోకుండా ఉంటేం!"

"సరే."

... ... ... ... ...

"కృష్ణా! ముద్దుకృష్ణా! మురళీకృష్ణా! ఎవరు నేర్పారు నీ కీసంగీతం? పాట ఇంత బాగుందని నీకు తెలుసా కృష్ణా? మాట్లాడవేం? వినబడడం లేదూ? యక్షగానమా! కిన్నరగానమో యీ యిది? కృష్ణా, నీ రాధని మింగేస్తోంది నీ పిల్లంగోరు. రాధని పట్టుకోవూ?"

"..................................."

"యమునానదికిమల్లె నాశరీరం వరదలై పారుతోంది, కృష్ణా కట్టెయ్యవూ? ఈ ప్రవంతిని నీ చేతుల్లో...కృష్ణా...చూడు. నిజంగా. ఇప్పుడు వేడిగా లేను."



"..............................."

అదేమిటి, రాధా, అల్లా ఏడుస్తావెందుకు పిచ్చిదానిలాగ, కళ్లమ్మట నీళ్లు చూసుకో—ఎందుకు అల్లా చూస్తావు?"

"కాదుకృష్ణా, ఏడుపుకాదు."

"అదుగో కళ్లమ్మట నీళ్లూ నువ్వా ఏడవడం లేదూ? ఏడవకు, రాధా. నాకూ కూడా ఏడుపొస్తుంది."

"ఎందుకు?"

"నువ్వేడిస్తే నాకూ వొస్తుంది."

"నేను నవ్వితే"

"నాకునూ."

"నిజంగా? కృష్ణా! నిజంగా? నేనేడిస్తే నీ కేడుపొస్తుందా? అయితే నేనంటే యిష్టమేనా నీకు?

"ఊఁ"

"మరి నేనల్లాచేస్తే కేకలేస్తా వెందుకు?"

"ఊరికేనే. మరినువ్వుచేస్తున్నావుగా నే కేకలేసినా? కేకలేస్తే కోపమా? బాగుండదూ?"

"అదికాదు. నీకిష్టంలేదేమో అని"

"ఎందుకు రాధా అల్లా కళ్లమ్మటనీళ్లు? కోపం వచ్చిందా ఇందాకా కేకలేశానని?"

"కాదు."

"మరి ఎందుకు?"

"నువ్వు వెళ్లిపోతావని"

"ఏడవకు రాధా. నేవెళ్లను. ఎప్పుడూ ఇక్కడే ఉంటాను."

"మీ మామయ్య రమ్మన్నాట్టగా మధురలో ఉండటానికి? అక్కడ రాజభవనంలో ఉండి నన్ను మర్చిపోతావేమో అని"

"రోజూ ఇక్కడికొస్తాను రాధా. ఏరుదాటి చెప్పకుండా వస్తాను. ఏం? ఏడవకింక. పోనీ నువ్వుకూడా రా ఎక్కడికెడితే అక్కడికి"

"ఎల్లాగా?"

"పెద్దాణ్ని అయాక నన్ను పెళ్లి చేసుకుంటాగా.

"అందుకనే నువ్వు పెద్దవాడివయిపోతావని"

"అయితేమేం? నిన్ను పెళ్లి చేసుకుంటాగా? అప్పుడు మనిద్దరం ఉండొచ్చు ఎంచక్కా ఏం?"

"ఒద్దు. నువ్వు ఇల్లాగే ఉండాలి, కృష్ణా. ఎప్పుడూ ఇంతే. పాలు తాగుతూ, ఇక్కడే, నీ మురళీ నువ్వు, ఇదే మోస్తరుగా ఉండాలి. పెద్దవాళ్లయితే ఏంబాగుంటారు? పెద్దాళ్లయితే అసహ్యంగా ఉంటారు. కృష్ణా! అదేమిటో అంతా పెద్దాళ్లని పెళ్లి చేసుకుంటారు? నా చిన్నికృష్ణుణ్ణి చేసుకోకూడదూ, కృష్ణా! ముద్దుకృష్ణా! రాధాకృష్ణా!"

"మరల్లాగ, అల్లాగే ఉన్నాననుకో. నీ కెప్పుడూ ఇల్లాగే కనబడతాను."

"కృష్ణా!"

"ఎందుకల్లా చూస్తావు?"

"తనివితీరదు, కృష్ణా! నీకు నేను బాగుండను?"

"ఏం?"

"మరినాకేసి నువ్వల్లా చూడవేం?"

"ఎప్పుడు నువ్వే చూస్తావుగా. నన్ను చూడనివ్వందే."

"చూసి ఏంచేస్తాను?"

"గట్టిగా పట్టుకుని ఊపిరిసలపకుండా ముద్దు పెట్టుకుంటావు. వేడిగా ఊపిరి నుస్తావు"

"నువ్వుకూడా అల్లాచెయ్యి. ఇంక నిన్నుకూడా చూడనిస్తాను. చూడు, కృష్ణా! నాకేసి, నీయిష్టం. నీకిచ్చేశాను నన్ను. రాధ నీదే. ఏంచేసినా సరే దీనితోటి...ఇప్పుడే కావాలా?"

"ఊఁ."

# మద్యపానము : మనపూర్వులమతము

శీరిపి ఆంజనేయులుగారు

త్రావి, త్రావి, పయింబయిఁ ద్రావి, ధరణి
మత్తునందూలిపడుచు, సొమ్మగొనిలేచి,
మరలఁద్రావిన జన్మంబె మాయు[1] ననెడు,
ఖలుల పల్కులఁ గల్లఁగాఁ దలఁపవలయు.

[2]ఎవఁడు మాంసభోజనము వర్జించి, యెపుడు
శుద్ధసాత్త్వికాహారము శుద్ధజలము
నెంచి, పక్వమ్మునర్థి సేవింపఁగనునొ,
యాతఁడే మానవశ్రేష్ఠుఁ డనఁదనర్చు.

[3]బలియు నాహారశుద్ధిచే భావశుద్ధి;
భావసంశుద్ధి సుస్థిరప్రజ్ఞ వెలయుఁ;
గనుక సన్నపానములు మేల్మిఁ జలంచి
విడువవలయు సురాపానవృత్తి నరుఁడు.

అసురభావమ్ముచేత మోహాన్వితాత్మ
యగుచు, నీచవ్రతమ్ముల మిగులఁదవిలి
మద్యమాంసాదులనుగొను మనుజవితతి
చెడుగతిం జరించునని [4]గీతనుడువుఁగాదె?

[5]ఎవఁడు, తనయింతి సురసేవఁదవులఁగనునొ
యాతఁ డాచారసంశీలుఁడయ్యుఁ, బతితుఁ
డగును, దనమేన సగమువా లఘువిశిష్ట
మగుడు, మిగులుభాగము శుద్ధమగు నదెట్లు?

[6]భూసురుఁడు కల్లుద్రావ, సముద్రగామి
యగు, నదీతీరమందుఁ జాంద్రాయణంపు
వ్రతము సల్పి, యిడునది సత్రంబు విప్ర
తతికి, గోమిథునంబు సద్బ్రాహ్మణునకు.

మద్యపానమ్ము, రాజయు, నున్మత్తవృత్తి,
పరవశత్వమ్ము, జరయును బాల్యదశయుఁ
జెందు నరుఁ డోడి తగవెందుఁ జెల్లదంచు,
మునుపు వచియించెఁడే జగమునువు [7]మనువు.

కడచు పంచమహాపాతకములు, నొకట
మలయుఁ ద్రాగుడు చేసంచు [8]మనువు పల్కె,
కల్లు నెఱచిని గొను నీచకార్యపరు
మాలవలెఁ దోలునదియనె [9]పరాని యొకఁడు

[10]సత్యమడుగంటు మధుపానసరణి కతనఁ,
గరుణ పొలివోవు మాంసభక్షణమువలన,
గరిమనశియించు నతిచార కారణమున
నంచు ఘోషించు వాక్యసంచయము వినమ?

1. కాళింగి గ్రం: [illegible].
2. ఋగ్వేదము-మండ: ౧-అష్టక: ౨-సూక్త: ౧౬౩- మంత్ర: ౧౫
3. ఛాందోగ్యోపనిషత్తు.
4. భగవద్గీత-అధ్యా: ౧౬-శ్లో: ౧౦.
5. పరాశరస్మృతి-అధ్యా: ౧౧-శ్లో: ౨౬.
6. పరాశరస్మృతి- అధ్యా: ౧౨-శ్లో: ౭౫.
7. మనుస్మృతి-అధ్యా: ౧౧-శ్లో: ౧౬౩.
8. మనుస్మృతి ,, ,,
9. పరాశరుఁడు. చూడు, పరాశరస్మృతి అధ్యా: ౧౧- శ్లో: ౧౩.
10. "మద్యపస్య కుతస్సత్యం దయా మాంసాశనః కుతః"

మద్యమాంసాదులను గొనమరగి, దుష్ట
చరితుఁ డగువాని చెల్మి దోష మ్మటంచుఁ,
దొలిఁ [11]కణాదయతీంద్రుండు తెలియఁ బలికె
మదిర మన్నపు మలముగా [12]మనువు చాటె.

మద్యపాయి సర్వస్వమ్ము మంటఁగల్పి,
తల్లిపిల్ల భావమ్మును దలఁపఁబోక,
ప్రాణిహింసారతుండయి పరఁగు నెందు
నంచు, మాణిక్యమాల శాసించుఁగనుము.

[13]వికలభావమ్ము పొరగుట, వెసఁగుపాటు,
జల్పనమ్ములు సల్పుట, చేసమాది
నన్ని పాతసంపూర్ణలక్షణములంచు,
మానవుండు సురాపానమహిమవలన.

వైరూప్యమును బొందు వ్యాధిబాధలఁ గుందు
స్వజనులచేఁ బరిభవముఁ బొందు
కార్యమ్ముపట్టునఁ గాలమ్ము సడలుచు
నెల్లరపగకుఁ దా నెక్కయగుచు
జ్ఞానమ్ముగోల్పోవు జ్ఞాపకశక్తియు
ధైర్యమ్ము నంతకంతకును బాయు
సజ్జనసాంగత్యసల్లాపములు పోయు
క్రూరులనీచుల కొలువుసేయు
భవ్యధర్మకామార్థసంపదలఁ ద్రోయుఁ,
బతితుఁడగుఁ గులమందు, సద్గతుల డిందు
నంచు, బాసప్రియునిగూర్చి యార్యవరులు
[14]నుడివి రదిగాన మధుపాన ముడుగఁదగును.

నయనముల గిట్టునంద్రిప్ప, నాల్కయందుఁ
దత్తఱఁ జనింపఁజేసెడు, నుత్తనేస
మునకుఁ దాల్యము మధుపాన మనుచుఁజాటెఁ,
గాళిదాసుఁడు, భావనవిఖ్యాయశుఁడు.

అరయ, మాంసమ్ము మద్యసురాసవములు
యక్షరక్షఃపిశాచాళికైన[15]వనుట,
జ్ఞానవిదు లాడినట్టి వాక్యమ్ముగాన
మనుజుఁ డిదిగని పెరకుచి మాను గొప్ప.

[16]త్రాగుసది యగ్గలంబు పాతకములందు
శ్రీతి హిరణ్యాదిదానసంగతుల నైన
జీవములువాయు ప్రతిక్రృతి చేతనైనఁ
దఱుగ దద్దాని మనుజులకు దవులఁ జనదు.

[17]కల్లు గను నగ్నివర్ణంబుగాఁగఁ గాచి
పాన మొనరింప, ననలంబులోన నుఱుక,
అలవృమై మహాప్రస్థాన మాచరింపఁ,
బాయునంత్రము సురద్రావిన పాతకంబు.

మధుపుత్రోఁ దెచ్చు వస్తువెట్టిదియుఁ గొనఁగఁ
బోల [18]దన, హోలముంగ్రోల మేలె? వినుము
మరణ మందిన నేకాని మద్యపాయి
శుద్ధిఁ బొందఁ డటం[19]చార్యసూక్తి దెల్పు.

---

11. వైశేషిక-అధ్యా: ౬-ఆహ్ని: ౧-సూత్రా: ౭. ౮.
12. మనుస్మృతి-అధ్యా: ౧౧.
13. "వైకల్యం ధరణీపాత మయథోచిత జల్పనమ్..."
14. "వైరూప్యం వ్యాధిపీడా స్వజనపరిభవః కార్యకాలాతిపాతో విద్వేషో జ్ఞాననాశః, స్మృతిధృతిహరణం విప్రయోగశ్చసద్భిః, పారుష్యంనీచసేవా కులగిరివలనం ధర్మకామార్థహానిః, కష్టంభోషోడశైతేనిరుపచయకరా మద్యపానస్య దోషాః
15. "యక్షరక్షః పిశాచాన్నం మద్యంమాంససురాసవమ్.
16. భారతము-ఈభావమే పరాశరస్మృతి-అధ్యా:౧౨-శ్లో: ౭౬న జూడుము.
17. ,, శాంతి-అశ్వా: ౧-పద్య: ౩౦౭
18. ,, ,, ,, ,, ,, ౩౦౮.
19. యాజ్ఞవల్క్యుఁడు.

[20] ఐహికములగుఁ బాపకృత్యమ్ములందు
మేదురంబగునది సురాస్వాదనంబు
గాన, నీమదిరాకాంక్ష మానకున్న
జగము కడుమానహీనమై వగలఁ బొగులు.

[21] ప్రాని యెటులేని మధుసేవ మాను కొన్ని
నెల్ల వర్ణజులకు; దాన నెసఁగుఁ గీర్తి
వైభవశ్రీలు; పుణ్యజీవనము నబ్బు
నంచుఁ, గాత్యాయనికి శివుఁ డాన తిచ్చె.

[22] మద్యభాండంబుఁ గంపు సామమునఁ బోదు;
[23] మనసుకొంచగాదు కల్లుద్రావ; [24] మాలదైవ
ములను సుంకయి పూజింప ముక్తిలేదు
సిద్ధ; మని వేమకవి నిర్వచించెఁగాదె?

[25] కానిపనులకెల్ల సుర కారణంబు,
[26] మింటఁ దావిన పురుషునిఁ జేరఁదగదు,
తాకిసి మాటాడఁజనదు, మద్యమ్ము విడుచు
కొప్పటంచును వేమన చెప్పలేదె?

కల్లుభంగిసారాయము లెల్ల, దేహ
పరవశత్వమ్ము నొసఁగు నంచు, [27] బ్రహ్మయోగి
పలికె; సభ కనర్హము మద్యపాన మనుచు,
నారసింహయోగీంద్రుండు కేరియాడె.

మద్యపానదుష్కృత్యము ధర్మజ్ఞులెల్ల
రెల్లవేళల ఖండించు టెఱిఁగి యెఱిఁగి,
యాదురభ్యాసచితి కెరయగుచు, నెప్డు
మానవుఁడు శలభక్రియ మ్రగ్గఁదగదు.

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు,— 'భారతి.'

---

20. భారతము "అనుశాసనిక-ఆశ్వా: ౫-పద్య: ౧౭౪-౧౭౫.
21. ,, ,, ,, ,, ,, ౧౭౬.
22. వేమనపద్యములు (వావిళ్లవారిది) పద్య ౪౧౫.
23. ,, ,, ,, ౨౨౦౭.
24. ,, ,, ,, ౪౯౬.
25. ,, ,, ,, ౨౨౧౯.
26. ,, ,, ,, ౪౨౪.
27. శ్రీ పోతులూరి వీరబ్రహ్మము.







అనగా వినగా చెప్పగా చేయగా — ఒక ఊళ్లో ఒకజమీందారు. భూస్వామి. అది వసంత ఋతువు. ఆసంవత్సరం వారి అంటు మామిడితోట పుష్కలంగా ఫలించింది. సంతోషంతోటి మాంచిరకాలు ఏరి, రెండు బుంగలనిండా నింపి, ఒక కావటివాడిని పురమాయించి, ఉత్తరం ఇచ్చి జాగ్రత్తగా ఇచ్చి రమ్మని ఈపళ్లు అల్లుడుగారి ఊరు పంపినాడు.

కూలివాడు ఉత్తరం బొడ్డున దోపుకొన్నాడు, కావడి వేసుకు బయల్దేరాడు. మధ్య దార్లోకి వచ్చేటప్పటికి మట్టమధ్యాహ్నమయింది. అంచేత, ఒక చెట్టునీడను కావడి దింపుకున్నాడు, విశ్రాంతి తీసుకుందామని. వాడు కూర్చొనేటప్పటికి ఒకఆలోచన తట్టింది. "ఇన్నేసిపళ్లున్నాయిగదా! నాలుగు తినేశి, ఆ చెరువులో గుక్కెడు మంచినీళ్లు తాగేస్తే ఈపూటకు ముద్ద తీరిపోతుంది. బత్తెకర్చు మిగుల్చుకోవచ్చు" అని ఎత్తుగడ వేశాడు. చుట్టుపక్కల ఎవళ్లూ లేకుండా చూసి, తలుచుకొన్నపని కానిచ్చాడు.

సాయంత్రానికి కూలివాడు యజమాని అల్లుడుగారి ఊరు చేరాడు, పళ్లూ ఉత్తరం

వప్పగించాడు. అల్లుడుగారు ఉత్తరం చూసు కొని, పళ్లు లెక్కపెట్టించుకుని, "ఏమిరా, అబ్బాయీ! నాలుగుపళ్లు తక్కువున్నాయేం?" అని అడిగాడు. "బాబ్బాబూ! వాస్తవమేనండి నాలుగుపళ్లు తిన్న మాట. ఆకలికి ఆగలేక పోయానండి. మీకెవరు చెప్పారు, బాబూ! ఈ సంగతి?" అన్నాడు. "వెధవా! ఉత్తరంలో ఉందిగాదుట్రా?" అంటూ, పోనీ ఏమిటి, ఈ స్వల్పవిషయంలో గట్టిగా అడిగేదేమిటని, మరేమీ అనకుండా వారూ ఊరుకున్నారు. అక్కడికేదో అయిపోయింది.

మరొక్క పదిహేనురోజులకి జమీందారు ఇంకోదఫా పళ్లు సిద్ధపరిచి, నమ్మకమైన వాడుకదా అని, మునుపటివాడిచేతనే కావడి వేయించి, ఉత్తరంకూడాయిచ్చి మళ్లా పంపించారు. మధ్యదార్లోకి వచ్చేటప్పటికి కూలి వాడికి పూర్వంలాగునే దురుద్దేశం కలిగింది. ఈసారిఒకయుక్తి ఆలోచించాడు: "క్రిందటి మారు నేను పళ్లుతిన్నప్పుడు ఎవ్వరూ చూడ లేదు. కాని ఈవెధవఉత్తరం చూసి చెప్పింది. అందుచేత దీనికంటబడకుండా తినెయ్యాలి" అను కొని ఒక చిన్నగొయ్యితీసి ఆఉత్తరం దాన్లో కప్పెట్టి, మామూలుగా పళ్లుతినేశాడు. తరు వాత లేచి వెళ్లబోయేటప్పుడు పైకి తీశాడు, ఉత్తరం. ఊరుచేరుకున్నాడు. కావడిదింపాడు, ఉత్తరం ఇచ్చాడు.

అల్లుడుగారు ఉత్తరం చూసుకుని, పళ్లు లెక్కపెట్టించినారు. ఈసారికూడా తక్కువే వచ్చాయి, పళ్లు. కూలివాడి నడిగేటప్పటికి, వాడు భిడియపడుతూ ఇలా గన్నాడు:— "బాబూ! నీతల్లికడుపుమాడ, క్రిందటి మారు ఈ వెధవ ఉత్తరం చూసి చెప్పింది గదా అని దీన్ని కప్పెట్టి మరీ తిన్నానండి, పళ్లు. మహా చెడ్డ జంతువండిఇది. రక్షించండి, బాబూ! ప్రభువులు."

కూలివాడి అమాయికపు యుక్తికి ఇంటిల్లి పాదీ, కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుకుని, "పోనీలే వెఱ్ఱివెధవా! ముందెప్పుడూ మాత్రం ఇల్లాంటిపన్లు చేయకేం?" అని మందలించారు. కూలివాడు తిరిగి వాళ్లింటికి పోయాడు. మనం మనింటికి వచ్చాము.

---




వారణాశి నరసింహశాస్త్రిగారు

ఒక గొల్లవానికి కొన్ని మేక లుండినవి. అనుదినము వాడు వానిని అడవికి తోలుకొని పోయి మేపుకొనుచుండెడువాడు.



అనుదినము......... మేపుకొనుచుండెడివాడు

ఒకనాడు ఒక మేకపోతు గుంపునుండి తప్పిపోయినది. రాత్రిఅయినది. నాడు మంచి వానకూడ కురిసినది. వానకు బాగుగతడిసి ఆమేకపోతు చలికి వణకుచు ఒక కొండగుహ లోనికి పోయి పండుకొనినది.

మఱికొంత సేపటికి ఒక సింహము కూడ వానకు తడిసి చలికి వణకుచు మేకపోతున్న గుహలోనికి వచ్చినది. అక్కడనే పండుకొని ఉన్న మేకపోతు కన్నులు జిగిని, దాని పొడ వయిన గుబురుగడ్డమును జూచి కొంచెము భయపడినది. 'ఇదయేదో వింత జంతువుగా ఉంది. నే నెప్పుడు ఇటువంటిదానిని చూడలేదు' అని అనుకొనుచు వెనుకముందులు కడుగులు వైచుచు జంకి నిలుచుండినది. మేకపోతుకును సింహమును చూడగనే ప్రాణములు పోయినట్లయినది. అట్లే రాత్రిగడచినది. తెల్లవారుజామున మునిమునిచీకటిలోనే సింహము వెనుక వెనుకకునడచి గుహవెలుపలికి వచ్చినది.

మేకపోతు సింహము జంకుట కనిపట్టి తానును బయటకు వచ్చినది. కొంచెము తెగువ తెచ్చుకొని 'నీ వెవరు' అని సింహము



'నీ వెవరు' అని సింహము నడిగినది.

నడిగినది. సింహాము 'అయ్యా, నేను మృగరాజునగుసింహామును' అనిచెప్పి 'తా మెవరు?' అని మేకపోతును అడిగినది.

'ఓహో, నీవు సింహామవా, ఇప్పటికి నేను వేయి మదపుటేనుగులను, నూగు పెద్ద పులులను చంపి తింటిని. ఒక్కసింహ మయిన నాకు దొరకినది కాదు. సింహామును చంపి తినువ-కు గడ్డమును గొరగ నని దీక్షను పట్టితిని. నా అదృష్టవశమున నేడు నీవు దొరికితివి. నిన్ను చంపి, తిని, నా దాడి పీడను వదలించుకొందును' అని తలను ఊపుచు ముందుకు కొక్కుడుగును వైచినది. అదిచూచి భయపడి సింహాము 'చచ్చితిని దేవుడా' అని పరుగెత్తి



సింహాము 'చచ్చితిని దేవుడా' అని పరువెత్తిపోయినది.

పోయినది. మేకపోతు నాడు అడవికి మేతకు వచ్చిన గుంపులోచేరి సాయంకాలము ఇంటికి బోయినది.

---




ఒక ఊళ్లో ఒక పండితు డుండేవాడు. ఆయనకు నలుగురు కొడుకులు, ఒక కూతురూను. కొడుకులంతా చాలా గొప్పపండితులు. ఆయన కూతురికి కూడా చిన్నప్పటి నుంచి సంస్కృతం చెప్పించాడు. ఆ అమ్మాయికి మంచి సాహిత్యం కుదిరింది. ఒక్కతే కూతురవటంచేత తండ్రి చాలా గొప్ప ఆస్తి ఉన్నవారి పిల్లవాని కిచ్చి ఆ అమ్మాయికి పెళ్లిచేసాడు. ఆ అల్లుడు చాలా రూపస్తే, కాని చదువు మాత్రం అంటింది కాదు.

కూతురుమాత్రం పెద్దమనిషయ్యేటప్పటికి విద్వాంసురా లయింది. ఈలా ఉండగా కార్యం చేసారు. ఆ అమ్మాయికి మగడు చదువుకోలేదని, తానే చదువుకున్నానని చాలా గర్వంగా ఉంది. గర్భాదానపు గది లోనికి రావటంతోటే ఒక సంస్కృతశ్లోకం చదివి మొగుణ్ణి ఎత్తిపొడిచింది. 'నీవు చూడటానికి చాలా అందంగానే ఉన్నావు గాని విద్య లేకపోవటంచేత మోదుగపువ్వులాగే నీవు శోభించటం లే' దని. ఆ మాట లతని కర్థ మయ్యాయి. ఆ యెత్తిపొడుపు చాలా బాధ కలుగజేయటంచేత ఆవేళ అర్ధరాత్రి ఎవరితోటి చెప్పకుండా లేచి చక్కాపోయాడు. తిన్నగా కాశీకివెళ్లి అక్కడ చదువు ప్రారంభించాడు.

తెల్లవారిన తరువాత ఆ అమ్మాయి ఇవతలకు వచ్చింది. అల్లుడు లేకపోవటంతోటే అంతా కంగారుపడ్డారు. ఆ అమ్మాయిని 'యెక్కడకు వెళ్లాడో నీకేమైనా తెలుసునా' అన్నారు. 'నాకు తెలియ' దంది. రాత్రి తాను చేసిన గమ్మత్తుమాత్రం చెప్పిందికాదు. ఏ మొగము పెట్టుకొని చెప్పుతుంది? అల్లుడు మాత్రం ఎక్కడా కనబడలేదు. ఒక యేడుపు యేడిచి ఊరుకున్నారు. ఈలా ఉండగా అల్లుడు వెళ్లిపోయి పన్నెండేళ్ళు గడచిపోయాయి. అదివరదాకా 'యెప్పుడైనా తిరిగి వస్తాడేమో' అనుకునేవారు. అప్పటికి ఆ ఆశ కూడా పోయింది. 'చచ్చిపోయా' డనుకుని కర్మంతా చేసారు. ఆ అమ్మాయికి శాస్త్రోక్తంగా ముండనం చేయించి ముసుగుపెట్టి మూల కూర్చుండబెట్టారు. ఇదంతా తన తెలివి తక్కువవల్ల వచ్చిందేకదా అని యేడుస్తూ ఆ అమ్మాయి, ఇంట్లో అందఱకు వండి పెడుతూ వంటింట్లో కాలంపుచ్చుతూ వుండేది.

కాశివెళ్లిన అల్లుడు అన్నిశాస్త్రాలు చక్కగా చదువుకున్నాడు. చాలా గొప్పపండితు డనిపించుకున్నాడు. 'ఈసారి యేమాత్రం ఆక్షేపిస్తుందో నాభార్య చూద్దా' మనుకుంటూ ఇంటికి బయలుదేరాడు. త్రోవలో ఎక్కడ చూచినా ఆయన్ని మర్యాద చెయ్యనివారే లేరు. ఈలా ప్రయాణంచేస్తూ తనమామగారి ఊరు వచ్చాడు. తాను ఫలాన అని ఎవరికి తెలియనియ్యలేదు. తనభార్యకు జరిగిన గౌరవమంతా ముందే తెలుసుకున్నాడు. తగిన శాస్తిఅయిం దనుకున్నాడు. పండితుడవటంచేత ఈయన్ని మామగారింటి కాహ్వానించా రావేళ. 'సరే' నన్నాడు. వెళ్లి భోజనం చేస్తున్నాడు. ఆరోజున మామూలుప్రకారం వంట వడ్డన అంతా ఆ అమ్మాయే చేసింది. పండితుడు భోజనంచేస్తూ ఎల్లాగా ఆ అమ్మాయిని ఎత్తిపొడవటం అని చూస్తున్నాడు. ఏ పదార్థంలోను రుచిలోపం లేదు. ఇంతట్లోకే ఆ అమ్మాయి చారువడ్డించింది. చారులో మాత్రం పని తొందరలో ఉప్పువెయ్యడం మఱచిపోయింది. అదను చిక్కిందిగదా అని ఆ పండితుడు ఆ అమ్మాయిని ఒక సంస్కృత శ్లోకం చదివి ఆక్షేపించాడు. ఏమనంటే, "ఇంగువ జీలకఱ్ఱ అవి వేయటంచేత చారు

చాలా బాగానే ఉంది కాని ఉప్పు లేకపోవటం చేత మోదుగపువ్వులా శోభించటం లేదని. ఇది వినటంతోనే తాను పూర్వము మొగుణ్ణి రహస్యంగా ఎత్తిపొడవటం ఆ అమ్మాయికి జ్ఞాపకం వచ్చింది. ఇతడే తనమగడని తెలిసికొని లోపలికి వెళ్లిపోయింది. ఏడుస్తూ వంటింట్లో కూర్చుంది. తండ్రికి, అన్నగార్లకి ఇది విపరీతంగా తోచింది. సంగతి కనుక్కురమ్మని తల్లిని ఆ అమ్మాయిదగ్గరకు పంపించారు. క్రమంగా సంగతంతా తెలిసింది. పండితుడు తమ అల్లుడని తెలిసి జరిగినదానికి చాలా నొచ్చుకున్నారు. ఆయన తెలివితేటలకు చాలా సంతోషించి తగినట్లుగా గౌరవించారు రీసారి. అల్లుడు మంచివాడవటంచేత, ఆ అమ్మాయిని, మళ్లీ మామగారు వేషంలోకి తీసుకువచ్చాక కార్యం చేసుకొని ఇంటికి తీసుకువెళ్లాడు.

---

# పిల్లలపాటలు

గోపరాజు రాజన్నగారు సేకరించినవి



మాణమ్మనవ్వులూ మంచి ముత్యాలు
సుగుణమ్మ చూపులూ చుక్కల్ల పొదుపు
మాణమ్మ సుగుణమ్మ మాకు నీడల్లు
సుగుణమేమణిగాద ఎంచి చూడంగ.



చిట్టి చిట్టి చిలుక
చిన్నారి చిలుక
మాటలాడే చిలుక
మా బావ చిలుక
పండు తెచ్చే చిలుక
మాపచ్చ చిలుక
చుట్టాలొస్తే చిలుక
పలుకరించే చిలుక
తోటలో వుండే చిలుక
'తోటకూర' చిలుక.



తల్లికంటె వేల్పువైనం
ఇలను లేదు ఎంచిచూడ
తల్లిగాదు మనలనెపుడు
పాలుఇచ్చి పెంచునంచు
ఎంత గానీ ఏమి గానీ
తల్లిమనకూ త్రోవజూపు
మాతృపూజా మనకు మేలు
మాతృసేవా మనకు చాలు.

---

# పిల్లలపాటలు

యం. వి. పాపన్నగుప్త గారు సేకరించినవి

౧

అచ్చక్క బుచ్చక్క తవుడు
తవ్వుల్లో రాగింజ దారం
దారం యెత్తకపొయ్యి సాలయ్యకిస్తి
సాలయ్యపుణ్యాన బొంత నేయిచ్చె
బొంతకట్టుకోని సంతకుబోతి
సంతాలో మా రాజు సప్పిరకుట్టె

౨

పూగూడు చెట్లల్లో గంగూ
కాపురం చేతాం గంగూ
ఆమాను యీమాను పండూ
కోపురేగి మాగిన పండూ
సాకాలయెల్లప్ప జుట్టూ
జుట్టూకు టెంకాయ కొట్టూ
అది ఊడిపోతే నన్నడుగూ
జారిపోతే నన్నడుగూ

కొత్తకుండల్లో యిత్తాళికమ్మాల్
పాతికనల్లాల్ (నల్లపూసలు)
పరకతాళీబొట్లు పెట్టుకో
సుబ్బక్క పెండ్లికి పోదాం.

3

చింతపూవు చింతపూవు రాలంగ
చిల్లక్క బొట్లూ బెట్టంగ
దండుబోయ దండుబోయ నామఅది
దండలు దెచ్చే దెవరెవరు ?
పసలపోలిగాని తమ్ముడూ
అట్లయితే యిట్లరమ్మాను
ఆకులతోటకు పొమ్మాను
అరకట్టాకులు తెమ్మాను
ఇల్లోపల్లెకు బొమ్మాను
చారెడొక్కలు (వక్కలు) తెమ్మాను

దుగ్గుదుగ్గుపెండ్లికొడుకా దుగ్గాణిస్తావా?
పయనమయ్యో పాపిరెడ్డి పడుచు నిస్తావా?

౪

[భార్య మోహముతో ఒకపల్లెకు యజమానురాలైన నాగులమ్మయనే ఆమె చిత్రాల చెరగు, చేమంతిపూలంచు గలిగిన చీర గట్టుకొనిపోయి పుంగనూరు తేరులాగుటకుముందు తానే యందు వెలసియుండు దేవుసికి తోట్టదొలుత టెంకాయకొట్టుచుండెడిదట. తర్వాతనే తేరు లాగబడెడిదట. ఆమె రానంతట తేరు కదలెడిదే కాదట. అందుచే ఆ విచిత్రము నంతటి నెవ్వరో పిల్లపాటగా నల్లి పాడారట. నాటినుండి నేటివరక బాబాలగోపాలము మూలము దెలియక పిల్లపాటగా పాడుకొనుచున్నారు.]

కుంటోడిపల్లి కాడ దొడ్డి
దొడ్డికి దొరసాని నాగి
నాగికి నల్లంచుచీర
చీరకు చిత్రాలచేరి
చేరికి బత్తాలచెరుగు
చెరుగుకు చామంతిపువ్వు
పువ్వుకు పుంగనూరుతేరు
తేరుకు టెంకాయ నీరు
నీరుకు నిమ్మాలబావి.

౫

[పిల్లలు తమ రెండు పెదవులను గలిపి "తుర్రు" మని తుంపర్లు విడచుచుందురు. అప్పుడు వారి చెంతనుండు తల్లులా వైచిత్రి నవలోకించి యీక్రిందివిధమున బిడ్డల నవ్వింతురు. పురుషశిశువైన "అప్పయ్యా" యనియు, "స్త్రీ" శిశువైన "అమ్మయ్యా" యనియు చివర మాటలునవరించి పాడెదరు.]

తుంపర్లో బయ్యక్క—
పిన్నమ్మకూతురు సరవక్క—
కాదుకాదు మల్లక్క—
కాసుకు రెండుమిరియాలు
శెట్టిశెట్టి నామాలు
చంద్రగిరిబాణాలు
అమ్మయ్యా! గిలగిల! సారి గిలగిల.

---

## జోలపాటలు

శంకర సీతారత్నముగారు

ఓ లాలీ;

లాలెమ్మగుఱ్ఱాలు లంకల్లు మేసూ
అబ్బాయిగుఱ్ఱాలు మేసుపల్లాలూ

*   *   *

చిచ్చీ చిచ్చీ చీమల్లమఱ్ఱీ
మఱ్ఱికిం దున్నాడు తోఱ్ఱినాగన్నా
తోఱ్ఱినాగన్నకీ తోడెవ్వరమ్మా
యేనుగులు గానేటి యెఱ్ఱెడే తోడూ
గుఱ్ఱాల్ని గానేటి గుఱవడే తోడూ

*   *   *

ఓ పిల్లీ ;
పిల్లలకి పాలోసి పల్లెలకి బంపీ
అమ్మాయికి పాలోసి ఆడుకోబంపీ
ఆడుకుని అమ్మాయి వచ్చెగాబోలూ
అందెల్లచప్పుడాయె పందిళ్లలోనూ
చదువుకునీ అమ్మాయి వచ్చెగాబోలూ
సరస్వతిచప్పుడాయె సావిళ్లలోనూ

*　　*　　*

ఓ చిచ్చీ ;
చిచ్చోసి పిల్ల నీకు సిగ్గేలలేదె
చిన్నినాఅమ్మాయికి భయమేలలేదు
యేడవకు యేడవకు వెఱ్ఱినాతల్లి
యేడిస్తె నీకళ్లు నీలాలగారు
నీలాలగారితే నేచూడలేను
పాలాలగారవే బంగారుకళ్లూ.

*　　*　　*

ఓ పిల్లీ ;
పిల్లెమ్మ వెళ్లండె బచ్చల్లి మొక్కా
అమ్మాయి రచ్చల్లు నాడవెళ్లంక

*　　*　　*

చిట్టెడుగు పొట్టెడుగు కావాలె నంటే
సివుందుమాకిచ్చాడు చిన్న బాలల్ని
పోలేరమ్మతల్లి పొత్తుళ్లుగాయీ
పొత్తుళ్ల నాడేటి అబ్బాయినిగాయీ
పోలేరమ్మతల్లి పొదికట్లుగాయీ
పొదకట్ల నాడేటి అబ్బాయినిగాయీ.

*　　*　　*

ఓ లాలీ ;
లాలికి లక్కాకల్లూ
అమ్మకి అరటాకుల్లూ
అమ్మతో బాలలకి నిమ్మయ్యాకుల్లు.

ఓ జోలా ;
జోలమామిడిపళ్లు దూరానిగలవ్వా
దానిగట్టి తెచ్చేరె అమ్మమామల్లూ
అమ్మాయిమామల్లు యెటువంటివారూ
చేపలగంపలదగ్గిర చెయిజాచువారూ
గుడ్డికుక్క నెక్కి గునలాడువారూ
పందిపిల్లా నెక్కి పరుగెత్తువారు
వారు మాఅమ్మాయి మేనమామల్లూ :
అమ్మాయిబాబయిలూ యెటువంటివారూ
చెవిచెవిని చేరదేసి పోగుల్లవారు
అంచుపంచలవారు అంగీలవారు
పట్టుపంచలవారు పాగాలవారు
గుండుపోగులవారు గుఱ్ఱాలవారు
వారు మాఅమ్మాయి బాబాయిలూ

---



## నాడా నేత

కో. నరసింహాచారిగారు

ఇప్పుడిచ్చట చెప్పబడు నాడా నేతకు మగ్గ మక్కరలేదు. అట్టముక్కల మూలమున అనేకవిధములగు చిత్రము (Patterns) లేర్పడునట్లు నాడాల నేయవచ్చును. పడుగు దారములు వివిధవర్ణములలో నుండిన చిత్రములు అనేకవిధములుగ నేర్పడును. ఇందు మన ముపయోగించు అట్టముక్కలసంఖ్య ఎక్కువ యగుకొలది నాడాయొక్క వెడల్పు ఎక్కువ యగును.

### పరికరములు

రెండంగుళముల చతురములుగాని లేక కొంత హెచ్చుతక్కువ వైశాల్యము గలవిగాని యగు అట్టముక్కలను ఆకింటిని కత్తిరించుకొనవలయును. అట్టముక్కలు చతురస్రములుగ గాని వర్తులములుగగాని, అండాకృతిగలవిగగాని యుండవచ్చును (చిత్రము ౧, ౨, ౩). అట్టలన్నియు ఒకే పరిమాణము గలిగి యుండవలెను. ప్రతిఅట్టయందును ౧, ౨ అనిగుర్తించి యుండు ప్రదేశములందు రెండు రంధ్రములు చేయవలెను. పిమ్మట మనకు కావలసిన నాడా యొక్క నిడుపునకు సరియగు కొలతగల దారపుముక్కలను ఒక్కొక్క అట్టకు రెండు వంతున పన్నెండు ముక్కలను తీసికొనవలెను. దారపుముక్కల పొడవు రెండుమూర లుండిన చాలును. వీటియందు మనయిష్టము వచ్చినట్లు కొన్ని యొకరంగునను, మరికొన్ని మరియొక రంగునను ఉండవచ్చును. చిత్రము ౫,౬ లందు అట్టి చిత్రములకుతగిన వర్ణభేదములను తెలుపు ఆధారము లివ్వబడి యున్నవి. ప్రతిచిత్రమునందును క ఖ గ ఘ జ చ అనునవి, చిత్రము ౭ నందు చూపబడిన అట్టముక్కలను తెలుపుచున్నవి. ౧, ౨ అను సంఖ్యలు, ప్రతి అట్టముక్కయందును గల ౧ వ రంధ్రమును గాని, ౨ వ రంధ్రమును గాని చూపును. చిత్రము ౪ నందుచూపిన రీతిని పడుగు నేర్పరుపవలెనన్న క అను అట్టయందలి ౧ అను

రంధ్రము గుండా, నల్లనిదారమును దూర్చవలెను. ౨ అను రంధ్రముగుండా రోజావర్ణపు దారమును దూర్చవలెను. ఖ అను అట్టయందలి ౧ అను రంధ్రముగుండా రోజాదారమును ౨ అను రంధ్రము గుండా నల్లని దారమును, దూర్చవలెను. (చిత్రము ౪,౫ లందు నల్లని గదులు నీలవర్ణమును, తెల్లనిగదులు రోజావర్ణమును తెలియజేయును.) గ అనుఅట్టయందు ౧ రంధ్రముగుండా నల్లనిదారమును ౨ రంధ్రముగుండా రోజాదారమును ఇట్లే చిత్రమునందు జూపబడినరీతికి తగినట్లు ప్రతిఅట్టయందలి రంధ్రములగుండా నాయారంగుల దారములను దూర్చవలెను. ప్రతిదారమును ఎడమప్రక్క నుండి, అట్టకువెనుకవైపుగా రంధ్రముగుండా దూర్చి, అట్టకు పైవైపుగా కుడిప్రక్కకు తీసికొనిపోవలెను. అన్నిదారములను కుడిప్రక్క ఫ వద్దను, ఎడమప్రక్క ప వద్దను చేర్చి కట్టవలెను (చిత్రము ౭). ప, ఫ అను కొనలను రెండుప్రక్కల లాగి రెండుఆధారములకు కట్టవలెను. పిమ్మట ౭ చిత్రమునందు చూపబడిన కండెవలె నొక అట్టముక్కను కత్తిరించి దానికి తెల్లనిదారమును కావలసినంత చుట్టుకొనవలెను. దారముయొక్క కొనను, ప వద్ద ముడివేసికొనవలెను. అట్టలయందు ౧ రంధ్రముల గుండా దూర్చబడిన దారములన్నియు పైతట్టును, ౨ రంధ్రములగుండా దూర్చబడిన దారములన్నియు క్రిందితట్టును ఉండునుగాన, మధ్య నొకసందు ఏర్పడును. కండెదారమును ఈ సందుగుండా మనప్రక్కనుండి వెనుక ప్రక్కకు పోనిచ్చి ఒక అట్టముక్కతో ఈ పేకదారమును దట్టముగా ప వైపునకు అదుముచు రావలెను.



ఒకసారి పేకనువేసిన పిమ్మట అట్టలపై యంచుల నన్నిటిని కుడిఅరచేతిలోను, క్రింది యంచు లన్నింటిని ఎడమఅరచేతిలోను పట్టుకొని ఎడమవైపులకు దొర్లించవలెను. దొర్లించ వలసిన విధము చిత్రము య, ర, ల, వ శ, లందు జూపబడియున్నది. ఇట్లు దొర్లించిన ఎడల పైనుండు ౧ రంధ్రము లన్నియు క్రిందికిని క్రిందనుండు ౨ రంధ్రము లన్నియు పైకిని మారును అపుడు మరల, రెండు రంధ్రముల దారముల మధ్యను సందు గుండా కండెను పోనిచ్చినయెడల రెండవ పేకవరుస పడును. పేక వేయునపు డంతయు ఒకబద్దతో దానిని దట్టముగ నదుముచు రావలెను. రెండవ పేకను వేసినపిదప అట్టముక్కలను ఎడమప్రక్క నుండి కుడిప్రక్కకు త్రిప్పవలెను. పేకనూలును వేసినపు డంతయు అట్టల నొకమారు కుడి ప్రక్కగను, ఇంకొకమారు ఎడమప్రక్కగను త్రిప్పుచు రావలెను. ఇట్లు చేయుచువచ్చిన యెడల నాడా అల్లిక ఏర్పడుచువచ్చును. నాడాపొడువంతయు అల్లినతర్వాత ప ఫ ల వద్ద కట్టినకుట్లను విప్పి అట్టలను తీసివేయ వలెను.

అట్టలను త్రిప్పుటలో ఒక్కొక్క ప్రక్కకు ఒక్కొక్క మారుగగాని, రెండుమారులుగ గాని మూడుమారులుగగాని త్రిప్పుచు రావచ్చును. ఈవిధముగగూడ అల్లికచిత్రములందు భేదములు గల్పించవచ్చును.

---

# కవితా ప్రసంగము

సి. నరసింహశాస్త్రిగారు

(నీలకంఠదీక్షితుని శివలీలార్ణవమునుండి)

వేదములు నెల్ల పనిబూని, వెదకి వెదకి
 యలసిసొలసిన యాదిమత్స్యంబ దేల
నిఖిలనిగమవిమృగ్యమై నెగడు తావ
కాక్షిమీనంబు నుతియింతు మంబ! మేము.

చెవిని బడిన గీత మివ్వరు నచ్చోటన
సైకతమున బడిన జలముభంగి
అంతరంగ మెనసి యానంద మొనగూర్చు
సుధనుమించి సుకవిసూక్తి యెపుడు.

పదములు మన మెరిగిన వే
కద, యర్థము మనకు క్రొత్త కాదిక నాని
దదుచితరీతులు మెరయం
గదియించి భ్రమింపజేయు కవిలోకములన్.

ఉన్నవిషయంబు లుండ నేయున్న యవి త
దర్థములు చేయదగినదో యానుపూర్వి
కవితయన నింతమాత్రంబ కాదె, దీని
యందువిధి యెంత తారతమ్యంబు వెట్టె.

అందమగు కూర్పుచందంబు లరయునపుడు
పదము లొండొంటితో సరిపరచునపుడు
అన్నియును దీర్చి పరికించునపుడు కవికి
గలుగు హర్షంబునకు మేర కలదెచూడ?

---



శ్రీమతి సరోజినీ కన్య.

(సినీమానటి)

—G. S. A.



శ్రీమతి కుముదినీ కన్య.

(సినిమా నటి) —G. S. A.



అనంతగిరి జలపాతము.

ఛాయా చిత్రకారుడు: ఆమంచి శ్రీరామరావుగారు.

## ౬

### (మామూలు మర్యాదలయిన సిమ్మటు)

శి—ఏ విషయము మీఁద నేఁడు ప్రసంగింపఁదలఁచుకొన్నారు?

గు—కుమారప్పగారు వ్రాసినదంతయు ననువదించుటకు విషయాంతరములోఁ బ్రవేశించుటకు వీలు లేదుగదా! పరిపాలకు లప్పులుచేసి చేయు వ్యయములను గూర్చి నేఁడు ముచ్చటించుకొందము. ఇంగ్లీషులో దానిని Capital Expenditure అందురు.

శి—అనఁగా ముఖ్యముగా రయిలుబాటలను గూర్చి మాటలాడుదు రన్నమాట.

గు—ఔను. అవకాశ ముండునేని తరువాత పత్రికాప్రచారముఁ గూర్చియు స్వర్ణగతి నాణక వినిమయమును గూర్చియు నించుక చెప్పెదను.

శి—సరియే! అయోమార్గము లత్యంత సుఖదాయకములై యున్నవి. పూర్వము వారణాసి కేగుటయు నిల్లు కాలిపోవుటయు నొక్కటియే యని చెప్పుకొనెడువారము. ఆ గతి యాయాసములు లేకుండ నిప్పుడు కాశీరామేశ్వరముల కిట్టె పెట్టి యట్టె రావచ్చును. దేశములు కాని దేశములనుండి కొలఁదికాలములో వింతవింత సరకులు వచ్చి పడి భోగానుకూలము లగుచున్నవి— అట్లు చూచుచున్నారేమి?— ఆయురారోగ్యములు హ్రస్వము లగుచున్నవనియు, సోమరితనము పెరుగుచున్నదనియు భోగపదార్థములవాడుక యనావశ్యకముగా వృద్ధినొందుచున్నదనియు, కష్టసహనశక్తి సడలిపోవుచున్నదనియు నింక నేమేమో యనర్థములు వచ్చుచున్నవనియు, మీ మామూలుపాట పాడఁజూచుచున్నారు కాఁబోలు!

గు—నా యుపదేశభారము నీపైనే వైచుకొని నాశ్రమ తగ్గింపఁదలఁచుకొన్నావు కాఁబోలు! అట్లే కానిమ్ము. నేనూరకుండెదను. నన్నుండి యేవో నాలుగు మాటలు వినఁగోరివచ్చి "ఎగ్గుగఁ బిలిచి దాసరీ! నీకన్ను లొట్ట" యన్నట్లు చేయుచున్నావేమోయి?

శి—క్షమింపుఁడు. మీరు వెనుకఁ జెప్పిన మాట లింకను జ్ఞప్తిలో నేయున్నవని చూపుటకును, మీరు చెప్పినట్లు శక్తివంచన లేకుండ మీ శ్రమ తగ్గించుటకును అట్లంటినిగాని, మీకుఁ గోపము తెప్పించుటకుఁ గాదు. నాపై మీకోపముండిన నుండవచ్చును.

గు—దాని కేమిలే! కొన్ని నష్టములు నీవే పేర్కొంటివి గనుక వానిని విడిచి యితరానర్థములఁ గూర్చియే ముచ్చటించుకొందము.

అయోమార్గములు స్వతః మంచివే కావచ్చును. కాని యావశ్యకతనుబట్టి వానిని నిర్మించుకొనవలెను. వానిని భరించుటకుఁ గావలయు నర్థాభివృద్ధి దేశమునకు లేనప్పుడును, తగిన ప్రయోజనములు లేనప్పుడును, అవి యుపకారకము లగుటకు మాఱుగా నపకారకములు కాకమానవు. ఆఁకలి లేనప్పుడు తినుతిండివలెనే యావశ్యకత లేనప్పుడు వేసికొను రయిళ్లును అనర్థకారు లగును. ఇండియాకిప్పుడు ముఖ్యముగాఁ గావలయునవి కృషికర్మానుకూలములగు నీటివసతులును, జనులను, సరకులను సులాయాసముగా నొకగ్రామమునుండి యొకగ్రామమునకుఁ గొనిపోవుటకుఁ జాలిన చౌకబాటలును.

శి—కోపమాత్రము రానీకుఁడు, వీనికి మీకే ప్రమాణమా, ప్రమాణాంతర మేమైన నున్నదా?

గు—నాది టపామాఁతియని మొట్టమొదటనే చెప్పితిని. కుమారప్పగారి భావములే తెలుఁగున నీకుఁ జెప్పుచున్నాను. ఆయనమాటలు నిష్ప్రమాణములు గావు.

ప్రభుత్వమువారి లెక్కలనుబట్టి ౧౯౩౮-౩౯ వ సంవత్సరము చివరవఱకు సేద్యపునీటివసతులకు ఖర్చు పెట్టిన మొత్తము ౯౬ కోట్లనియు, రయిలుబాటలకు

వ్యయించిన మొత్తము ౬౫౦ కోట్లనియు స్పష్టమగు చున్నది. ఇండియాలో నంతటను ౩౮, ౫౭౯ మైళ్ల పొడుగుగల రెయిల్వేలున్నవట. ఏషియాలోని యే యితర దేశమునందును ఇంత దీర్ఘమైన యినుపబాటలు లేవట.

శి—తక్కిన యక్కఱ లన్నిటిని ఉపేక్షించి, చిక్కిన ధనమంతయును ఈ రెయిళ్లమీఁదనే పెట్టి వెచ్చించుటకు హేతువేమై యుండునో?

గు—మెగ్డానల్డుమంత్రిగారు వ్రాసిన యీ క్రింది మాటలనుబట్టి హేతువు నీవే గ్రహించుకొనుము. "అప్పు చేసి తెచ్చిన మొత్తములనుండి ఖర్చుపెట్టి రెయిల్వేలు మున్నగునవి వేసినారు; అవి యాయవ్యయగణనము చేసికొను నర్థాలోచన కార్యస్థానములందుఁ గాక, యుద్ధాలోచన కార్యస్థానములందు పరికల్పింపఁబడినవి; కనుక ఆయా ధనవ్యయమును అమోఘమార్గ పరిపోషణవ్యయ వేషముతో మాఱుఁగుపఱిచి మన కగపఱిచినారు."

శి—సేనల నొకచోటనుండి యొకచోటికి శీఘ్రకాలములోఁ గొనిపోవుట కనుకూలముగా ఈ రెయిళ్లు వేసినారన్నమాట. ఇతర స్వప్రయోజనము లేమైన నున్నవా?

గు—ఉండకేమి? రెయిళ్లకుఁగావలయు యంత్రములు పట్టాలు మున్నగు ననేకములైన యినుపసామానులు ఇంగ్లండునుండియే రావలెను గనుక, నచటి కర్మాగారములలోఁ బనిచేయువారికిఁ జేతినిండఁబని, కడుపు నిండఁదిండి, మోడలినిండ గుడ్డలు. ఇండియానష్టి యింగ్లండునకు పుష్టి.

హిందూదేశములోనుండు ముడిసరకులు ఈ రెయిళ్ల మూలమున సులభముగా రేవుపట్టణములకుఁ దేవచ్చును; అట వాని నోడలలోని కెక్కించి యింగ్లండునకు రవానా చేయవచ్చును.

మఱియు నింగ్లండులో తయారై మనదేశమునకు దిగుమతియగు ననంఖ్యాకములగు సరకులు అమ్మకమునకై యీ రయిలుబాటలమీఁద సులభముగా మనదేశములోని వివిధప్రదేశములకుఁ గొనిపోవచ్చును.

శి—మీరు నిష్పక్షపాతబుద్ధితో మాటాడవలెను. నానాప్రదేశములకు విదేశవస్తువులను గొనిపోవుట కుపయోగించు రెయిళ్లే మనదేశములోఁ జేయఁబడు సరకులనుగూడ నాయా తావులకుఁ గొనిపోవుట కుపయోగించుచుండుటలేదా?

గు—ఇంగ్లండు వర్తకమునకుఁ బ్రోత్సాహము గలిగించుటకును, స్వదేశవర్తకమును నిరుత్సాహపఱచుటకును, రెయిలుబాడిగ లేర్పఱుచుటయందుఁ జేసిన యన్యాయమునకు మెహతాగారు మూఁడునాలుగు నిదర్శనము లిచ్చినారు విను.

శి—ఏ వవి?

గు—బొంబాయిలో దిగుమతియైన విదేశపు అగ్గిపుల్లలపెట్టెలను అటనుండి రెయిలుపై ఢిల్లీకిఁ గొనిపోవుటకు నియమితమైన రెయిలుబాడిగయును, మన దేశములో తయారైన అగ్గిపుల్లలసరకును అహమ్మదాబాదు నుండి ఢిల్లీకిఁ గొనిపోవుటకు తీయవలయు మాల్యమును సమానములుగా నుండెడివట. అహమ్మదాబాదునకును ఢిల్లీకిని గల దూరము బొంబాయికిని ఢిల్లీకినిఉండు దూరముకంటె ౩౦౦ మైళ్లు తక్కువ.

శి—అనఁగా సరకులు బొంబాయినుండి అహమ్మదాబాదునకును ఉచితముగాఁ దీసికొనిపోవలె రెయిల్వేవారు విదేశవస్తుకారుల కుదారసహాకారు లయ్యెడివారన్నమాట. ఆపాక్షికపు బాడిగ లింకను అట్లేయున్నవా?

గు—లేవు; ప్రజలు పదేండ్లదేపనిగా ఘోరఁగా పోరఁగా విదరకు అధికారులు అహమ్మదాబాదునుండి ఢిల్లీకిఁ గొనిపోవు సరకులపై మణుఁగు ౧ కి రు ౨-౨-౧౧ చొప్పునను బొంబాయినుండి కొనిపోవువానిపై మ ౧ కి ౩-౭-౨ చొప్పునను తక్కువబాడిగలు విధించి పుచ్చుకొన మొదలుపెట్టినారట.

శి—రెండవనిదర్శన మేది?

గు—ద్వితీయతృతీయనిదర్శనములు చక్కెరను గూర్చియు బెల్లమునుగూర్చియు నీయఁబడినవి. బొంబాయికిని కాన్పూరునకును దూరము ౮౪౦ మైళ్లు;

కాన్పూరునకును అకోలాకును దూరము ౬౮౯ మైళ్లు. ఎక్కువ ఖరీదుగలిగిన విదేశపు దిగుమతి తెల్లచక్కెర. బొంబాయినుండి కాన్పూరునకుఁ గొనిపోవుటకు చెల్లించు బాడిగ మ ౧ కి రూ ౦-౧౩-౬. చౌక స్వదేశపు తెల్ల చక్కెర కాన్పూరునుండి అకోలాకుఁ గొనిపోవుటకుఁ జెల్లింపవలయు మూల్యము మ ౧ కి రూ ౧-౨-౮.

భోగపదార్థమగు తెల్లని పరదేశపు పంచదార బొంబాయినుండి బార్సీకిఁ గొనిపోవుటకు మ ౧ కి ౬ అణాలకొప్పున రయిలుబాడిగ యీవలెను. ఇఁక బీద వాండ్రకుపయోగపడు ముడిబెల్లము బార్సీనుండి బొంబాయికిఁ గొనిపోవుటకు మ ౧ కి రూ ౦-౯-౯ చొప్పున బాడిగ చెల్లింపవలెను. అనఁగా ౧౪ రెట్లకంటె నధికమగు మూల్యము చెల్లింపవలెనన్న మాట.

శి—మఱియొక యుదాహరణము?

గు—అనేకము చెప్పుచున్నాను, ఓపికపట్టుము. అది స్వదేశపరదేశవస్త్రవస్తునిర్మాతలఁగూర్చి యీయఁబడినది. ఢిల్లీలో స్వదేశీయుల వస్త్రనిర్మాణయంత్రశాలయును కాన్పూరులో యూరపియనుల బట్టలమరయును నున్నవి. బొంబాయినుండి ౮౩౬ మైళ్లు దూరమున నున్న కాన్పూరునకు ముడిపత్తి గొనిపోవుటకు రెయిలుబాడిగ మ ౧ కి ౧౧ అ. అచ్చటినుండి ౧౨౭ మైళ్లు దూరము మాత్రమే యున్న ఢిల్లీకి బాడిగ మ ౧ కి రు ౦-౬-౮.

ఇట్లే పచ్చితోళ్లు, గోధుమలు, మున్నగు ముడిసరకులు రేవుస్థలములకుఁ గొనిపోవుటకు రేట్లు తక్కువ. అవియే దేశమధ్యమందున్న హైందవకర్మాగారములకుఁ గొనిపోవుటకు రేట్లు హెచ్చు. రయిల్వేలు తమచేతిలో పెట్టుకొని యీవిధముగా హిందూదేశపరిపాలకులు విదేశవస్తునిర్మాతలకుఁ దోడ్పడుచు స్వదేశవస్తునిర్మాతలకు నష్టముఁ గలిగించుచు నున్నారు.

ఘోస్, వాచా, డిగ్బీ, హిండ్మన్ — మున్నగు అర్థశాస్త్రజ్ఞు లిట్టి యభిప్రాయములనే యిచ్చుచున్నారు. వాని నన్నిటిని ఎత్తి యిటవ్రాయుటకుఁ దావులేదు.

శి—పోనిండు; మీమాట ప్రమాణముగానే గ్రహించెదను. కాని శీఘ్రగమనాగమనసాధనము లగు రెయిళ్లవలన లాభములే లేవని చెప్ప సాహసింతురా?

గు—అదిగో! మరల మొదటికి వచ్చుచున్నావు. ఏవో కొన్ని కొలఁదిసౌఖ్యము లున్నవనిచెప్పి గోఁచిపాఁతరాయఁడు కోటీశ్వరుఁ డెత్తుపరుసు లెత్తఁదగునా? మనదేశములో రెయిలుబాటలతిమాత్రములుగా నున్నవి. అర్థసమృద్ధి గలిగిన పిమ్మట నెలకొల్పఁబడవలయు రెయిలుబాటలు తత్పూర్వమే నెలకొల్పఁబడినవి. ఆవశ్యకత లేని యర్థవ్యయ మనర్థకారి. ప్రభుత్వమువా రితర సత్ప్రయోజనముల కెన్నిటికో వినియోగింపవలయు పెద్దమొత్తములు ప్రతిసంవత్సరము ఈ యమోఘార్థ రూపబ్రహ్మరాక్షసికి బలిగా నిడుచున్నారు. అదియుఁగాక వేసిన రయిళ్లను సద్వినియోగము చేయుటలేదని పైనిదర్శనములఁబట్టి నీవే తెలిసికొనఁగలవు. మితమైన దేశాదాయమును అమితముగా రయిళ్లపై వచ్చించి కృషీవలుల కుపయోగించు చెఱువులు కాలువలు నూతులు త్రవ్వించుట, చౌకబాటలు వేయించుట, ప్రజారోగ్యవర్ధనము లగు సాధనములు కల్పించుట మున్నగు నవశ్యకర్తవ్యములను పరిపాలకులు మానివేయుచున్నారు. ఇవంతయుఁ బ్రమాదజన్యమనిచెప్పి వారు తప్పించుకొనఁజాలరు, ఎందుచేత? ప్రజ లవిచ్ఛిన్నముగా మొఱ్ఱలు పెట్టుకొనుచున్నప్పటికిని వారవి పెడచెవిని బెట్టి పట్టుదలతో అక్షేమకరమైన ఆపద్ధతినే యవలంబించి నడచుచున్నారు గనుక.

శి—అదితెల్పే. ఈనష్టమంతయు భరించువారు తుదకు హిందూదేశప్రజలే గనుక, రయిల్వేసంబంధమైన దేశఋణభారము నిర్లక్ష్యభావముతో నేఁటేట నిట్లు పెరుఁగనీయఁగూడదు. నేఁడువచ్చి రేపు మల్లెయు మూటయుఁ గట్టుకొనిపోవు నల్పసంఖ్యాకులగు నన్యదేశీయుల యర్థతృష్ణానివారణముకొరకు, కోట్లకొలఁదిగానుండు నోరులేని హైందవదరిద్రప్రజావర్గమును బాధించుట ధర్మము కాదు.

గు—నిజమే. ఒక దేశభాగము నుండి యింకొక దేశభాగమున కతివేగముగా సరకులను గొనిపోవుట కను కూలించు నీ యయోమార్గములే, దేశములోఁ బండిన పంటలన్నియు దేశమునుండిలాగి పరదేశముల కంపుట కుపయోగించుచున్నవి. ఒకపాలు లాభముచేయుచున్న, నూఱుపాళ్లు నష్టముఁ గలిగించుచున్నవి. ముఖ్యముగా మన దేశమున క్షామపీడలు గలుగుచుండుట కిదియొక ప్రధాన కారణము.

బ్రిటిష్‌వ్యాపారసంఘముల ప్రార్థనలు విని ప్రభుత్వము వారు రేవుపట్టణములకుఁ బెద్దపెద్ద యయోమార్గములు వేయుట యెక్కువచేయుచున్నారు గాని, చిన్న చిలిక రెయిల్వేలును కాలువలును వేసి దేశములోపలి గ్రామములకుఁ బరస్పరసంబంధము వృద్ధిచేయు సదుపాయములు గావించుటలేదు.

శి—ఔనుగాని, దేశములోఁ బండినచోట్లనుండి యాహారపదార్థములను సంపినిక్షామప్రదేశములకుఁ గొనిపోయి రయిల్లు క్షామబాధానివారకము లగుటలేదా?

గు—అనుచున్నమాట వాస్తవమే. కేవలనిరుపయోగ పదార్థమేదియుఁ బ్రపంచమున నుండఁజాలదు. మనుష్యులఁ జెఱసాలలోఁ జంపు గరళము కూడఁ గొన్ని రోగములకు సిద్ధౌషధముగా నుపయోగపడుచున్నది. రోగములు దచ్చి చికిత్సచేయుట మంచిదా? అరోగములు రాకుండఁజూచి యారోగ్యరక్షణము చేయుట మంచిదా?

శి—ఆరోగ్యరక్షణమే మంచిది.

గు—ఔనుగదా! క్షామబాధకలిగినపుడు దానిని తగ్గింపఁ బ్రయత్నించుటకంటె, పంటల నెక్కువచేయు నీటివసతులు కల్పించి, రైతు చెల్లింపవలయు పన్నులు తగ్గించి, గ్రాసమునకుఁ గావలయు ధాన్యాదులు పోఁగా, కష్టదినముల కక్కఱకువచ్చుటకుఁ గొంతసామగ్రి నిలువ చేసికొను సదుపాయము లతనికిఁ గావించి, పరిపాలకులు క్షామబాధలు రాకుండఁజేయుటకే యేల ప్రయత్నింపఁ గూడదు? పరదేశవణిక్ప్రతినిధులు జట్టికాండ్రు, పంట యింకను పొలమునుండి యింటికి రాకముందే, చౌకగా బేరము కుదుర్చుకొని, అర్థాతురుఁడగు రైతుచేతిలో నేదోకొంత పైకము పెట్టి, పైరంతయు నీరెళ్లమీఁదఁ బరదేశములకుఁ బంపుదురు. చాల నాహారపదార్థము దేశములో లేమిచే ధాన్యాదుల వెలలు అపరిమితముగా లేచి కఱవులు గావించును. పుష్కలముగాఁ బండు భూములుండియుఁ దెచ్చిపెట్టుకొను దారిద్ర్యముచే బాధపడుదేశ మీ ప్రపంచములో నొక్క మనదేశమే కాన్పించుచున్నది.

శి—కనుక నేమిచేయు మనెదరు?

గు—ఏమిచేయాలందురా? యుద్ధప్రయోజనముల మనస్సులోఁ బెట్టుకొని వృథాగా అమితధనము రైళ్లువేయుటకై పరిపాలకులు వినియోగింపఁ గూడదు. ఇట్లే యనావశ్యకముగాఁ గ్రొత్తఢిల్లి వంటి రాజధానులు నిర్మించుటకు లక్షలకొలఁది ధనము వ్యయింపఁగూడదు. "పనులు చేయు ౧౫౦౦ కోట్లపన్ను మొత్తములోను దాదాపుగా ౨౦౦ కోట్లు హిందూదేశమున కేమాత్రము నుపయోగింపని స్వార్థప్రయోజనములకు వెచ్చింపఁబడు చున్నవి" అని సా పండితుఁడు వ్రాసినాఁడు. పెక్కు మాటలేల? ౫౦౦౦ మైళ్లదూరమునందున్న చిన్నద్వీపములో మహాధనసంపన్నులై యుండు నల్పసంఖ్యాకులను తమవారి సుఖముకై, హిందూదేశములోఁ బరివారిద్రులై పడియుండు బహుసంఖ్యాకులను ప్రక్కకు ద్రోసి పెట్టుచుండ, ఆంగ్లప్రభువులు స్వార్థదృష్టితోఁ బాలనకృత్యములు నెఱపుకొనవలెను.

శి—ఏకారణమువలననో కాని పన్నొట్లను గుఱించియు కాసు రూపాయనాణెముల మారకమునుగూర్చియుఁ గొంచెము చెప్పెద నంటిరి. ఇవియైనను మనకు లాభకారులుగా నున్నవా? నష్టకరములుగా నున్నవా?

గు—నష్టకారులుగానే యున్నవని రాజ్యతంత్రజ్ఞుల యభిప్రాయము. విషయము గుహ్యమైనను చిక్కు విషయము. నే నప్రమత్తుఁడనై వివరింపవలెను. నీవు శ్రద్ధ లేకుండ వినవలెను.

శి—చిత్తము.

గు—వ్యవహారసౌకర్యార్థము, ప్రతిదేశములోను సాటిబేరముతో వస్తువినిమయము చేసికొనుటమాని, ప్రజ లిప్పుడు నాణెములతోఁ గ్రయవిక్రయములు గావించు

శి—మఱియిప్పుడో! వెనుకటి పదియేనురూపాయల తాను ౧౦ రూపాయలకే వచ్చుచున్నది. ఇది నష్టమా? లాభమా?

గు—చంకలు గొట్టుకొనక శాంతముగా వినుము. కొన్న నీకు లాభమును, స్వదేశవర్తకునకు నష్టమును.

శి—ఎందుచేత?

గు—మనదేశమునందలి నేయనయంత్రశాలలలో నేసి పూర్వము ఇంగ్లండు తానుతో పాటు రూ ౧౫ ల కమ్ము స్వదేశవర్తకుఁ డిప్పుడు దానివెల ౧౦ రూపాయలకు దింపినఁగాని దివాలా దీయును. విదేశపుతానునకు పోటిగాఁ దానిప్పుడు ౧౪ తానో అంత కెక్కువనో యిచ్చినఁగాని తనసరకు కొనరు. ఇది దేశక్షేమమా? దేశారిష్టమా?

శి—దేశారిష్టమే యనకతీఱదు. విదేశవర్తకునకు మాత్ర మేమియు నష్టములేదు — వెనుకవచ్చెడు ౧ పౌను ఇప్పుడును అతనికి వచ్చుచున్నది. సరియేకాని, పెద్ద పెద్ద జీతములు గొనుచుఁ బనిచేసి యుద్యోగాంతరమున సీమకువెళ్లు తెల్లవారికిచ్చు పెన్షనులలో లాభములేదా? ౧ పౌను పెన్షనుకై పూర్వము రూ ౧౫ లు పంపవలసియుండఁగా నిప్పుడు రూ ౧౦ లు పంపనఁజాలుచున్నదిగదా!

గు—మహామేధావులగు మనప్రభువు లట్టి నష్టమునుగూడఁ దీయుటకే, యున్నతోద్యోగులగు యూరొపియనుల జీతము లిప్పు డెక్కువ చేసినారు. అన్యాయమని ప్రజలు ఘోషింతురనికాఁబోలు, వారితోపాటు మనవారికిఁ గొందఱకుఁ గూడ వేతనాభివృద్ధిఁ గావించినారు. ఇంకొకమాట చెప్పి నేఁటి ప్రసంగ మింతటితోఁ గట్టిపెట్టెదము.

శి—అది యేది?

గు—లోపల ౧౧ అణాల వెండిమాత్రమే కల రూపాయ, దేశములో ౧౬ అణాలకు చలామణి యగుచుండుటచేత, గవరన్మెంటునకు రూ ౧ కి ౬ అణాల లాభమువచ్చుచున్నదిగదా! ఏఁటేటవచ్చు నీలాభమంతయును వినిమయనష్టపూరణముకొఱకు, "గోల్డెక్స్చేంజి స్టాండర్డుగురిజర్వు" (Gold Exchange Standard Reserve) అనుపేర నొక నిధి యింగ్లండులోఁ బెట్టినారు. మఱియు, ముద్రింపఁబడిన నోట్లన్నియును మాఱునోమాఱవో యనుసందేహదృష్టితో వానికి సమానమైన కిమ్మతుగల స్వర్ణరూపధనము "పేపర్కరెన్సీ రిజర్వు" (Paper Currency Reserve) అనుపేర మఱియొకనిధిగా నింగ్లండులోనే పెట్టినారు. అది నాలుగుకోట్లును ఇది రెండుకోట్లును ఉన్నవఁట. ఈ నిధులు స్వదేశములో నుండక పరదేశముల కేగుటచే, నింటికి జ్యేష్ఠాదేవులును బొరుగింటికి లక్ష్మీదేవులును అయి, యీయుభయ ధనవంతులుగా నుండు విదేశపు కొనిదారులను ధనవంతులఁ జేయుచున్నవని అర్థశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

శి—పైయనర్థము లెట్లుపోఁగలవు?

గు—రూపాయలోని వస్తుక్రయశక్తి స్థిరముగా నుండు నేర్పాటులు చేయవలెను గాని, విదేశవణిజుల క్షేమముకై పొందునుబట్టి దానివెల తఱచుగా మార్చుచుండఁగూడదు. ఇండియాలోఁ గూడ బంగారు నాణెమును ప్రధాననాణెకముగాఁజేసి దేశములోపల టంకసాల నెలకొల్పవలెను. మాఱకపు టేర్పాటులును ఆయవ్యయనిర్ణయమును ప్రజలచేతులలోనికి రావలెను.

శి—నమస్కారము! సెలవు.

గు—సుఖీభవ!

---

## భార్యాభర్తలు



# వరిసాగును తగ్గింపవలెనా?

మోచర్ల కృష్ణమూర్తిగారు

చెన్న రాష్ట్రమున వరిసాగును యథారీతి నభివృద్ధి చెందనీయవచ్చునా లేక దానిని తగ్గింపవలసిన పరిస్థితు లగుపడుచున్నవా? అను విషయ మిప్పుడు, ప్రజల మనముల నాందోళనపరచుచున్నది. వరిధాన్యపు ధర లిటీవల కొన్ని వత్సరములనుండి క్రమముగా తగ్గిపోవుచుండుట ఇందుకు ముఖ్యకారణము. దీనినిగూర్చి ప్రస్తుత మవసరమైనదానికంటె చాల అధికముగ పండుచున్నదనియు అందుచే గిరాకి తగ్గుచున్నదనియు సరకు నిలిచిపోవుచున్నదనియు కొందరు అభిప్రాయపడుచున్నారు. ఈ యభిప్రాయమును బలపరచువారిలో చెన్నపురి వ్యవసాయశాఖాధికారి యగు హిల్సనుగారు ముఖ్యులు. "ప్రస్తుత మీరాష్ట్రమున ప్రతిసంవత్సరము పండు పంట ప్రజలకు సరిపోవుటయే గాక, ఇంకను చాల నిలిచిపోవుచున్నది. వరిసాగు నిప్పటివలెనే అభివృద్ధి చెందనిచ్చినయెడల, అచిరకాలములోనే మనదేశమునకు వంగదేశమున జనుము సాగుచేయు రైతులకు పట్టినస్థితియే పట్టును. రైతుల ఆర్థికస్థితి తిరిగికోలుకొనవలెననినయెడల వెంటనే వారు వరిసాగును తగ్గించి దానిస్థానమున కూరగాయలు, పారిశ్రామికములగు పైరులు మొదలగువానిని పైరుచేయవలెను" అని హిల్సనుగారు హెచ్చరించుచున్నారు.

భారతదేశార్థికనిర్మాణమునందు వరిసాగు ఎట్టి ప్రధానస్థానము నాక్రమించుచున్నదో ప్రతివారికిని తెలిసినవిషయమే. భారతీయులలో నూటికి ౭౨ వంతుల ప్రజకు వ్యవసాయపరిశ్రమ యొక్కటే జీవనాధారము. భారతదేశపు దిగుమతుల వ్యాపారము, ఇంచుమించు పూర్తిగ, వ్యవసాయకులచే నుత్పత్తిచేయబడిన పదార్థములే. ఇట్టి భారతవ్యవసాయపరిశ్రమయందు సర్వవిధములను వరిసాగు ప్రధానస్థానము నాక్రమించుచున్నది. ౧౯౪౮-౪౯ సంవత్సరమున ఈదేశమున సాగుబడియందున్న మొత్తము ౨౨౮, ౧౬౬, ౦౯౬ ఎకరములలో ౨౦౦, ౨౬౮, ౪౨౨ యకరములు ఆహారధాన్యములక్రింద నున్నది. అందు సుమారు ౮౦౦ లక్షల యకరములలో వరిసాగుచేయబడుచున్నది. వరిసాగునందు, వంగ, బీహారు, ఒరిస్సారాష్ట్రములు వరుసగా ప్రధానస్థానముల నాక్రమించియున్నను, మనచెన్నరాష్ట్రముగూడ వరిసాగు అల్పమని చెప్ప వీలు లేదు. ఈరాష్ట్రమున ౧౯౪౮-౪౯ సంవత్సరమున సాగుచేయబడిన ౩౪,౮౭, ౯౪౧ యకరములలో ఆహారధాన్యముల క్రింద ౨౯ లక్షల యకరములు సేద్య మొనర్పబడెను. అందు ౧౧౦ లక్షల యకరములలో వరి సాగుచేయబడెను. ఇంతియ గాక ఈదేశమున ప్రజలకు, వరిధాన్యము ప్రధానాహారపదార్థములలో నొకటి. పశ్చిమహిందూదేశము, బీహారు-ఒరిస్సా, బెంగాలు, కర్ణాటకములందు విశేషముగను, ఇతరప్రాంతములయందు చాలవరకును, ప్రజలచే నిది ప్రధానాహారముగ నుపయోగింపబడుచున్నది. ఒక్క చెన్నరాష్ట్రమునకే గాక భారతదేశమునకంతకునుగూడ ప్రధానమగు నీ వరిసాగునకు హిల్సనుగారు సూచించిన పరిస్థితులు సంభవించియున్నయెడల, భారతీయులను గాలివిమనము సమస్యయే యెదుర్కొనియున్నదనుట నిర్వివాదాంశము. కాని నిజముగ నిట్టి పరిస్థితులు సంభవించెనా? సంభవించినచో, నివారణోపాయము లేమి అనువిషయములు, దేశీయార్థికనిర్మాణక్షేమాభిలాషులగు ప్రతివారికిని విచారణీయము. ధరలు తగ్గుటకు అనేకకారణము లుండవచ్చును. కాని ప్రస్తుతము ధరలుతగ్గుటకు పంట యధికమగుట కారణమా? ప్రస్తుతముగల పంట ప్రజలకు గావలసినదానికంటె అధికముగ నున్నదా యనుప్రశ్నలకు సంబంధించిన విషయములమాత్రమే ఈవ్యాసమున పాఠకులయెదుట నుంచెదను.

పంట అవసరమైనదానికంటె అధికముగ నున్నదా లేదా యను విషయమును గనుగొనుటకు ముందు చెన్నరాష్ట్రమునందు ప్రజల కవసరమగుపంట యెంతయో నిర్ణయింపవలసియున్నది. ఇది అంత సులభమగు విషయముగాదు. మొదట ప్రతివ్యక్తికి గావలసిన ఆహార పదార్థమును గురించియు, రెండు: బియ్యము నాహార పదార్థముగ నుపయోగించు జనుల సంఖ్యను గురించియు గూడ చాల భేదాభిప్రాయములు గన్పట్టుచున్నవి. పంట అవసరమైన దానికంటె నధికముగనున్నదని వాదించుచు హిల్సనుగారు తల ౧ కి సం.నకు ౮౮౭ పౌనులబియ్యము (౮ హం.వె.) గావలసి యుండునని నిర్ణయించిరి. అనగా రోజు ౧ కి ౧౯.౬ ఔన్సుల బియ్యము. కాని యీయంచనా చాల తక్కువయని ఈ క్రిందనుదాహరింపబడిన అంకెల వలన దెలియగలదు.

| | రోజు ౧ కి ఔన్సులు |
|---|---|
| మద్రాసు జైలులో మగఖైదీకి | ౨౦ |
| స్త్రీకి | ౧౭ |
| బొంబాయిజయిలులో | ౨౬ |
| మదరాసు ఫామినివారణ శాస్త్రము ప్రకారం ప్రతివ్యక్తికి | ౨౪ |

గొప్పప్రమాణగ్రంథముగ నందరిచేతను అంగీకరింపబడు చున్న ' Memorandam on the Progress of the Madras Presidency ' అను గ్రంథమునందు శ్రీనివాసరాఘవయ్యంగారు, చెన్నరాజధాని వాసుల కుటుంబవ్యయముల చర్చించుచు రోజుకు తల ౧ కి ౨౮ ఔన్సులబియ్యముకావలసియుండునని నిర్ణయించిరి.

రోజు ౧ కి ౧౯.౬ నుండి ౨౪ ఔన్సుల వరకును వ్యాపించియున్న పై యంచనాలలో మన మేది ప్రమాణముగ గైకొనవచ్చు ననువిషయము విచారణీయము. మదరాసు కారాగారవాసులకొసగబడు బియ్యపు ఆహారప్రమాణమందలి శరీరపోషక గుణములను, ప్రజాసామాన్యము నుపయోగించు ఆహారప్రమాణమునందలి శరీరపోషకగుణములను పరీక్షింపగా ఖైదీల ఆహారమునందు నత్రజని ౧౯౯.౪౪ గుణములు, కార్బన్ ౮౬౩౯.౩౦ గుణములు గలవనియు ప్రజలుపయోగించు ఆహారమునందు ౨౫౬.౩ నత్రజని, ౫౯౯౯.౩ కార్బన్ గలవనియు గనుగొనబడెను. దీనినిబట్టి సామాన్యప్రజ లుపయోగించు ఆహారము ఖయిదీల కొసగుదానికంటె నూటికి ౨౫ వంతు లధికముగ నుండునని తెలియవచ్చును. ప్రజలలో కొందరుబాలు రుండుటను విషయమును లెక్కలోనికి దీసికొనినను శ్రీనివాసరాఘవయ్యంగారు గావించిన యంచనా మిగిలిన వానికంటె సత్యసన్నిహితముగ నుండునని భావింపవచ్చును. ఈ లెక్క ప్రకారము తల ౧ కి సం.కు సుమారు ౫ హ. వె. బియ్యము గావలసియుండును.

కాని చెన్నరాష్ట్రమునందు ప్రజ లందరును వరి బియ్యమునే ఆహారపదార్థముగ నుపయోగించుట లేదు. వరిపంట విశేషసంఖ్యాకులకు ఆహారముగ నున్నను జొన్నలు, సజ్జ, కొర్ర, రాగి మొదలగు నితరధాన్యములు గూడ చాలమందిచే నాహారముకొరకు వినియోగింపబడు చున్నవి. ఎంతమంది ఏయేధాన్యముల నుపయోగించు చున్నా రనువిషయమును నిర్ణయించుట కెట్టిలెక్కల నాధారము గాని లేదు. ప్రజలలో సుమారు ౮౦ వంతులు మాత్రమే వరిపంట నుపయోగించుచున్నారని హిల్సనుగారు అంచనావేసిరి. కాని దేశమున పండుచున్న వరిపంటనుబట్టియు, ఒక్కొకరికి గావలసిన ఆహారమును గురించి తాను నిర్ణయించిన పరిమాణమును బట్టియు నీ సంఖ్యను నిర్ణయించినటుల గన్పించుచున్నదే గాని ఇందుకు మరొకపద్ధతి దుమూహ్యముగ నున్నది. కాని ప్రజలతో పరిచయము గల ప్రతివారికిని ఇంతతక్కువయంచనా చాల విపరీతముగ గన్పట్టును. ఈరాష్ట్రమున నితరధాన్యముల నుపయోగించువారి కంటె బియ్యము నుపయోగించువారిసంఖ్యయే అధికమని ప్రతివారికిని అనుభవవేద్యము. ఈవిషయమును నిర్ణయించుటకు హిల్సనుగా రవలంబించిన పద్ధతికంటె, దేశమున నుత్పత్తియగు ఇతరాహారపదార్థములపరిమాణమునుబట్టి నిర్ణయించినయెడల, నాయంచనాలు సత్యసన్నిహితముగ నుండగలవు. ౧౯౨౭-౨౯ సంవత్సరము

మదరాసురాష్ట్రమున వ్యవసాయశాఖవారి అంచనాల ప్రకారము ౭, ౭౫౭, ౨౩౦ టన్నుల వరిధాన్యమును, ౪, ౨౩౦, ౧౩౦ టన్నుల ఇతరాహారధాన్యములును పండెను. అనగా సుమారు నూటికి ౬౫ వంతులు వరి పంట, మిగిలిన ౩౫ వంతులు ఇతరధాన్యములు. దీనిని బట్టి ఆయాధాన్యముల నుపయోగించువారిసంఖ్య గూడ ఇటులనే యుండునని భావించుట కెట్టిఆక్షేపణయు గన్పింపదు. అటుల గాక హిల్సనుగారి యంచనాలప్రకారము నూటికి ౪౦ వంతులు ప్రజలు మాత్రమే వరిధాన్యము నుపయోగించుచున్నారని అంగీకరించునెడల, మిగిలిన ౬౦ వంతులప్రజలును—వరిపంటలో సగముకంటె స్వల్పముగ హెచ్చుగ నున్న—ఇతరధాన్యములపంటపై నాధారపడియున్నారని చెప్పవలసివచ్చును. కనుక ఆ యంచనా ఎంతహాస్యాస్పదమో వేరుగచెప్ప నక్కరలేదు.

౧౯౩౧ సం. నపు జనాభాలెక్కలప్రకారము చెన్నరాష్ట్రమున సుమారు ౪౭౦ లక్షలప్రజలు గలరు. వీరిలో నూటికి ౬౫ వంతులు వరిపంటపై నాధారపడు వారని అంగీకరించునెడల ౩౦౫.౫ లక్షలమందికి అవసరమగు వరిపంట దేశమున నుత్పత్తి గావలసియున్నది. అనగా తల ౧-కి ౪ ఔ. వె. చొప్పున నైనచో ౬౧.౧ లక్షల టన్నులు బియ్యమును ౫ ఔ. వె. చొ॥న నైనచో ౭౬.౩ లక్షల టన్నులును గావలెను.

ఇందు మించుమలె చెన్నరాష్ట్రమున గలపంటను పరికించుడము. విత్తనములు ఇతరపారుదల పోను యి౧కె పండినపంటలో ఎనిమిది హండ్రెడువెయిట్లు బియ్యము ప్రజలుఆహారముగ నుపయోగించుకొనుటకు అందుబాటులో నుండునని హిల్సనుగారు అంచనావేసిరి. ఇంతవరకు గాను వీరు ప్రభుత్వమువారు ప్రతిసంవత్సరమును పంటను గురించి ప్రకటించుఅంచనాలపై నాధారపడి రని నమ్మవచ్చును. కాని ప్రభుత్వమువారి అంచనాలు అన్ని ప్రాంతములను వర్తింపవనియు, మొత్తముమీద జూచినచో ఆయంచనాలకంటె అసలుపంట చాల తక్కువయనియు చాలమంది అభిప్రాయము. ఇట్లు భావించువారొక్క అధికారేతరులే గాదు. చాల బాధ్యతాయుతము పదవుల నధిష్ఠించియున్న అనుభవజ్ఞులగు రిసెటిల్మెంటు ఆఫీసరులును అధికారులును దెలిపిరి. మదరాసు రెవిన్యూబోర్డు కమిషన రగు అట్కిన్సనుగారు దెలిపిన యభిప్రాయము నిచట నుదాహరించుచున్నాను. "చాల సందర్భములలో పంటల పరిశోధనార్థము నిర్ణయింపబడిన భూములు సాధారణపుభూములకంటె నెక్కుడు సారవంతమైనవి." (బి. పి. నొ. ౨౨౫. డి. ౧౯౦౭.)

౧౯౧౨ సం. నెం. ౨౬౧౯ రు జి. ఓ. యందు హాన్సనుగారును, ౧౯౧౭ సం. జి. ఓ. నెం ౨౬౮౭ రు నందు సర్ ఫ్రెడరికు నికల్సనుగారును గూడ ఇట్టి అభిప్రాయమునే వెలిబుచ్చిరి. పంటల పరిమాణమును నిర్ణయించు పరిశోధనలను వ్యవసాయశాఖవారు సాధారణ భూములకంటె ఎక్కుడు సారవంతములగు భూములను దీసికొనుటవలన అందలి పంటలపరిమాణమునుబట్టి మొత్తమును పంటను నిర్ణయించుటకు వీలగాదు. ఈ కారణముల వలన ప్రభుత్వమువారి అంచనాలకంటె అసలు పంట చాల తక్కువగ నుండునని తేటతెల్లము.

ప్రభుత్వమువారి అంచనాలకంటె పంట ఇంకను చాల తక్కువయని మరికొన్ని కారణములవలన గూడ అంగీకరింపవలసి యున్నది. సాగుచేయబడిన భూమి యంతయును మంచిపంట పండెనని భావించుటకు వీలు లేదు. అందు ఎంతయో చెడుభూమి గలదు. పైరులు పూర్తిగా పోయిన ప్రాంతము లుండెను. హిల్సనుగారి యంచనాలలో దీని కెట్టి మినహాయింపును గన్పింపదు. అకాలవర్షములవలన గలుగుచున్న పంటనష్టమును గూడ అధికారులు లెక్కలోనికి దీసికొనుటలేదు. ఈ సందర్భమున, కృష్ణా గోదావరి జిల్లాల ఆర్థికవిచారణసంఘము వారు నుడివిన ఈక్రిందివాక్యములు గమనింపవలసియున్నవి: "జూను, జూలై, ఆగస్టు, సెప్టెంబరులలో సాగు చేయబడు పొలములు, వరుసగా ౧౨, ౧౦, ౮ బస్తాలు పండె ననుకొనినచో, మొత్తం దామాషాయీన యకరం ౧-కి ౯-౧౩ బస్తాలపంటయే తేలును. ఈ విధముగ ఆలస్యముగా నాటువేయుటవలన గలిగిన నష్టములే నూటికి ౮-౪ వంతు లుండును." ఈ వాక్యములు

వర్తించునది కృష్ణా గోదావరి జిల్లాలకుమాత్రమే గాదు. రాష్ట్రమునం దన్ని ప్రాంతములకును గూడ వర్తించును. భూమి యంతయు నొక్కమారు సకాలములో సాగు చేయుట అసాధ్యము. సాగుబడి సకాలమున ప్రారంభ మైనను కొన్ని నెలలవరకును సాగుచుండు విషయమును తరుణము తప్పి సాగుచేయుటవలన, పంట తగ్గునను విషయమును ప్రతివారికిని దెలిసినదే. ప్రభుత్వమువారు దెలుపు లెక్కలలో ఈయొక్క కారణములవలననే నూటికి ౮౫ వంతులు తగ్గింపవలెనని, పైసంఘమువారి సూచనల వలన దెలియగలదు.

పైకారణములబట్టి పంటను గురించి వ్యవసాయ శాఖవారు దెలుపు అంచనాలు సరిగాపనియు, చాల అధికమనియు, అసలుపంట చాల తక్కువయనియు చెప్ప వచ్చును. కాని, సరియగు అంచనా యేది యని తిరిగి ప్రశ్నించుచో, సరియగు సంఖ్యను దెలుపుటకు తగిన వివరములు ప్రస్తుత మెవ్వరికిని లభింపజాలవు. కాని వ్యవసాయశాఖవారి అంచనాలలో నూటికి ౮౫ కంటె అధికముగనే తగ్గింపవలసి యుండుననని మాత్రము స్పష్ట ముగ దెలుపవచ్చును. వాడుక కొరకు ఫలసాయముల గురించి వ్యవసాయశాఖవారి అంచనాలు క్రమమైననే యని అంగీకరించినను, ప్రస్తుతము సాగుబడియగుచున్న ౧౧౪ లక్షల యకరములనుండియు (యొక్క ౧౯౪౮ సం. వె. నో.స) ౮౮ లక్షల టన్నుల బియ్యము మాత్రమే ప్రజలకందుబాటులో నున్నవి. ఇది హిల్సనుగారి అంచనా ప్రకారము ౨౨౧ లక్షలమందికి మాత్రమే గొజు ౧కి ౨౮ ఔన్సుల చొప్పున ౧౬౭ లక్షల మందికి మాత్రమే సరిపోవుచున్నది. వరిధాన్యము నుపయోగించు ౩౪౫.౫ లక్షల మందిలో మిగిలినవారు తమ ఆహారము కొరకు విదేశముల పైననైన నాధారపడుచుండవలెను. లేనిచో దేశమునం దితరుల ఆహారములో పంపకొనినదైన తినుచుండవలెను. దేశములో లక్షలకొలది ప్రజలు తిన తిండిలేక యల్లాడుచుండిరనియు, మరికొన్ని లక్షలమంది కడుపునిండ తిండియైన నెరుగకుండిరనియు ప్రతివారికిని తెలిసినవిషయమే. ఆ విషయమును ఋజువుచేయుటకు ప్రబలమగు ప్రమాణములు గలవు. కాని ఆవిషయ మిచట ప్రస్తుతము గాదు. దేశమున పండు వరిపంట ప్రజల యావశ్యకతలకంటె అధికము గాదనియు, ఆవశ్యకతల కంటె చాల తక్కువగ నున్నదనియు ఋజువు జేయుటే ప్రస్తుతవిషయము.

ఆహారధాన్యముల పంట అందు ముఖ్యముగ వరిపంట, చెన్నరాష్ట్రమున ప్రజలయావశ్యకతలకే సరిపోవుట లే దనుటకును, వరిసాగు ప్రజల యావశ్యకతలతో సరిసమాన ముగ నభివృద్ధి నందుట లేదనుటకును ప్రభుత్వమువారి లెక్కజనాభాలుగూడ ప్రమాణముగనున్నవి. ౧౯౪౭ సం. మున నీరాష్ట్రమున ౧౪౭౧౩౯౦౭ యకరములు వరిసాగుక్రింద నుండెను. అంతకు పూర్వపు లెక్కలలో జమీందారీసాగుబడి చేర్చబడలేదు. అందుచే ౧౯౦౧-౨ సం.పు వరిసేద్యమునుగురించి సరియగు లెక్కలు దెలియుట దుర్ఘటము. అయినను వరిసాగు అభివృద్ధియొక్క స్వభా వమును గుర్తించి, ౧౯౦౧-౨ సం.న సుమారు ౧౦౦ లక్షలయకరములు వరిసాగునం దుండవచ్చునని చెప్పుచో నది చాల ఉదారమగు అంచనాయనియే సంతసింప వచ్చును. ౧౯౦౧-౨ నుండి ౧౯౩౧ వరకును ముప్పది వత్సరములలోను ఈరాష్ట్రమున జనసంఖ్య ౩౮౨౨౯౭౫౮ నుండి ౮౬ లక్షలవరకు హెచ్చెను. అనగా నూటికి సుమారు ౨౫ వంతులు. కాని ఈముప్పది వత్సరములలోను వరిసాగుమాత్రము ౧౦౦ లక్షల నుండి సుమారు ౧౧౩ లక్షలకు, అనగా నూటికి ౧౩ చొ॥న మాత్రమే హెచ్చెను. ముప్పదివత్సరములనాడు వరి బియ్యము నుపయోగించెడి ప్రాంతములును, కుటుంబము లును మాత్రమే ఇప్పుడును వాని నుపయోగించుచుండిరని భావించినను వరిసాగు వారికుటుంబాభివృద్ధితో పాటు సరిసమానముగ నభివృద్ధి నందలేదు. యథార్థము వారసి నచో, ఈముప్పదివత్సరములలోను అనేక క్రొత్తప్రాంత ములును, క్రొత్తకుటుంబములునుగూడ వరియన్నమున కలవాటుపడుట ప్రతివారికిని దెలిసినవిషయము. క్రమ ముగా హెచ్చిపోవుచున్న ధాన్యపు దిగుమతులు చెప్పు కథనుగురించి వేరుగ చెప్పనక్కరలేదు.

పైన వివరించిన విషయములబట్టి దేశమునందలి పంట ప్రజలయాహారావశ్యకతలకు ఎటుల చాలకున్నది యు స్పష్టపడగలదు. ఇట్టి సరి ఆహారపదార్థముల సేవ్యమును నధికముగ ప్రోత్సహింపవలయునేగాని తగ్గింపవలె నని చెప్పుట దేశీయార్థికనిర్మాణమునకును, దేశక్షేమమునకును చాల విపత్కరముగ గన్పట్టుచున్నది.

---

# మరాళసందేశము

కోడాలి ఆంజనేయులుగారు

౧

నవశిరీషలతాంతమార్దవము లమృత
 మధురములు నైన వాక్యసంపదల, వలపు
రాయబారముల్ నడపు కార్యములు దలప
త్వచ్ఛిరానుభవైకవేద్యములు గావె!

౨

ప్రియప్రియాలాపములను వర్ణింప నెన్ని
యూహ లెంత రసజ్ఞత యుండవలయు
నవమృణాళనాళ మధురాన్నము భుజించు
నోట ప్రేమసందేశముల్ నుడువదగును.

౩

మామకవిపంచినవ్యగీతామృతముల
నతనికీర్తివల్లరిం బెంచె ననుము నాదు
యౌవనవసంతస్వప్నవృత్తాంతగాథ
లతని కంకితదివ్యకావ్యమ్ము లనుము.

౪

పదిపదారు వెన్నెలకార్లు పైనబడిన
ప్రాపసాయంపుటూహాల పాడము వలపు
నందనోద్యానదేవకాంచననికుంజ
భాద్రపదనర్తితమయూరి వంటి దనుము.

౫

అలతిరేయెండ జెట్లనీడలకు డాగు
వింత వలవంత దెలిపి రప్పింపు మతని
మంగళగళాంకితము గాగ మధుతుషార
లలితలవలీప్రవాళమాల్యములు పైతు.

---

"చేబదులు"కి ఇంగ్లీషు ప్రతిపదార్థం (Hand-loan) అని వాడుతూవుంటారు. చేయిచేయి అంగీకరించిన ఋణమన్నమాట. మనసులు రెంటికీ యిద్దామనికాని కృతజ్ఞతాపూర్వకంగా తీర్చాలనికాని తెలియబడని, చేబదులు వ్యవహారాల్లో.

చేబదులిచ్చినసొమ్ము తిరిగి నాచేతపడగానే, లాటరీ వచ్చినంత ఆనందం నాకు.

చేబదుల్లు సామాన్యంగా స్నేహితులికిస్తూ వుంటాం. అట్లా యివ్వడంలో రెండు ప్రమాదాలున్నాయి. మూఢనంతులు ముప్పాతిక స్నేహమూ, ధనము రెండూ నష్టిస్తాయి. ఎందుచేతనంటారా? మనం గట్టిగా అడిగితే మనమీద అమర్యాద ఆరోపించి మనతో జోక్యా తెంపుకుంటాడు మిత్రుడు. ఆవూనే యెత్తకుండా వూరుకుంటే మనసు చిన్నబుచ్చుకుని సాధ్యమైనంతవరకు మనయెదట పడకుండా మెసులుతాడు. చేబదులు విషయం జ్ఞప్తికి తెస్తూ సూచనగానైనా ఒకవేళ అడిగేవా అతనిహృదయాన్ని శూలంగ్రుచ్చిన ట్లవుతుంది. అతణ్ని యేదో నువ్వు అంగామా చెయ్యడానికి పూనుకున్నట్లు భావించి కుంచితదృష్టితో నీవేపుతప్ప యితరత్రా చూస్తాడు. నువ్వు పచ్చిగా క్రగవిరిగినట్లడిగితే దాంతో మీ యిద్దరి స్నేహానుబంధం పుటుక్కున తెగిపోయినట్టే. వామనమూర్తి అంతటి అవతారపురుషుడే మూడడుగులనేల కాలుకిపుచ్చుకుని యిచ్చిన వాణ్ని అధఃపాతాళాని కణగద్రొక్కేడు. "నమామి" అని తిలోదకాలు విడిచేసిన బలి రాక్షసుడట! వామనుడు శ్రీమహావిష్ణువు! లోకరీతి యీలాగే వుంటుంది.

చేబదులు పుచ్చుకుంటూన్నప్పు డుండే కృతజ్ఞత మానవముఖంలో మరెన్నడూ కనిపించదు. ఆడబ్బుకి మళ్లీ నువు అడిగించేవో నిన్న పెద్దకోమటిగా భావిస్తాడతను. Delicacy, courtesy ఇత్యాది సభ్యగుణాలు నీలో లేవనే అతని విశ్వాసం. "లేకపోతే మనిషంతమనిషిని నిలవదీసి అడుగుతావూ? యేం పెద్దమనిషి తరహా? వెధవడబ్బూ! ఎప్పుడో బదులిస్తే యివ్వుగాక" ఇలాంటి తరంగాలు అతని హృదయంలో దొర్లుతాయి.

ఇచ్చిన చేబదులు తిరిగి తెలుసుకోకుండా సున్నితంగా అడగడం దుర్లభమేమో అని నానమ్మకం. ఇంగ్లీషునైతే

" By-the-by do you mind financing me a little in return?"

" Oh, not in the least, but sorry I should have inconvenienced you."

" Alright, don't mind much ; it is only by the way"

ఇత్యాదిగా మనసులో యిద్దరకూ కష్టంగావున్నా పైనిస్నేహపు పూతవెయ్యొచ్చు. ఏభాషలో అడిగినా మొత్తానికి పర్యవసానం ఒకటేలెండి.

ఒకవేళ చేబదులు తీర్చడమే తటస్థించినపుడు, అతడొకగు ప్తదానం చేసినట్లుగా ఆనందిస్తాడు. తనకు మనం కృతజ్ఞులమై ఉండాలనికూడా గర్విస్తాడు మనస్సులోపల.

చేబదుల్లు పుచ్చుకునేవారు రెండురకాలు. తిరిగి తీర్చాలిసుంటుందని అనేవిషయం నమ్మనే నమ్మరు ఒక రకం. మరికొందరి కట్లాంటి సదుద్దేశం కలిగినా అశక్తులౌతారు. వీరిలో రెండవజాతివారు సర్వత్ర పూజ్యులు.

ఓమాటు ఒకమిత్రుడు నావద్ద నాలుగు రూపాయిలు బదులుపుచ్చుకున్నాడు. చాలాగోజులైన తర్వాత తీర్మానం కోరుతూ సాధ్యమైనంత సౌమ్యంగానే ఉత్తరంవ్రాసేను. తిరుగుటపాలో క్షమాపణ పత్రికవొచ్చింది. నావుత్తరం అందేటప్పటి అతని అవస్థ అవర్ణనీయమనీ, వెంటనే పంపజాలనందుకు అతను పొందుతూన్న విచారం గర్భనిర్భేదకరమనీ, అన్యథా నేను భావించనని నమ్ముతున్నాననీ, మొదలగు ఘోరవర్తమానంతో అతః

త్తరం వచ్చివాలింది. మళ్లీ ఆరునూపాలనాను అర్జీ దాఖలు చేస్తే వారంరోజులవరకూ జవాబురాలేదు. తర వాత వచ్చిన ఉత్తరం యిది:—

“ పదిరూపాయిలు నోటు మనియార్డరు చేయ ప్రార్థన. మీ ఋణం పాత యెక్కౌంటు కాఫీహోటలు వాడికి కొంత యివ్వాలిసుంది”—

టర్కీదేశపు సుల్తాను నాడు ముందు యీ సూత్ర మే ఆర్థికసంస్థ పరిష్కారం చేయటంలో అవలంబించినట్లు చరిత్ర తెలుపుతూంది. పాత ఋణాలు వడ్డీతో సహా తీర్చేనిమిత్తం కొత్త ఋణాలు చేసేరట వాళ్ళు. National Debt సమస్యలాంటి Gordian knot లాగ విప్పేసే ఉపాయం చెప్పేను నా మిత్రుడ! నువ్వు దేశమోహం పెట్టుకపోక వస్తే!

చేబదుళ్ళవ్యాసం ఒకనికి నచ్చేటంటే యిస్తూన్న వాళ్లు నీయందు కృతజ్ఞత లేకపోయినా క్షమాపణ పూర్వకంగానైనా నీవొక్కసారి - నాస్తి చెప్పేనో నీ అంతటి అపరాధి అతని దృష్టిలో మరొకడుండడు. నిన్ను నమ్మినందుకు తాను బాగా మోసపోయినట్టు మహాగ్ర హోద్దిష్టుడౌతాడు. వెనకటి చిల్లరబాకీలు అప్పుడు నువ్వు కదపితే నీవు ప్రబల శత్రుత్వం అతనితో తెచ్చుకున్నట్లే.

* * * *

ఈవ్యాసం నాస్వంత పేరుతో వ్రాస్తే లేపు చే బదులు పుట్టవనే భయంచేత మారుపేరుతో వ్రాసేను. పాఠకచింతనకి క్షంతవ్యుణ్ణి.

## కాలము*

సెట్టి లక్ష్మీనరసింహముగారు (కవితాసమితి)

కాలమ! కొలువరాని యగాధసాగ
రమ్మ! వత్సరమ్ములు నీతరంగములు; బ
హువ్యథాతతుల్ నీలోని యుదకము, లవి
జనుల కన్నీళ్లుపడి యుప్పందనము పొందె!
పారమెఱుఁగని కడలి! నీపాటునోటు
లందు లోఁగొందు వీవు మర్త్యజగమెల్ల;

పొట్టఁ బెట్టుకొన్నట్టివి పెట్టుకొనుచు,
మఱియుఁ గావలెననుమాట మానక, యవి
ముక్కముక్కలుగాఁ జేసి యక్కటకట;
వెడలఁ గ్రక్కుదు వొడ్లను బడెమునట్లు
క్రూరమవు ప్రశాంతిని, మహాఘోరమవు తు
ఫానులం: నెవండు నిన్ దరియంగలండు?

---

* Shelley.








# ప్రాత కట్టడములు, గవాక్షములు

క. లక్ష్మీమోహనశాస్త్రిగారు

ఇప్పుడు 'అజంతా' విశ్వకళా పరిషత్తేని, 'ఎల్లోరా' సార్వజనీన యాత్రాస్థానము. 'అజంతా' ప్రాచ్యచిత్రకళయొక్క అత్యున్నత స్థానమును చూపుచున్నది. 'ఎల్లోరా'యందలి భాస్కర్యము శిల్పజగత్తునందు అసమానము. ఇట్లగుట ఇప్పుడో యీ రెండును యాత్రాస్థానములే.

మేము వెళ్ళిన కొలదిమాసములకు పూర్వము షుమారు మూడువందలమంది చైనా జపాను దేశస్థులిచటికి వచ్చి మకాము చేసి కొంతకాలముండి వెడలిరట! ఇటులనే ప్రతి వత్సరము అనేకులు నల్దిక్కులనుండి శ్రమ కోర్చి యిచ్చటికి వచ్చి ప్రాచ్యకళాలక్ష్మికొకతూరి ప్రణమిల్లి వెడలుచుందురు.

కళాదక్షులచే పరమశివుడు ప్రతిష్ఠింపబడిన కైలాసమందిరములో నడుగిడుసరికి ఏక శిలయందు తొలిచి — బయటినుంచి యొక రాతిముక్కనైనను లోనికి తేక — నిర్మించబడిన యింతపెద్దసౌధము (చిత్రము ౧), మిక్కిలి ఆశ్చర్యము గొలుపుట సహజమే

కైలాసనాథుడు, విష్ణుగాథలు, భారత యుద్ధము, దశకంఠుడు, శివలీలలు, గంధర్వులు, కిన్నరులు, ఏనుగులు, సింగములు, శరభ సాళ్వములు, ఇంద్రసభాగుహయం దొక చూతగుచ్ఛము, ఇంద్రునిభార్య శచీదేవి, మామిడిచెట్టునందు తీర్చిన మామిడిపండ్లు, అంతఃపురములు, మరియు మకరతోరణములు, గంగా యమునా సరస్వతీమూర్తులు, వివిధశిల్పములు మొదలుగునవి మిక్కిలి ఆకర్షకములు. కొన్ని ముఖ్యమగునాటిని అప్రచురితములను మేము చూచి వ్రాసికొంటిమి.

అద్దమువలె నునుపుగ నున్న కైలాస గుహ మొదటి అంతస్థు వసారా యందు (చిత్రము ౧) మే మొకనాటి మధ్యాహ్నము విశ్రమించుతరి పైన సరంబీయందు కొన్ని వర్ణాలేఖ్యములు కాన్పించెను. పక్కగోడ యందు రంధ్రములు గల బహు చక్కని చెక్కడపు పనితో నలరారు గవాక్ష మొండును గోచరించెను. నా చూచివ్రాతప్రతిలిపి యుదాహరణము (చిత్రము ౨). దానిసొబగు నేవర్ణింప

బనిలేదు. ఎల్లోరాగుహాల మొత్తముమీద ఆకారవివిధకల్పనలుగల యిట్టి గవాక్షములు వెలుతురు, గాలివచ్చునటులు గలవు. రాతినుండియే యిట్లివిధముగ చెక్కబడిన గవాక్షములు అనేకపురాతన పుణ్యకట్టడములలో గలవు ఇచ్చట కొన్ని యుదాహరణము లివ్వబడినవి వీటిని పరిశీలించు సమయమున "Indian design is an inexhaustible treasure-house of fine invention" అని ఆనందకుమారస్వామి వ్రాసిచ్చినది మనఃపథమునకు వచ్చును. మహమ్మదీయుల నిర్మాణములయందును మిక్కిలి నిపుణములగు నిట్టివి కొన్ని ప్రసిద్ధిగన్న టాజ్ మహాలు మొదలుగాగల కట్టడములయందు గలవు. (చిత్రము 3). కట్టి యినుమా కన్న చంద్రశిలయే యుత్తమము, శాశ్వతము నని తలచి యుండనో పుదురు; లేక అందమున చంద్రశిలసాటి యింకొకటి లేదని విడిచిరో! మ్లేచ్ఛులు తమవెంట స్థపతుల శిల్పుల నిక్కడకు తోడ్కొని రాలేదనియు, యిక్కడి శిల్పులచేతనే వారల మతాభిరుచుల ననుసరించి జగత్ప్రసిద్ధమైన 'టాజ్ మహాలు' మొదలగు సౌధముల నిర్మించి రనియు హావెలుపండితుడు సిద్ధాంతీకరించెను. కనుక హిందూదేశమందలి, రాజపుత్ర మొగలు, బౌద్ధ జైన, మొదలగు వివిధరీతులు హిందూ శిల్పకళయొక్క పరిణామములే యగుచున్నవి. చిత్రము 3 సిద్దీసయ్యద్ మసీదునందలి యొక గవాక్షము. అహమ్మదాబాదు. ఇట్టి అర్ధవలయాకృతి నున్న గవాక్షము తీమసీదునందు పది గలవు. ఈమసీదు షుమారు 1500 క్రీ. శ. న. షా నొక డిరాయి (Sandstone) తో నిర్మింపబడినది. చెక్కడపు పని హిందూసాంప్రదాయము ననుసరించి యున్నది. మైసూరు జగన్మోహనప్రాసాదమున మంచిగంధపు చెక్కలో చెక్కబడిన దీమాదిరిదే గలదు. కాని యిది యిటీవలది. "నాలుగుపోకచెట్లు మూడు పెద్ద వట వృక్షములు గలిపి బహునేర్పుగ రచించిన యిది టాజ్ మహాలునందలివాటికన్న మిన్న" అని ఫెర్గూసన్ వ్రాసెను.

26 వ నెం. అజంతా చైత్యము:—

అశ్వలాయాకృతినున్న యీగవాక్షము (చిత్రము ౪) నుండి వెలుతురు గర్భగుడియందు పడునటుల నిర్మింపబడినది. దానిమధ్య చెక్కతో అడ్డముగ అల్లిక గలది యుండెడి దేమో యను కొందరు పాశ్చాత్యుల యభిప్రాయము సరియైనది కాదు. ఎల్లోరాయందును నిట్టివి గలవు. విశ్వకర్మచైత్యము (చిత్రము ౫) చూడనగును. మైసూరు హళేబీడు హొయసలేశ్వర దేవళము, హాలబీడు నందలి బహుసుందరమగు (Screened Wall) రాతిపలకతెర (చిత్రము ౬) గమనింపదగును. అన్నిటిలో పట్టాడకల్లు విరూపాక్ష దేవాలయమునందలి గవాక్షములు కడుమిన్నలు. ఇవి ఎల్లోరావాటిని పోలియున్నవి. పట్టాడకల్లు బీజాపూర్ దక్షిణమున నున్నది. చాలుక్య వంశపురాజగు ౨వ విక్రమాదిత్యుడు 733-747 సంవత్సరములు పాలించెననియు, ఈదేవాలయము ఆతనికాలములో నిర్మింపబడెననియు నొక శిలాశాసనము బట్టి తెలియుచున్నది.

# ప్రాతకట్టడములు, గవాక్షములు



చిత్రము ౧



చిత్రము ౨



చిత్రము ౯



చిత్రము ౧౦



కాంచీపురము వరదరాజస్వామి ఆలయములోని రాతిస్తంభము

ఛాయాచిత్రకారుడు: శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారు.

చిత్రము ౭ సర్పసదృశలతలతో చిత్రింపబడినది. చిత్రము ౮ హంసద్వయము ఒకదాని ముక్కు నింకొకటి ముక్కును చున్నది. చిత్రము ౯ కూడ లతలతో చిత్రింపబడినది. ఒరిస్సాయందలి భువనేశ్వరమందలి ముక్తేశ్వరాలయములో చదరంగపు గడులవలె నున్న ఏకాంతలుగల గవాక్షములు (చిత్రము ౧౦) గలవు. వీటిచుట్టును లతలే గాక అందందు వానరులు మనుజులు కూడ కడునేర్పుగ చిత్రింపబడిన అంచులు గలవు.

---




కవితావినోద, నిడమర్తి ఈశ్వరప్ప గారు

ఏల ననుఁగాంచినంత సాయేబుకుట్టి - మెల్ల నామెడ నురివైచి మీఁదికీడ్చి
గిజగిజం దన్నుకొను నన్నుఁ గ్రిందఁగొట్టి-యుసురులొకటొకటిగ నూడ్చు కసివహింతో?

మున్ను పగతుర మొఱఁగి మీరున్న తావు - దెలిపె మావాఁడెవండొ నానలుకవలదు
పుక్కిటిపురాణ మది నమ్మఁబోకుమయ్య - సహజవైరమ్మునకు సుంత "సబబు" లేదు.

"తొండు","తొండొరు"నుంగాను, తొండ నగుదుఁ-బలికిమాలినవాఁడనఁ భ్రాంతివలదు
"తొండ" రన ద్రావిడమున భక్తుండుసుమ్ము - తొండగాఁడెందుఁ జేయునే దోసఁగునీకు?

పుష్పఫలవృక్షములు పెంపుపొందకుండఁ - బాడుసేసెడిపురువులం బట్టి మ్రింగి
యుడుతబత్తిని మిమ్ముఁగొల్చుచుందు మేము-తొండలముగాని సాయబా! యొండు కాదు.

ఉన్నచోటనె కొంతసే పుండియుండి - నేఁడికో ల్మీరుచూచినం జూడకున్న
మేనునెత్తుచు దించుచు స్మీకు సేతు - మేముసాష్టాంగదండప్రణామములను.

చిత్రచిత్రవర్ణము లూని చెట్లమీఁదఁ - బ్రాఁకుమముఁగాంచు చెల్లరుం బ్రమదమంద
నొక్క-నీకేటిశత్రుత్వమో యెఱుంగ - నురులఁ జంపెదవేమిరా తురకమొఱక?

మాటిమాటికి మా తెలిమతులుగల్గు-కుజనులను నిరసించెడి కొఱకె మమ్ము
బ్రహ్మపుట్టించె, మీరట్టివారలగుట-తప్పు మాదియో, మీదియో యొప్పికొనుఁడు.

ఘోరముగ హత్యల స్మనసారఁ జేయు-నరునకుఁగూడ మరణదండనము కూడ
దంచునెంతయుఁ జర్చించున్యాయవేత్త-లేయెడం దూటిరో మాకు సాయపడరు.

మా టికురులసారించి కంబములమీఁదఁ-దోడిమానవులంజంపి వేడుకపడి
యెన్నిభవముల నుద్యోగమేలినాము!-కాక మా కేలకలుగు నీకాకి చావు?

హానియగునంచు నీచేతికత్తె మొకటి-తొడిగి, నఃజంపి, డేగకుం గుడుపనిడవె?
ఒకనిఁజంపంగనేల వేఱొకనికిడఁగ?-అకట దయయున్న నీకు జీవాంతకుండ!

పిట్టలం గొట్టుకోనీకు విల్లు లేదొ?-చంపినను నొక్క-పెట్టునం జంపరాదె?
ఉరుల బిగియించి యిట్టట్టు లూఁచికొట్టి-హింస మముఁ బెట్టఁజన్న సాహేబ నీకు?

చిత్రవధఁ జేసినాఁడంచుఁ జెన్నపురిని-వెనుక నొక్క- "మ్యాజిస్ట్రేటు" చెనఁటికుట్ర
నాఱునెలలు చెఱంద్రోసెనహాహా!వినరొ?-అట్టి"*డానియల్"మఱిరాఁడెయరిదె నేఁడు?

---

* తగిన న్యాయ మిచ్చు తీర్పరి.

# హిందూజావానీయకళాకౌశలము

టి. యన్. రామచంద్రన్‌గారు, M. A.

౧

హిందూద్వీప్యాలనాగరకత మలయాద్వీపకల్పములందు వ్యాపించిన విషయము హృదయంగమమైన యొకగొప్ప చరిత్రాంశము. ఈనాగరకత సుమత్ర, జావా, బోర్నియో, బాలిద్వీపములందు వ్యాపించినది. నేటికి నిది బాలిద్వీపమునందు క్షీణదశయందున్నది. అయితే యిది ముఖ్యముగా జావాద్వీపమునమాత్రమే హిందూసంస్కృతి ప్రాబల్యమునకు లోనైనది. జావాద్వీపవాసులు క్రీస్తుశకము పదునైదవ శతాబ్దిని మహమ్మదీయమతము నవలంబించిరి. మహమ్మదీయప్రభుత్వమున నాలుగువందల సంవత్సరములు గడచినను ఈదీవియందు పూర్వము హిందూమతము వ్యాపించి యుండె ననుట కిప్పటికి నిదర్శనములు కలవు.

మొట్టమొదటిది భాషావిషయకమైన నిదర్శనము. ఇంగ్లీషుభాషయందు లాటిను పదములెట్లు ఎక్కువగ నుండునో అట్లే జావా, మలయా, భాషలయందు సంస్కృతపదములెక్కువగ నుండును. వీనియుచ్చారణయందుం గూడ కొంత మార్పుగలదు. సామాన్యముగా మలయాభాషలో పదము సంకలి యుపధనూది పలుకుట వాడుక. సంస్కృతపదములకు నీపద్ధతి వర్తించును. అర్జున యనుపదమును జావావా రుచ్చరించినచో స్వరము 'ర్జు'మీద నుండును. వారియుచ్చారణలో ఒత్తు హల్లులలోని ఒత్తులోపించిపోయినది. పదముల మొదటి యర్థముకూడ కొంత మార్పు చెందినది.

ముఖ్యముగ జావాయందలి సంస్థానాధిపతులును, కులీనులును, అధికారులును ధరించునట్టిపేర్లు, బిరుదములు సంస్కృతపదాంచితములుగ నుండును. మధ్యజావాయందలి సంస్థానాధిపతులు రాజ, ప్రబు (సం-ప్రభు), అదిపతి (సం-అధిపతి), అరియ (సం-ఆర్య) పదాంచితులు. వంశక్రమముగవచ్చు రాజ్యము నేలువారిని బూపతు (సం-భూపతు) లందురు. క్రింది యధికారులలో మంత్రి, పతి, ద్యతు (సం-అధ్యక్ష) వెదానో (సం-వదన) మొదలగు పేర్లు గానగును. జావాదేశప్రముఖులు తమ గృహములకువచ్చిన యతిథి యభ్యాగతులను తమ యింటిముందుండు స్తంభములు గల యొకశాలయందు సంభావింతురు. ఈ శాలకు "పెండప" (సం-మండప) మనిపేరు. ఇక వ్యక్తినామములను గురించి యాలోచించినచో అరబ్బీపేరులతోపాటు సూర్యపుత్ర, సూర్యవినత మొదలగుసంస్కృతపు పేరులును కానవచ్చును. ఇట్టిపదములను రచించుటకు జావాకులీనులకు అభిమాన మెక్కుడుగ గన్పట్టును. పూర్వముదాహరింపబడిన పదములు సంస్కృతమునుండియే గ్రహింపబడినను మొత్తముమీద నివి ప్రస్తుతకాలమున హిందూదేశమున వాడు

కలో నుండు పేళ్ల వంటివికావు. ఇట్టి పదములు అచట వాడుకలోనికివచ్చుటకు హిందూప్రాబల్యమే కారణమయినను ఇప్పటిరూపమునుబట్టి చూడ నవి చిరకాలముగ జరుగుచున్న స్వతంత్రపరిణామమునకు ఫలము లని చెప్ప దగును.

జావాచరిత్రమునందలి యత్యంతప్రశస్త యుగమునకు జ్ఞాపకచిహ్నముగ వెలయు స్థల నామములును పెక్కులు గలవు. ఈ దీవి యందలిమిక్కిలియెత్తయిన పర్వతశిఖరమునకు "సెమెరు" అనియు, "స్మేరు" అనియు పేర్లు కలవు. ఇది మన హిందూపురాణ గాథలందలి "సుమేరు" పదరూపాంతరమే. మధ్యజావా యందలి ముఖ్య నదిపేరు "సెరయు." ఇది "ప్రహు" పర్వతపుదక్షిణపార్శ్వమున బుట్టుచున్నది. సెరయు అనుమాట శ్రీరాముని రాజధానియయిన అయోధ్యకు సంబంధించిన "గోగ్రా"నదియొక్క ప్రాచీననామ మగు సరయురూపాంతరము. జావాద్వీపమున మిక్కిలి తూర్పుగ నున్న మండలమునకు బేసుకి యని పేరు. ఇది జావావారిచే నుచ్చరింపబడు హైందవ"వాసుకి" (నాగరాజు)పదముయొక్క రూపాంతరమే. నాగరాజ ప్రతిష్ఠగల యాలయమునుండి యది గ్రహింప బడిన దని మన మూహింపవచ్చును.

పురాతనజావాభాషకు "బసకవి"(కావ్య భాష) యని పేరు. ఇది బస, కవి యను రెండు సంస్కృతనామములచే నంకితమైనది. ఈకారణముననే జావావారు కవి యను పదమును వేదపదమునకు పర్యాయపదముగా వాడుచున్నారు.

ఈకవిభాషలో నెట్టిగ్రంథము లున్నను వానికి హిందూగ్రంథములేమూలాధారములు. పంచపాండవులను, రామునిని ఇచటివా రెట్లు అవతారపురుషులుగ భావించెదరో అచటివారు కూడ నట్లే యవతారపురుషులుగనే విశ్వసించెదరు. జావాదేశీయు లీ పురాణకథలను తమ సొంతపువే యని విశ్వసించెదరు. ఇవి విదేశీయములను స్మృతియే పూర్తిగాలేకుండ జేసినంత గాఢమైనది యావిశ్వాసము; ఎందువల్లననగా, జావాద్వీపవాసులలో చాలమందికి శ్రీరాములవారును పాండవులును తమ దేశమందే జన్మించి, యచటనే పెరిగిన తమ జాతీయవీరు లనియే యభిప్రాయము.

జావాయందలి యన్ని తరగతులవారిలోను ఈకథల కిప్పటికి నింతటి జనానురాగ ముండుటకు గారణము పూర్వపుజావా దేశపు కావ్యములలో నివి కీర్తింపబడియుండుట కాదు. జనసామాన్యమున వాడుకయందుండిన వేడుకలు, వినోదములు "వయాంగ్" అను బొమ్మలాటలవలన నవి యంతటి జనరంజకత్వమును సంపాదించినవి. ఈ"వయాంగ్" అనునాటకము జావాలో నెంత ప్రజారంజక మయినదో తెలిసికొనుటకు, అది సాయంకాల మూడుగంటల కారంభమయి మఱునాడుదయ మూడుగంటల వఱకు పన్నెండు గంటలకాలము సాగునని

చెప్పినచాలును. ఈయాటలలో రామకృష్ణా ర్జునులు బొమ్మలమాపిరి విచిత్రవేషములతో గానవచ్చెదరు. ఎంతవిలక్షణముగగాన్పించినను ఆవేషములు కళాకౌశలప్రపూర్ణములై హిందూ కళాసంభవములే యని చెప్పక చెప్పుచుండును. జావాద్వీపవాసుల జీవితమునందలి పెక్కుఅవ స్థల గాననగు హిందూసంప్రదాయప్రాబ ల్యము ఆద్వీపమునందు ముమ్మరముగ నున్న అత్యంతరమణీయములైన వాస్తుశిల్ప నిర్మాణ ములందు చక్కగ బొడగాంచ నగును. హిం దూయుగమునాటి యట్టి పురాతననిర్మాణ ములు శతాబ్దములతరబడి వచ్చుచున్న యశ్రద్ధ మూలమునను నిర్లక్ష్యభావము మూలమునను శిథిలములై కడు జీర్ణావస్థయందుండుట విచార కరము. పందొమ్మిదవ శతాబ్ది ఆరంభమున నుండి మాత్రమే యీ జావా ద్వీపమునందలి హిందూనిర్మాణ శిథిలావశేషములు చూచు వారలదృష్టి నాకర్షించినవి. వీనియందలి పని తనమునకు ప్రజలిప్పు డాశ్చర్య పడుచున్నారు.

బ్రిటిష్‌పరిపాలనముక్రింద నుండిన కొలది కాలములో (క్రీ. శ. ౧౮౧౧-౧౬) జావారాజ ప్రతినిధి యయిన సర్ స్టాఫర్డు రాఫిల్సుగారు గొప్ప ప్రోత్సాహ మొసంగి పురాతత్త్వ చరిత్రపరిశోధనలను వృద్ధినొందించిరి.

కడపటిశతాబ్దియందు గొప్ప సంస్కృత పండితుడును, ప్రాచ్యభాషలందు ప్రామాణి కుడనిబిరు దందినవాడును, ఒలాందు దేశ స్థుడును నగు డాక్టర్ ఫ్రెడిక్ కెర్న్‌దొరగా రీశిథిలనిర్మాణావశేషముల యన్వేషణమున కును, పరిశోధనమునకును బూనుకొనిరి.

ఇచ్చట రాళ్లతోను, ఇటుకలతోను కట్ట బడియున్న అసంఖ్యాకము లగు దేవాలయ ములు కడు జీర్ణావస్థయం దున్నను ఇంకను ప్రశంసాపాత్రములుగ నున్నవి. ఇవియన్నియు హిందూదేశమునుండివచ్చిన నాగరకత ప్రాబ ల్యమున వెలసినవే. ఇవి బ్రాహ్మణ, బౌద్ధమత ములకు సంబంధించినవి. పాడుపడిన యీ దేవా లయములలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల యొక్కయు, విఘ్నేశ్వరునియొక్కయు, రాక్షస సంహారిణియైన దుర్గయొక్కయు శిలావిగ్రహ ములు కానవచ్చుచున్నవి. ఈ యాలయము లన్నిటిలో శివాలయములే ఎక్కువగనుండుట వలన శివుడే నాటివారికి ముఖ్యదైవతముగ నుండెనని భావింపనగును ఇందువలన నాడు జావాయందు వ్యాపించియుండినమతము శైవ మనుట నిశ్చయము. కాలక్రమమున శైవ మతము బౌద్ధమతమున లీన మైపోయెను.

మధ్యజావా దేశమునందలి క్రీ. శ. ౭౦౦ లు మొదలు ౯౦౦ ల వఱకుగల నడిమికాల ము నాటి బ్రాహ్మణమతనిర్మాణములను గుఱించి యించుక విచారింతము. ఈ రెండు శతాబ్దములందే మిక్కిలి యందములైన గొప్ప కట్టడములు లేచినవి. ఇదియే హిందూజావా నీయవాస్తుశిల్పకళ అత్యుచ్ఛదశ నొందిన కాలము

ఈ రెండుశతాబ్దముల కాలము హిందూ జావానీయకళకు స్వర్ణయుగము. ఇంతకు 300 సంవత్సరములకు పూర్వమే ఇచట హిందూ నాగరకత ప్రారంభమయి యుండి యుండును. ఈప్రారంభ కాలమున హిందూ దేశమునకును జావాకును గలసంబంధమును దెలిసికొనుటకు శాసనములును, చీనాయాత్రికుల చరిత్రములును తప్ప ఇతరాధారము లేవియు లేవు.

ఈ యాత్రికులలో ప్రథముడు ఫాహియాన్. ఇతడు క్రీ. శ. ౪౧౪ సంవత్సరమున లంకాద్వీపమునుండి స్వదేశమునకు బోవుచు, మార్గమధ్యమున తుపానువచ్చి యొక ప్రదేశమునకు జేరుకొనెను. ఆప్రదేశము నతడు యె-పో-టి యని పేర్కొనెను. ఇది బహుశః సుమత్రజావా ద్వీపములలో నొకటిగా నుండవలయును. ఇచ్చట బ్రాహ్మణులు ఇతర మతావలంబకులు కలరు కాని వారికి బౌద్ధధర్మమంతగా తెలియదనికూడ చెప్పి యున్నాడు.

ఇతడు చెప్పినదాని ననుసరించి చూడ నీ దీవులలో క్రీ. శ. ౪౦౦ సంవత్సరప్రాంతమున హిందూనాగరకత పాదుకొనెననియు, ఇది ముఖ్యముగ బ్రాహ్మణమతమునకే సంబంధించినదనియు తెలియుచున్నది. ఈ చీనా యాత్రికుడు చెప్పినసంగతులు సత్యములని యచ్చటిశాసనములు ఋజువు చేయుచున్నవి. ఈదీవియందలి పశ్చిమభాగమున నిప్పుడు జావాకు రాజధానియైన బటేవియాకు సమీపమున నుండు నాలుగుశాసనములే జావాయందు గానవచ్చు శాసనములన్నిటిలో మొట్టమొదటివి. అవి "పూర్ణవర్మ" యను పేరుగల రాజుకు సంబంధించినవి. ఈ రాజు, తారూమ నగరమునకు తాను అధిపతి యని చెప్పుకొనుచున్నాడు. ఈ శాసనములందు అవి యెప్పటివో తెలిసికొనుటకు వానికాలము తెలుపబడియుండలేదు. కాని యాశాసనముల లిపులనుబట్టి యవి క్రీ. శ. నైదవశతాబ్ది నడిమి కాలములోనివని యూహింపవచ్చును.

వీటిలో నొకటి "చిరూరుతర్ణ" వాగు కడ నున్న గొప్ప బండమీద పెద్దయక్షరములతో జెక్కబడి యున్నది. ఇందు నాలుగు పంక్తులు కలవు. వీనిమీద నొక పాదయుగ్మమును లోతుగ జెక్కియున్నారు. ఈ నాలుగు పంక్తులలో నీక్రిందిశ్లోకము గలదు.

"విక్రాంతస్యావనిపతేః
శ్రీమతః పూర్ణవర్మణః,
తారూమనగరేంద్రస్య
విష్ణోరివపదద్వయమ్."

ఇందు, రాజును విష్ణువుతో బోల్చుటను బట్టి యితడు వైష్ణవుడనియు, విష్ణ్వారాధకుడనియు కొందఱు నిష్కర్ష జేసియున్నారు. ఇది నిజమైనను కాకపోయినను అతడవలంబించినది బ్రాహ్మణమతమని మాత్రము నిశ్చయముగ జెప్పవచ్చును. ఇతనిశాసనములునుశుద్ధమగు సంస్కృతభాషను గలవు.

జావాయందలి యాయాదిమ శాసనములలోని లిపి సరిగా దక్షిణ హిందూదేశపు

లిపియే. తూర్పు సముద్రతీరమున రమారమి మైదుశతాబ్దులవఱకు, (అనగా క్రీ. శ. 300 మొదలు ౮00 వఱకు) పరిపాలనము నెఱపి, తమ పరిపాలనమునకు శాశ్వతస్మృతిచిహ్నములుగ నుండునట్లు అద్భుతములైన "సప్తరథము" లనబడు నాలయములను నిర్మించిన పల్లవవంశమువారు తమశాసనములందువాడిన గ్రంథలిపికి అదియభిన్నమైనది. అనగా రెండు నొక్కటే. ఈకారణముననే దక్షిణ హిందూదేశముననుండి అందుముఖ్యముగ చోళమండల తీరముననుండి యీద్వీపమునకు వచ్చినవారలే తమ బ్రాహ్మణమతమును, తమ పవిత్రభాషను ఈదీవుల బ్రవేశపెట్టి రనుటకు అవకాశము కలదు. ఈయూహ మఱి యితర ప్రమాణములను బట్టికూడ స్థిరమగుచున్నది.

పూర్ణవర్మ శాసనములందు శాసనకాలము తెలుపఁబడి యుండలేదు. కాని జావాయందు గానవగు తరువాతికాలపు శాసనములందు శాసనకాలము శకవర్షములలో దెలుపబడినది. క్రీ. శ. ౭౮ నుండి యారంభమగు నీపరిగణన పద్ధతి ముఖ్యముగ దక్షిణహిందూదేశమున వాడుకయం దుండినది. ఉత్తర హిందూస్థానమున వాడుకయం దుండిన విక్రమశకమును గుఱించి మలేద్వీపకల్పమునందలివా రెఱిగి యుండినట్లు కానబడదు.

జావాయందు గలశాసనములలో శాసనకాలము తెలుపబడిన మొదటి రెండుశాసనములు "చాంగల్, దినయు"ల యందు గలవు. మొదటిమాండు డాక్టర్ కెర్నగారిచే ప్రకటితమైన చాంగల్ శిలాశాసనము సంస్కృతమున శ్లోకరూపమున గలదు. సంజయుడను నతడు చేసిన లింగప్రతిష్ఠాపనమును గూర్చి యిది తెల్పుచున్నది. ఈ సంజయుడు మధ్యజావాయందు స్థిరపడినవాడు కావచ్చును. ఇతనిపూర్వీకులు దక్షిణహిందూదేశమునందలి "కుంజరకుంజము" అనుచోట నుండినవారు. ఈశాసనము శకవర్షము ౬౫౪ అనగా క్రీ.శ. ౭౩౨ నాటిది.

దినయుశాసనకాలము శకవర్షము ౬౮౨ అనగా క్రీ. శ. ౭౬౦. ఇది మహర్షియైన అగస్త్యని విగ్రహమును సంస్థాపించుటను గూర్చి తెల్పును. అగస్త్యుడే వింధ్యనుదాటి బ్రాహ్మణ నాగరికతను దక్కనుదేశమునకు గొనివచ్చెనని ప్రతీతి. ఆకాశమున దక్షిణపువైపున అగస్త్య నక్షత్రమని యొక నక్షత్రమును జూపుదురు. అగస్త్యోదయమున సముద్రములు తుపానులు లేక ప్రశాంతములుగనుండును. ఈకారణమున గావచ్చును సముద్రపుప్రయాణములను జేయు దక్షిణ హిందూదేశీయులకు అగస్త్యు డన్న నత్యంతభక్తిప్రపత్తు లుండుట. బహుశః వీరి ద్వారానే కావచ్చును, అగస్త్యారాధన ఈ జావాద్వీపమునకు జేరి యుండడము.

చాంగల్ శాసనములలో పేర్కొనబడిన దేవాలయ మిప్పుడు కానరాదు.

---

## శీఘ్ర గమనము యొక్క ఉద్దేశము ?


తనప్రాణము పోవుననక —


ఇతర ప్రాణులకు ప్రమాదమనక —


ధనము వ్యయమనక —


ఎండ , వర్షము అనక —


మనోవేగముగ ప్రయాణము చేయుట —


ఇందుకా ?

వలిశెట్టి
రామారావు

# నిమ్నప్రపంచము, శ్వేతజాతులు

టేకుమళ్ల రామచంద్రరావుగారు, M.A.,B.L.

ఏనాడు శ్వేతజాతులు తమతమ దేశములను వీడి ఇతర దేశముల యాక్రమణమునకు దలకొనెనో ఆనాడే ప్రపంచమున కరుణయు, న్యాయమును నంతరించినవి. స్వలాభప్రేరితులై నిష్కరుణులై శ్వేతముఖులు లేనాడు ప్రపంచరంగమున ప్రాముఖ్యము గాంచ నుపక్రమించిరో ఆనాడే ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలేషియా వాసులకు శిథిలావస్థయు బానిసత్వమును సంప్రాప్తములైనవి. శ్వేతజాతుల విజృంభణారంభానంతరము నాలుగు వందల సంవత్సరములు గడచి చనినవి. ఈనాలుగు వందల సంవత్సరములలో న్యూఫౌండ్‌లాండ్ నందలి పూర్వవాసులు మచ్చునకైన నొక్కడును లేక యంతరించిరి. టాస్మేనియావాసులు లెక్కకొక్కడైనను నుండక కాలగతిజెందిరి. ఆస్ట్రేలియా యందలి యాదిమవాసు లేకొలదిమందియో మిగిలియున్నారు. కనడా, యునైటెడ్ స్టేట్స్ మున్నగు దేశములందలి యాదిమవాసులగు రక్తాంగులు ఒక పల్లూడిన యావు మేయగా నమిలి మిగిలెడు గడ్డిమొక్కలవలె నచ్చటచ్చట నామమాత్రావశిష్టులై యధోగతికి, శిథిలత్వమునకు దారితీయుచున్నారు. ఆఫ్రికానుండి బానిసలై పోయినవారు పోగా మిగిలినవారు తమదేశమున తామే హైన్యస్థితిలో పడి కుములుటకంటె కనాకష్టమగు జీవితమును, బానిసత్వమునకంటె శృంఖలాన్వితమగు జీవితమును గడపుచున్నారు. "తోడేలా తోడేలా గొర్రెలను కాస్తావా? అంటే జీతం బత్తెం లేకుండా కాస్తాను" అన్నదట. వీరిబాగోగులు శ్వేతముఖుల చేతిలో నున్నంత కాలము పాలకుల శ్రేయోభివృద్ధికే సూత్రముగనుండును గాని పాలితుల సుఖసంపదలు శ్రేయోభివృద్ధులు తపించి తపించి కొట్టుకొనవలసినదేయనుట తేటతెల్లమైనది. ఈ నిమ్నప్రపంచ మిట్టినీచస్థితిలో నుండుటవలన ఇంతకంటె నించుక మెరుగుగనున్న భారతాది దేశముల ప్రజలు గూడ శ్వేతముఖులకు జోహారులు చేయుచు వారు విదిపిన మెతుకులు విదిపినవాడు స్వీకరించుకొనుట యగుచున్నది. ఎప్పుడీనిమ్నప్రపంచము శ్వేతముఖుల స్వలాభోపకరణమాత్రమై యుండుటను విరమించునో అప్పుడే భారతీయాదిప్రజల కానిమ్నజాతుల దేశములందు ప్రతిపత్తియు నాదరణమును గలుగును. కానినాడు నేటి దక్షిణాఫ్రికా మొదలగు దేశములందలి భారతీయు లెట్లుగ చాటులకు లోనై కుమిలిపోవుచున్నారో, అట్లే ముందును దిక్కుమాలియుండవలసివచ్చును. కావున నిమ్నప్రపంచోద్ధరణము విశ్వప్రపంచమునకు న్యాయమొనర్చుట యగుటయేగాక శ్వేతముఖుల యసమాన కారణమున నన్యాయముపాలైన యితరప్రజలకును నత్యావసరమగు ముఖ్యసమస్య యగుచున్నది. ఈసమస్యాపరిష్కారమార్గాన్వేషణమునకు పూర్వము నిమ్నప్రపంచపు ప్రస్తుతస్థితి యెట్లున్నదో చూచుట యవసరము. రోగ మెట్టిదో యాకళింపైన పిమ్మటగదా మందువేయుట? కావున చదువరుల భావము నా భావముతో నిమ్నప్రపంచమున కిప్పుడు ప్రయాణమగుగాక.

## నిమ్నప్రపంచ మనగా నేమి?

ప్రపంచమునందలి దేశములను రాజకీయముగ మనము మూడురకములుగ నిలుపవచ్చును. తమదేశమున తామే యధికారము చెలాయించుకొనుచు నుండు దేశములు మొదటిరకము. ఇట్టివి బ్రిటన్ మున్నగు యూరోపియన్ దేశములు, రష్యాదేశపు రిపబ్లిక్కులు అంగోరా, చీనా, జపాన్, పర్షియా, ఆఫ్ఘనిస్థాన్, సయాం, ఆస్ట్రేలియా (శ్వేత) న్యూజీలాండు, దక్షిణాఫ్రికా (శ్వేత), కనడా, యునైటెడ్ స్టేట్స్, మెక్సికో, సెంట్ర

ర్ అమెరికా, అబిసీనియా, కొన్ని దక్షిణఅమెరికా దేశములు. రెండవరకపు దేశములలో తరుంతబ తాముగా ప్రజలు స్వీయపరిపాలన లేక పరపాలనాధికారములకు కొంతలోనయ్యు తమహక్కులను గుర్తించి స్వపరిపాలన కొఱకు పోరాడు దేశములు గలవు. ఇట్టివి ఇండియా, సిరియా, ఇరాక్, కొరియా, పలస్తీనా, ఈజిప్టు, సుడాన్‌లోని యుత్తరభాగము మొదలగు కొన్ని దేశములు. ఫ్రెంచ్ - ఇండోచీనాకూడా ఈరకములోనే కలుపవచ్చును. ఇక మూడవరకపు దేశము లనగా, పరాధికారమునకు పూర్తిగలోనై ఏతదధికారమువలన తమకు మూడిన విపత్తును తెలిసికొనియు తెలిసికొనక తనుదేశము నితరు లిచ్ఛానుసారముగ ననుభవించి తమనెంతో హీయముగ జూచినను సగముచచ్చిపడియుండు ప్రజాసందోహముగల దేశములు. ఈదేశములందు కొన్నియెడల నాదిమవాసుల సంపూర్ణనాశనమును, కొన్నియెడల వారి శిథిలావస్థయు, కొన్నియెడల వారి బంధితావస్థయు గలుగుచున్నది. ఇట్టివి ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలేషియా లనబడు ఖండములందు కొన్నిభాగములలో గనబడుచున్నవి ఈమూడవరకపు దేశముల నన్నిటిని గలిపి నేను నిమ్నప్రపంచమని పేర్కొంటిని.

## ఆఫ్రికా

ఇక ఈనిమ్నప్రపంచమునందలి మూడు ముఖ్యభాగముల నొకటివెనుక నొకటిగా తీసికొని పరిశీలింతము: ఇందు మొదటిభాగము ఆఫ్రికాఖండంలి విశేషభాగము. ఇందు దక్షిణాఫ్రికా నైరుతిఆఫ్రికా, మొజాంబిక్, అంగోలా, తూర్పుఆఫ్రికా, దక్షిణసుడాన్, కాంగో, మధ్యాఫ్రికా, మెడగాస్కర్, నైగీరియా, లైబీరియా, సియెర్రాలియోన్, గినీ, సెనిగల్, గాంబియా అను దేశములు గలవు. ఇవన్నియు శ్వేతజాతులవారి యాధికారమునకు లోనైయున్నవి. ఈదేశములందలి జనసంఖ్య యీక్రిందివిధముగ నున్నది:

(1) దక్షిణాఫ్రికా

| రాష్ట్రము | విస్తీర్ణము (మైళ్లు) | జనసంఖ్య | శ్వేతముఖులు | ఆదిమవాసులు | తెల్లవారెన్నవ వంతు? |
|---|---|---|---|---|---|
| కేప్ కాలని | 2,76,000 | 27,82,712 | 6,51,866 | 21,30,846 | 2:7 |
| నెటాల్ | 35,284 | 14,27,706 | 1,37,695 | 12,90 011 | 1:12 |
| ఆరంజ్ ఫ్రీస్టేట్ | | 6,28,802 | 1,89,208 | 4,39,594 | 3:7 |
| బసూటోల్యాండ్ | | 4 98,781 | [illegible],603 | 4,97,178 | 3:1000 |
| స్వాజీల్యాండ్ | 6,678 | 1,12,951 | 2,205 | 1,10,295 | 1:55 |
| ట్రాన్స్వాల్ | 1,10,450 | 20,87,772 | 5,43,673 | 15,44,099 | 1:3 |
| బెచూనాల్యాండ్ | 2,75,000 | 1,54 726 | 1,743 | 1,52,983 | 1:80 |
| దక్షిణరోడేసియా | 1,49 000 | 8,82,420 | 33,620 | 8,48,840 | 1:26 |
| **(2) నైరృతి ఆఫ్రికా** | | | | | |
| నైరృతి ఆఫ్రికా | 3,22,000 | 2,27,739 | 19,432 | 1,77,462 | 1:9 |
| **(3) న్యాసాలాండ్** | | | | | |
| న్యాసాల్యాండ్ | | 12,00,000 | ... | ... | 0:౦ |
| **(4) తూర్పు ఆఫ్రికా** | | | | | |
| కెన్యా (మహమ్మదీయులు) | | 25,00,000 | ... | ... | 0:౦ |
| టంగనైక | | 41,00,000 | ... | ... | 0:౦ |
| యుగాండా (క్రైస్తవులు) | | 31 25,000 | ... | ... | 0:౦ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| **(5) దక్షిణ సుడాను** | | | | | |
| దక్షిణ సుడాను | 25,50,000 | 20,00,000 | ... | ... | 0:4 |
| **(6) పశ్చిమాఫ్రికా** | | | | | |
| గాంబియా | 4,100 | 2,10,530 | ... | ... | 0.ల |
| సియెర్రా లియోను | 29,000 | 15,41,311 | ... | ... | 0:ల |
| నైజీరియా | 3,67,200 | 1,75,90,651 | ... | ... | 0:ల |
| గోల్డ్ కోస్టు (ఘనా) | 91,690 | 22,98,383 | ... | ... | 0:ల |

పై పట్టికలోని చివరి 'కాలము' నందు '0:ల' వేసిన చోట్ల శ్వేతముఖు లత్యల్పసంఖ్యాకులని యెఱుంగవలెను.

(7) మొజాంబిక్, (8) ఫ్రెంచ్ మధ్యాఫ్రికా, (9) బెల్జియన్ కాంగో, (10) అంగోలా, (11) మెడగాస్కర్ ఈ దేశములపట్టికలు లభించలేదు. కాని, మధ్యాఫ్రికా, కాంగోలయందు శ్వేతముఖు లత్యల్పసంఖ్యాకులనియు మిక్కిన దేశములందు కొంతవఱకు తక్కువ సంఖ్యాకులనియు తెలియవలెను.

## ఉత్తరఅమెరికా—I ఉత్తరభాగము

అమెరికాఖండమునుండి దక్షిణ అమెరికాను సెంట్రల్ అమెరికాను, మెక్సికోను, వెస్టుఇండీస్ మున్నగు ద్వీపములను మినహాయించగా మిగిలిన ఉత్తరఅమెరికాయందలి యుత్తరభాగ మేర్పడుచున్నది. ఈ భాగమున అలాస్కా, కనడా, యునైటెడ్ స్టేట్స్, న్యూఫౌండ్ ల్యాండు మున్నగు దేశములు గలవు. ఆసియావాయువ్యోత్తరాసియానుండి అనాదికాలమున జపాన్, చీనా, జాతులకు సంబంధించిన 'రెడ్ ఇండియన్లు' అను నొకజాతి వారు అమెరికాయందాదిమనివాసము నేర్పరుచుకొని క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతములవరకు సుఖముగ కాలము బుచ్చుచుండిరి. క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతములలో నేతెంచిన శ్వేతముఖులు వీరి ననేకవిధముల నాశనము గావించుటచే నేటికి వీరు ఉత్తరఅమెరికాయందలి యుత్తరభాగమున నామమాత్రావశేషముగ నిలిచియుండుట ప్రతిచరిత్రకారునకును జాలి గలిగించును. శ్వేతముఖులు అమెరికా తమయబ్బసొమ్మైనట్లు దేశాక్రమణము గావించియున్నారు. ఈ రెడ్ యిండియన్ల సంఖ్య శ్వేతముఖుల లెక్కలప్రకారము ఈ క్రిందివిధముగ నున్నది:

| | | |
|---|---|---|
| క్రీ. శ. 1700 సం॥ | 11,40,000 | యావత్తు అమెరికా |
| ఇప్పుడు | 8,60,000 | ఖండములోను. |

కనడాలోనిప్పుడు 1,05,000.

ఎందునకును బోందని యేదో కొంత భూభాగము రెడ్ ఇండియన్లకు మిగలబెట్టి సస్యసమృద్ధమును సౌభాగ్యసంపులమును నగు దేశమును శ్వేతజాతులే యాక్రమించుకొన్నవి. తక్కిన యన్ని దేశములలోను జనసంఖ్య ప్రతిపదిసంవత్సరములకు నత్యధికముగ పెరుగుచుండగా శ్వేతజాతుల రక్షణలో నున్న యీ రెడ్ యిండియన్ల సంఖ్యమాత్రము క్రీ. శ. 1700 సంవత్సరమునకును నేటికిని సంక్షిప్తమము నేలజూపునన్నదని పాఠకులు ప్రశ్నించుకొందురేని శ్వేతజాతులు వీరికి మేలుచేయుచున్నారో కీడు గావించుచున్నారో తెలిసికొనుట సులభమే గదా?

రెడ్ ఇండియన్ల స్థితి యిట్లుండ న్యూఫౌండ్ ల్యాండ్ లాబ్రడార్ ప్రాంతపు టాదిమవాసు లేనాడో నశించిపోయిరి. ఎస్కిమోజాతులవారు ఉత్తర(ఆర్కిటిక్)సముద్రప్రాంతములలో నెట్లో జీవించుచున్నారు.

## ఉత్తరఅమెరికా—II ద్వీపములు

ఈ ద్వీపములందు కరీబులను వారాదిమవాసులు కాని యీద్వీపములలో నిప్పుడు వీ రంతరించిపోయిరి. ఆఫ్రికానుండి బానిసత్వమునకై తెచ్చిన నీగ్రోలు ఈ ద్వీపములలో మిక్కుటముగ నున్నారు. సంఖ్యలో

నీద్వీపములలోని వివిధజాతుల పరస్పరాధిక్యము యీ క్రింద పొందుపరచిన పట్టికనుండి తెలిసికొననగును.

| | | |
|---|---|---|
| (1) | జమైకా:— | |
| | నీగ్రోలు— | 6,60,420 |
| | భారతీయులు | 22,999 |
| | యూరోపియన్లు | 3,700 |
| | ఇతరులు | 1,57,223 |
| | మొత్తము | 8,57,118 |
| (2) | ట్రినిడాడ్. | |
| | నీగ్రోలు | 2,00,000 |
| | భారతీయులు | 1,21,000 |
| | ఇతరులు | 21,523 |
| | మొత్తము | 3,42,523 |
| (3) | టొబాగో | |
| (4) | బార్బడాస్ | 156,000 |
| (5) | గ్రెనెడా | 59,964 |
| (6) | సెంట్ విన్సెంట | 50,000 |
| (7) | సెంట్ లూసియా | 50,000 |
| (8) | ఆంటిక్వ | 28,864 |
| (9) | డామినికా | 37,000 |
| (10) | సెంట్ కిట్స్ | 22,400 |
| (11) | సెంట్ నెవిస్ | 11,500 |
| (12) | మాంట్ సెర్రాట్ | 12,000 |
| (13) | వర్జిన్ ద్వీపము | 5,100 |
| (14) | బహామా ద్వీపము | 53,000 |
| (15) | బెర్ముడాస్ | |
| | నీగ్రోలు | 13,000 |
| | యూరోపియన్లు | 6,500 |
| | ఇతరులు | 500 |
| | మొత్తము | 20,000 |
| (16) | హాండూరాస్ | |
| | రెడ్ ఇండియన్లు | 38,000 |
| | కరీబులు | 6,000 |
| | ఇతరులు | 1,000 |
| | మొత్తము | 45,000 |

ఈ ద్వీపములలో నధిక సంఖ్యాకులు నీగ్రోలు. వారి తరువాత కొన్ని ద్వీపములందు భారతీయులును, కొన్నిట రెడ్ ఇణ్డియన్లును, కొన్నిట యూరోపియన్లును నధిక సంఖ్యాకు లగుచున్నారు. వీరెల్లరును శ్వేతజాతుల యొత్తిడిక్రిందపడినలిగి, ఆర్థికరాజకీయదాస్య శృంఖలములచే గట్టువడి విమోచనహీనులై యున్నారు.

## ఉత్తరఅమెరికా- III దక్షిణభాగములు

ఉత్తరఅమెరికాయందలి దక్షిణభాగమున మెక్సికో సెంట్రల్ అమెరికాలు గలవు. యునైటెడ్ స్టేట్స్‌నందలి దక్షిణభాగమును నైరృతిభాగమును, నిందుగలుపుట సమంజసముగును. ఏలననగా: యునైటెడ్ స్టేట్స్ దక్షిణభాగమున నొకకోటికి పైగా నీగ్రోలు గలరు; నైరృతిభాగమున రెడ్ ఇణ్డియన్లు గలరు. వీ రన్నివిధముల నధోగతిపాలై యున్నారు.

మెక్సికోయనున నొక స్వతంత్రరాజ్యము. ఇందు నూటికి 20 మంది తెల్లవారు; 40 మంది సంకరులు; 40 మంది రెడ్ ఇణ్డియన్లు.

సెంట్రల్ అమెరికాలో నైదు ముఖ్యభాగములు గలవు. అందు హాండూరాస్‌లో నీగ్రోలును, సాల్వడార్‌నందు రెడ్ ఇణ్డియన్లు తెల్లవాండ్రును, గౌటిమాలాయందు నీగ్రోలు రెడ్ ఇణ్డియన్లును, నికరాగ్వా కోస్టారికాలయందు రెడ్ ఇణ్డియన్లును అధికసంఖ్యాకులు గలరు.

ఈ మెక్సికో సెంట్రల్ అమెరికాలును దక్షిణ అమెరికాలోని శ్వేతజాతులును నిమ్నప్రపంచములోనివి కావు.

## దక్షిణఅమెరికా

దక్షిణఅమెరికాలో బ్రిటిష్‌గ్వయానా అను నొక చిన్నభాగము గలదు. ఇది 90,000 చదురపుమైళ్లవిస్తీర్ణము గల దేశము. ఇందు 3,26,000 మందిజను లున్నారు. ఇందు నూటికి 39 గురు నీగ్రోలు; 40 మంది భారతీయులు; తక్కినవా రితరులు.

చీలి అర్జంటినా ఉరుగ్వే దేశములయందు యూరోపియ నధికసంఖ్యాకులుగను రెడ్ఇండియ నల్పసంఖ్యాకులుగను నున్నారు. ఇచ్చట రెడ్ఇండియన్లకు దక్షత లేదు. అంతయును యూరోపియన్ల యిచ్ఛానుసారమే జరుగుచున్నది. రెడ్ఇండియ నధమకార్య నిర్వాహకత్వమున బ్రవర్తించుచున్నారు.

వెనెజులా, కొలంబియా, ఈక్వెడార్, పెరూ బొలీవియా దేశములలో రెడ్ఇండియనులును సంకరులును అధికసంఖ్యాకులై యున్నారు. ఈదేశములలో కొన్నిట నొకొక్కప్పుడు రెడ్ఇండియన్లకు సుఖమును నితర సమయములందు గష్టమును గలుగుచున్నది. కాని యీ దేశములందు వారి పరిస్థితులు బాగుగనే యున్నవి. ఈదేశముల జనసంఖ్య సుమారు మూడుకోట్లు.

బ్రెజిల్ జనసంఖ్య 2 కోట్ల 50 లక్షలు. ఇచ్చట నీగ్రోలును సంకరులును హెచ్చుగ నున్నారు. కాని వీరికి రాజకీయార్థికవిషయములం దట్టి ప్రాధాన్యమును లేదు.

పరాగ్వేయందు తెల్లవారు రెడ్ఇండియన్లు నీగ్రోలు గలరు. ఇచ్చటగూడ శ్వేతేతరజాతులు ప్రబలియేయున్నారు.

మొత్తముమీద దక్షిణఅమెరికాయొక్క ఆర్థికస్థితి యంతయును యునైటెడ్‌స్టేట్స్‌దేశము తన యారచేత నుంచుకొని గిరగిర త్రిప్పుచున్నది. దక్షిణ అమెరికావాసులు త్రోవతెన్నులు కానక పరితపించుటలో నాశ్చర్యమేమున్నది?

## ఆస్ట్రేలేషియా

ఇందు ఆస్ట్రేలియా, న్యూజీల్యాండ్, ఫిజీ, ప్యాపువా, సాలమన్, న్యూహెబ్రెడీస్ మున్నగు పసిఫిక్ మహాసముద్రద్వీపములు, సుమత్రా, జావా, బోర్నియో, సెలిబస్ మున్నగు ద్వీపములు, ఫిలిప్పైన్లు, మలయాద్వీపకల్పము గలవు.

ఆస్ట్రేలియాకు దక్షిణమున గల టాస్మానియావాసులు క్రీ. శ. 1871 వ సంవత్సరమున పూర్తిగ నశించిపోయిరి. ఆస్ట్రేలియాయందలి ఆదిమవాసుల సంఖ్య యీక్రింది ప్రకారముగ నున్నది.

| రాష్ట్రము | ఆదిమవాసులసంఖ్య | |
|---|---|---|
| దక్షిణాస్ట్రేలియా | 8,001 | సుమారు |
| పశ్చిమాస్ట్రేలియా | 22,000 | ,, |
| ఉత్తరాస్ట్రేలియా | 5,000 | ,, |
| క్వీన్స్‌ల్యాండ్ | 17,000 | ,, |
| న్యూసౌత్ వేల్స్ | 0 | ,, |
| టాస్మేనియా | 0 | ,, |
| మొత్తము | 45,000 | ,, |

కాబట్టి ఆస్ట్రేలియా ఖండమంతయును గలిసి బ్రతికియున్న యాదిమవాసుల సంఖ్య యొకపట్టణమందలి జనసంఖ్యయంతయైనను లేకున్నమాటయే గదా? ఇక తక్కిన కొన్నిప్రదేశములు జనసంఖ్యను తీసికొందము.

(1) పాపువాలోనున్న ఆదిమవాసులసంఖ్య 2,35,000

(2) న్యూజిలాండ్‌లోనున్న ఆదిమవాసులసంఖ్య 52,571

(3) ఫిజీదీవులు, యితరప్రాంతములందుగల ఆదిమవాసులసంఖ్య } 84,475
(అచ్చటనున్నవారిలో భారతీయులు 60,684
యూరోపియన్లు 3,878; సంకరులు 2,781)

(4) సాలమన్‌దీవులలో నాదిమవాసులసంఖ్య 1,25,000

(5) న్యూహెబ్రిడీసులో నాదిమవాసులసంఖ్య 50,000

(6) ఫ్రెండ్లీదీవులలో నాదిమవాసులసంఖ్య 23,568

(7) మలయాద్వీపకల్పమున నాదిమవాసులసంఖ్య } 16,27,108
భారతీయులు 471,628; చీనావారు 11,74,354)

(8) సారవాక్ (బోర్నియో) ఆదిమవాసులసంఖ్య 400,000
(చీనావారు, 50,000; యూరోపియన్లు 2,000)

ఈ చివరి రెండు దేశములలో నాదిమవాసుల పరిస్థితులు తక్కిన నిమ్నప్రపంచమునకన్న నించుక మెరుగుగనున్నవి.

(9) బోర్నియోలో ఆదిమవాసులసంఖ్య 2,00,000
(చీనావారు 37,000; యూరోపియన్లు 450)

## ఆదిమవాసుల హైన్యదశకు కారణములు

పైవిషయముల నన్నిటిని మనము జాగ్రత్తగ నవలోకించి పరిశీలనదృష్టితో నాలోచింపుచో ననేకములగు ముఖ్యవిషయములు మనకు తెలియనగును. ఇట్టి విషయములలో మొదటిది ఆదిమవాసుల సంఖ్య నానాటికి తగ్గిపోవుచుండుట; శ్వేతజాతుల సంఖ్య అఖండముగ పెరిగిపోవుచుండుట రెండవది ఆదిమవాసుల నోటికాహారమును శ్వేతముఖులు పడగొట్టి వారికాహారము దక్కకుండ జేయుట; మూడవది, శ్వేతముఖులారోగ్యకరములగు ప్రదేశముల నన్నిటిని తామే ఆక్రమించుకొని వానిలో నాదిమవాసుల కేలాటి ప్రవేశమును గలుగనీయక అనారోగ్యములగు తావులను వారి నివాసములుగా చేయుట; నాలుగవది, నచ్చికమచ్చికలతో నయభయములతో ఆదిమవాసులకు శ్వేతముఖులు మత్తుపదార్థములను విక్రయించుట. ఐదవది, ఆర్థికముగ నాదిమవాసులను నిరాధారుల నొనర్చుట. ఆరవది, వారిని నిరాయుధులనుగ నొనర్చి వారికష్టములు హెచ్చిన క్రీగంటనైన గమనింపక నోరెత్తుటకు భయపడువారినిగ నొనరించుట.

ఈయన్నివిషయములందును ఆఫ్రికా, ఆస్ట్రేలేషియాలందలి యాదిమవాసుల పరిస్థితులొకరకముగను అమెరికాయందలి పరిస్థితులొకరకముగను నున్నందున ముందాఫ్రికాఆస్ట్రేలేషియాలను గూర్చి చర్చించి, పిమ్మట అమెరికానుగూర్చి యాలోచింతము.

### ఆఫ్రికా-ఆస్ట్రేలేషియా

పైనుదహరించిన యారుకారణములును ఆఫ్రికా ఆస్ట్రేలేషియాలయందు ప్రవర్తించుచున్నవి. దక్షిణాఫ్రికాయందలి బసూటోలాండ్ అనుచోట తెల్లనివారు భూములు కొనకూడదంటిమనియు, ఆస్ట్రేలేషియాయందలి పాపువాలో మద్యపానము నిషేధించి ఆదిమవాసుల కూలికి సౌకర్యము లొనర్చితిమనియు తెల్లవారు బడాయిగ చెప్పుకొనుచున్నారు. కాని ఆపాపువాలో వ్యవసాయమంతయు యూరోపియన్ల చేతిలో సంపూర్ణముగ నున్నదనియు బంగారుగనులు మొదలగు విలువగల గనులన్నియు తెల్లవారి హస్తగతములైయున్నవనియు మనకు తెలియుచున్నది. దక్షిణాఫ్రికాలోను తూర్పుఆఫ్రికాలోను ఆదిమవాసులను పెట్టుచున్న కష్టములు వారనర్హులని బహిష్కృతులను జేసిననిబంధనావళులు పాఠకలోకమునకు సువిదితములగుటచేత నిచ్చట నవి విస్తరించుట యనవసరము.

ఇట్టిపరిస్థితులనుండి నిమ్నప్రపంచమును లేవనెత్తుటకే మార్గము నవలంబించవలెనను సమస్య చిరకాలమునుండియు పైనుదాహృతములైన విషయముల నించుకదెలిసినవా రాలోచించుచున్నారు. పాశ్చాత్యులీనిమ్నప్రపంచమున నడుగిడుటలో మొట్టమొదటి యుద్దేశము జఠరాగ్నిచే క్రాగిపోవుచున్న తమ పొట్టలను నింపుకొనుట. ఇట్లు చేయుటలో నీతినియమములను భగవద్దత్తమగు కరుణను తమహృదయములనుండియు క్రియలనుండియు వారు పారద్రోలిరి. ఇట్లు పారద్రోలుటలో గలిగిన ఘోరములను కొన్నివందల సంవత్సరములకు భగవత్కృపాకటాక్షమున వారే గుర్తించిరి. నీగ్రోబానిసత్వమును బాపిరి. ఇట్లు చేయుటకమెరికావారు యుద్ధమునుగూడ గావించిరి. తరువాత సముంజసముగు పరివర్తనదృష్టితో నిమ్నప్రపంచాక్రమణసమస్యను కొంతవరకు పరిశీలించిరి. కాని యింతలో తమగొప్పతనము, తమబలము, తమ కాఠిన్యము—ఇవన్నియునొక పెద్ద రాతిగోడవలె వారిదృష్టి నవరోధించినవి. ఇట్లు కొంతవరకు మంచిదియు, కొంతవరకు చెడుదియు చేయుచు, కొంత భగవత్ప్రేరణచేయు కొంత తత్ప్రేరణను భగ్నమొనర్చుజంతుబుద్ధియు గలిగి మానవమును నమానవమును గాని యొకవిధమగు దశకు శ్వేతజాతులు గడంగినవి. ఈసందర్భమున నవతరించినదే 'ట్రస్టీషిప్' అను పదము.

'ట్రస్టీషిప్' అనగా ఆదిమవాసుల దేశము లాయావాసులకొఱకే యాక్రమించి పాలించుచున్నామని తెల్లవారు పలుకుట. తమకొఱకు వారిని ఇష్టమువచ్చినట్లు నెత్తురుచుక్కలు లేకుండ పీల్చుట తమయుద్దేశము గాదనియు ఆదిమవాసుల నుద్ధరించుటయే తమ యేకాశయమనియు శ్వేతముఖులు భేరికొట్టి చెప్పుదో

డంగిరి. కాని ఇట్టియుద్దేశమే పైన పాపువాలో శ్వేత పాలకులు గావించిన నిబంధనలకు కారణము. వీనినిబట్టి మనకు తెలియుచున్న యంశమేమనగా: 'కంచె ఎంత మంచికంచెయైనను చేను మేయకూడదని కంచె కూడాయెనే?' యని ప్రపంచము దుఃఖించుచున్నది. 'ఆదిమవాసుల కొఱకే' యని చెప్పుచు తెల్లని ప్రతినిధులు తామే యనుభవించుచో నిక ఆదిమవాసుల సంరక్షణ మెక్కడిది? 'ట్రస్టీషిప్' ఎక్కడిది? నాలుగురోజు లీవ్యాపారము లాకళింపుచేసుకొనుటతోడనే ఇదంతయు వట్టి నటన యనియు బూటకమనియు దేలినది.

ప్రస్తుతకర్తవ్య మిట్టిపరిస్థితులలో తేల్చుట కష్టము. కాని యొకముఖ్యసూత్రముమాత్రము మున్ముందు మనకు దృగ్గోచరమగుచున్నది. అదేమనగా: తెల్లవారు ఆఫ్రికాలో గాని ఆస్ట్రేలేషియాలో గాని ఆదిమవాసుల బాగుకొరకే యున్నామని గుర్తించుట. గుర్తించనిచో గుర్తించునట్లుచేయుట. ఈసందర్భమున నొకవిషయము మన మాకళింపుచేసికొనవలెను. న్యూజీలాండు, ఆస్ట్రేలియాలయందును దక్షిణాఫ్రికాలోని కొన్నిరాష్ట్రములందును శ్వేతముఖులు స్థిరనివాసమేర్పరచుకొన్నందున నట్టిప్రదేశములనుండి శ్వేతజాతులను లేచిపొమ్మనుట సరియైన పద్ధతి కాదు. కాని యిట్టిచోట్ల శ్వేతముఖులు ఆదిమవాసులయెడ నెట్టివిపరీతములను జేయరాదు. శ్వేతజాతులు అల్పసంఖ్యాకులగుచోట వారు ఎట్టి స్థిరాస్తిని కొనుటగాని, దానధర్మముగ పుచ్చుకొనుటగాని జరుగరాదు. అచ్చటి ఖనిజములనుగాని, అరణ్యములనుగాని, రాబడివచ్చు మరి దేనినిగాని శ్వేతముఖులంటగూడదు. ముప్పదిసంవత్సరములలో సంపూర్ణపరిపాలనాదక్షత యాదిమవాసులకు కలుగజేయుట కత్యావసరమగు వ్యయమును గావించుచు దానికి వలయు ధనమునే పన్నులవలన రాబట్టుచు, ఆదిమవాసుల ఆయురారోగ్యములకును భోగభాగ్యాభివృద్ధికిని తోడ్పడుటయే శ్వేతపాలకుల యాశయమై యుండవలెను. ఆస్ట్రేలియాయందు సగము భాగమును ఆస్ట్రేలేషియాయందలి ద్వీపములను సంపూర్ణముగ నాదిమవాసులకు ముడుపు కట్టిపెట్టవలెను. న్యూజీలాండులోని కొంతభాగమునుగూడ నచ్చటి యాదిమవాసులకు 'మవోరీ'లకుగా నిర్ణయించవలెను.

ఆస్ట్రేలియా న్యూజీలాండులం దిప్పుడు తెల్లవారనుభవించుభాగమున నాదిమవాసుల కన్ని సౌకర్యములును గావింపవలెను. శ్వేతజాతులవలె వారిసంఖ్యయు నభివృద్ధిగాంచుటయు నిరుద్యోగ నిరాహార సమస్యలచ్చటి యాదిమవాసులలో లేకుండ జేయుటయు విద్యయు, పరిపాలనసమానత్వమును వారికి గూడ నొసంగుటయు, నవసరమగుచున్నది. వారిసంఖ్య నుబట్టి దానికి సరిపోయినంతగాని అంతకంటె నెక్కువగాని ప్రాతినిధ్య మొసంగుటయు శ్వేతముఖుల ప్రథమ కర్తవ్యమై యుండవలెను. ఇట్లే దక్షిణాఫ్రికాయందలి కేప్ కాలనీ, నెటాల్, ఆరంజ్ ఫ్రీస్టేట్, ట్రాన్స్వాల్, నైరృతి ఆఫ్రికాలందును గావింపవలెను. ఈదేశములందు వెంటనే సర్వసమానత్వము రాజకీయపథమున నీయవలెను. ఇది వీలుపడకున్నచో శ్వేతేతరులకు దేశస్థులను, ఆదిమవాసుల సంఖ్యనుబట్టి ఎంతప్రాతినిధ్యము రావలెనో అంతయుందని ప్రతినిధులుగ నేర్పరచవలెను. ఇదియు వీలుగాకున్నచో నానాజాతిసమితివారికి పాలకులు చేయు ప్రతిజ్ఞాపత్రమును పంపి ముందుగ ననుమతి తీసికొనవలెను. నానాజాతిసమితివారు మూడుసంవత్సరముల కొక్కసారి కొందరు శ్వేతేతరులను బంపి పాలకు లెట్టిపద్ధతులను బూనుచున్నారో పాలితుల స్థితి యెట్టిదో తెలిసికొని అవసరమగుచో పాలకులను పదవినుండి తొలగించవలెను, ఖండింపవలెను, మందలింపవలెను. కానిచో తుదిగానిచోట తామే సూర్యచంద్రులుగా శ్వేతముఖు లెల్లు వెలుగవచ్చును? ఆహా! ఎవరిదో వారి నెట్లు నేలబెట్టి కాలరాయవచ్చును?

బసూటోలాండ్, స్వాజీలాండ్, రొడీసియా న్యాసాలాండ్, తూర్పుఆఫ్రికా, దక్షిణసుడాన్, పశ్చిమాఫ్రికా, మధ్యాఫ్రికా కాంగో మున్నగుప్రదేశములందును ఆస్ట్రేలియాలో సగమునందును ఆస్ట్రేలేషియా ద్వీపములందును మద్యనిషేధము ఆరోగ్యము ఆర్థికరాజకీయసముద్ధరణము విద్య న్యాయముదీర్చుట—ఇవిమాత్రమే శ్వేతపాలకుల కర్తవ్యములై యుండవలెను. నానా

జాతిసమితివారిచే నియమితము నొక శ్వేతేతర సంఘము సర్వకాలసర్వావస్థలయందును ఆయాదేశము శ్వేతపాలకుల పైనధికారియై మెలగుచుండవలెను. నానాజాతిసమితి వారు ఆయా దేశముల విదేశవర్తకమునందును శ్వేతోద్యోగులనియమమునందును యింకను నిట్టిసంసర్గములందును మిక్కుటముగు జాగ్రత్తను తీసికొనవలెను.

## అమెరికా

అమెరికాపరిస్థితులకును ఆఫ్రికా ఆస్ట్రేలేషియా పరిస్థితులకును చాల వ్యత్యాసము గలదు. కొన్ని సామ్యములును గలవు. కనడా యునైటెడ్ స్టేట్స్, అర్జెంటినా, చిలీ, ఉరుగ్వే మున్నగు దేశములగు శ్వేతముఖులసంఖ్య ఎక్కువగాయు, నాటివువాసుల సంఖ్య స్వల్పము నగుటచే ఆస్ట్రేలియా న్యూజీలాండు దేశములందు పైవిధాన్వ్రాతమైన మార్గమే యిచ్చటను అవసరము. కొన్ని ద్వీపములలోను యునైటెడ్ స్టేట్స్ దక్షిణభాగమునను తప్ప మిగిలిన అమెరికాయంతటను ఆదివాసులు సంకరులు నధికసంఖ్యాకులగు ప్రదేశమై యున్నది. నీగ్రో అధికసంఖ్యాకులగుచోట్లు వారు పరిపాలనశక్తి కలిగియే యున్నారు. ముఖ్యముగా అమెరికాఖండపు ఆదిమవాసులకు గావలసిన దేమనగా అన్నిటను శ్వేతముఖులతో సమానత్వము. ఆఫ్రికా ఆస్ట్రేలేషియాలందువలె అమెరికాలో జాగ్రత్తగా సంరక్షించుటయు, తనిఖీపద్ధతులును అంతగా నవసరములేవు. కాని కనడాయునైటెడ్ స్టేట్స్, అర్జెంటినా, చిలీ, ఉరుగ్వే దేశములయందు రెడ్ ఇండియనులకు, ప్రత్యేకసౌకర్యములును సంరక్షణము నవసరము. మిగిలిన అమెరికాలో రెడ్ ఇండియన్లు నీగ్రోలు మున్నగువారి కందరకును శ్వేతజాతులతో సమానత్వమును, సమానన్యాయమును గలుగుటకు ప్రయత్నమవసరము.

## నిమ్నప్రపంచమహాసభ

నిమ్నప్రపంచ మధోగతిపాలై పోకుండవలెనన్నచో నిప్పటివలె చెల్లాచెదరై సంఘీభావశూన్యమైయుండుటను నేటికైనను విరమించవలెను. సర్వనిమ్నప్రపంచోద్ధరణమునకును యావత్ప్రపంచమును నడుముగట్టి జినీవాలోనో, లేక మరొకచోటనో యేటేటను మహాసభ నొకదానిని జరిపి, మన అఖిలభారత కాంగ్రెస్ మహాసభవలె పనిచేయగల యొక సాంఘిక సంస్థను లేవదీయవలెను. ఇందు నిమ్నప్రపంచసముద్ధరణమునను ఆశయములందును సానుభూతిగల సకలదేశీయులును పాల్గొనువర్గములుగ నుండుట యీసభకు ప్రాణసూత్రము.

ఈమహాసభయే గాక ఆస్ట్రేలేషియాకొకటియు పూర్వ, నైరుతి, దక్షిణాఫ్రికాలకును, అంగోలా, కాంగో, సుడాన్, మొజాంబిక్, మెడగాస్కర్ మధ్యాఫ్రికాల కొకటియు, నీగ్రోఆఫ్రికా అనదగు పశ్చిమాఫ్రికా కొకటియు, అమెరికా రెడ్ ఇండియన్ల కొకటియు, అమెరికానీగ్రోల కొకటియు వేర్వేరు మహాసభ లుండవలెను.

తమ హక్కులకొరకు పోరాడు నిట్టిసంస్థ లున్నచో నతిత్వరితముగ నిమ్నప్రపంచము సముద్ధృతమగును. అప్పుడే భారతాది శ్వేతేతర దేశములకును ప్రతిపత్తి గలుగును.

---

(శ్రుతిపీఠి)

## విచారతరంగము

౧

ప్రకృతియెల్లఁ గరంచుపాటలాధరలీల తామరమొగ్గయందంబు నెఱప
లోకముల్ దనియించు శ్రీకరచరణముల్ తామరపూవులఁ దలఁపు సేయ
భువనంబు లలరించు సువిశాలనయనముల్ తామరరేకులదళముఁగూర్ప
జగములఁ నెలయించుశ్యామలతనుదీప్తి తామరపాకులగోము సూప
సరసివలె నెట్టయెదుట సాక్షాత్కరించి-పాపరూపదురాపసంతాప మార్చి
యనుపమకృపామృతావగాహనముఁ గూర్చి-తీర్చి నను సేద దేర్పవే దేవదేవ!

౨

ఎద వగులంగఁ బిల్చి కను లెండఁగఁ జూచుటె యయ్యెఁ గాని య
భ్యుదయవిభాకరాంశువిభవోజ్జ్వలనీలధరాధరంబనన్
సదమలరత్నమాళివిలసన్నవనీరదమూర్తితోడ నా
యెదుటను దోఁచి ప్రోచుదయ యింకను రాదుగదా జనార్దనా!

౩

పవలింటిదొర మించు రవలతురాయితోఁ జిగురాకుపూవులచేరుతోడఁ
గ్రొమ్మించురతనాల కమ్మలయొఱపుతోఁ దీవమంకెనకావి మోవితోడఁ
దొలిపల్కుఁ దేనెలఁ జిలుకు కేల్దావలతోఁ గడిఁదిసింగంపునెన్నడుముతోడ
వానమబ్బులచాయ లీను నెమ్మేనితో సిరులొల్కుకన్నుదామరలతోడఁ
గనుల మెఱపించి, వలపించి, కానిపించి-కనికరము నించి, కులికించి, కౌఁగిలించి
పులక లొలయించి, యెలయించి ప్రోతు వనుచు-నెంత బ్రతిమాలుకొన్న రావేమికృష్ణ!

౪

తెల్లనివెండికొండపయిఁ దేలెడు నీలఘనాఘనంబునాఁ
జల్లనిపాలవెల్లి ఫణి శయ్యఁ బరుండి సుఖంతుగాని నీ

నల్లనిమేను, బద్మనయనంబులు, బింబఫలాధరంబు నా
యుల్లము నెంతగాఁ గలఁచు చున్నవో చూడవుగా శ్రియఃపతీ!

౫

అంబుదనీలవర్ణ! వసుధావన! పావన! తావకాంఘ్రి ప
ద్మంబులు బాలసూర్యుల విధంబున నామది వెల్గుచుండ దా
స్యంబు నొసంగవైతి వది యబ్బుర మైనఁ దమోవికారమో
హాంబుధి మున్గి నిన్మఱచు నట్టియుపాయమునైనఁ జెప్పవే!

౬

తోయజపత్రనేత్ర! నవతోయదగాత్ర! కళావిచిత్ర కృ
ష్ణా! యిటు రమ్ము రమ్మనిన నాయుపచారము లెంచఁబోక వై
హాయసవీథి నైన, విపు లావని నైనఁ బయోధి నైన, సిం
కేమొక నైన నాకుఁ గొలు విచ్చి కృపామతి నేలుకోఁగదే!

౭

అరుణాబ్జంబులఁ బోలు కన్నుఁగవతో, నందంపుఁ గెమ్మోవితోఁ
గరపాదంబులతో, దిగంతవిలసత్కల్యాణతేజంబుతో
హరినీలాద్యుతిఁ బోలు నిన్ను మదిలో నర్చింతు నేవేళ నీ
చరణాబ్జంబులచెంత నిల్పుకొని దాస్యం బీయవే శ్రీహరీ!

౮

ఆయతభక్తి నీయడుగు లంటి భజింతు నఁటన్న రాక నీ
శ్రీయుతమూర్తి మబ్బుతెరఁ జేర్చి ననున్ బ్రమయింతు వక్కటా!
పాయక నిల్చి కొల్చుటకుఁ బాండవు లిచ్చిన దేమినాఁడు, నే
నీయని దేమి? నేఁడు మొగ మేనియుఁ జూపవు పార్థసారథీ!

౯

నత్తుగలానిచందమున శంఖము నొత్తితి, గారుడధ్వజం
బెత్తితి, చుట్టువాలు మెఱ యించితి వార్తలఁ బ్రోతునంచు నా
యుత్తరభూమి, నామధుర నుద్భవ మందిననాఁడె; నేఁడు నా
కుత్తుక యెండ నార్తిఁ బడి కూయిడఁ బ్రోవ విదేమి మాధవా!

౧౦

పుట్టఁగనేరనైతి నిలఁ బ్రోవఁగ నీవవతారమూర్తివై
నట్టిదినంబులందె; యవి యన్నియుఁ బోయిన నీవుగూడఁ జూ
పట్టక పాలలో ఘృతము భాతిఁ జరాచరభూతకోటిలో
గుట్టుగ నుంటి వెందుఁ గనుఁగొందు, నిఁకెట్లు భజింతు మాధవా!

౧౧

సోమసేవను లెల్ల సుధఁ జూఱఁగొను వేళ నోదవదా నాకింత బ్రదుకుతెరువు?
క్షోణిచక్రం బెల్ల సుస్థిరం బగువేళఁ గలుగదా నాకింత నిలువనీడ?
అగచరావళులెల్ల నధికారు లగువేళ దొరకదా నాకింత చిఱుతకొలువు
పసులుపామరు లెల్ల బరమర్షు లగువేళ నందదా నాకింత యవలిమెట్టు
ఎన్నొయవతారములను నీ వెత్తునాళ్లఁ, బుట్టలేనైతి, నీపదాంబుజము లపుడు
పట్టలేనైతి నిపుడ రూపకు నగమ్య, నెందుఁగని నిన్ను సేవించుకొందుఁ గృష్ణ!

---

## పాంచజన్యము

వడ్డాది సీతారామాంజనేయులుగారు

శృంఖలిత స్ఫుటంచు, జడజృంభిత మంచు హసింప కోర్కి నీ
శంఖము నొక్కమా ఱిపుడు చక్కఁగ నొత్తుము, సాహితీకలా
ప్రేంఖిత తారహారములు విశ్వమయప్రణవామృతోర్మికా
పుంఖితమై విరాజిలఁ బ్రఘూర్ణమహాస్థితిఁ దత్త్వకందమా!

'మణిదీపము'

---

# భారతీయమహిళామండలి



ఇటీవల రాయలసీమ కళాశాలలో జరుపబడిన నాటకము
లందు పాల్గొన్న అనంతపుర రాజకీయోన్నతబోధనాభ్యాసన మహిళాపాఠశాలా విద్యార్థినులు




డా॥ ఏ. లక్ష్మీదేవిగారు:

డా॥ లక్ష్మీపతిగారికుమార్తె.

లాహోరులోని లేడి హార్డింజి
వైద్యకళాశాల ప్రొఫెసరుగ
నియమింపబడిన ఆంధ్రయువతి.



## షణ్ముఖదైవము

### (చిత్రవివరణము)

ఇది చిత్రమైన చిత్రమే కాక చిత్రకారుని స్వయం చిత్రగ్రహణశక్తినిగూడ చాటు నొకవింతచిత్రము. ఛాయాచిత్రకారు డితరులసాయము నేమాత్రము నపేక్షింపక తానొక హిందూదైవము ననుకరించి యప్పటి తనబింబమునే యిట్లీచిత్రమునందు ప్రతిబింబింపజేసి యున్నాడు. ఆ యనుకరణమునగూడ నతడు కృత్రిమ హస్తముల నెంతమాత్రము నుపయోగింపక తన రెండు చేతులనే యిం దారుచేతులుగ గనుపరచియున్నాడు. ఫోటో అద్దములనుకూడ నెక్కింటి నుపయోగింపక యొక్కటే అద్దమును వివిధావస్థలలో వెలుతురుకు కనుపరచి యీచిత్రము నతడు తీయజాలెను.

మొదట నతడు చిత్రమున క్రిందిభాగమున కానవచ్చు రెండుచేతులను చిత్రించెను. అట్లు చిత్రించునప్పుడు తక్కిన తన శరీరమంతయు నతడొక ముకమలు గుడ్డచే కప్పియుండెను. రెండవమారు నటులే శరీరమును కప్పియుంచి పైభాగమున కానవచ్చు రెండుచేతులను చిత్రించెను. మూడవమారు తాను కప్పుకొన్న ముకమలుగుడ్డను మిక్కిలి మెలకువతో తొలగించి తానొక కిరీటమును దాల్చి నడుమనున్న రెండుచేతులను, తక్కిన శరీరమును చిత్రించెను.

ఈ చిత్రమును తయారుచేయుటకు చిత్రకారుడు తానొక కంబళి పయిగూర్చుండి యాకంబళిక్రిందుగా నొక రబ్బరుతీగనుపోనిచ్చి దాని యొకకొనను ఎదుటనున్న క్యామిరాయొక్క తెప్పకు తగిలించి మరియొక కొనను కంబళిలోని యొకరంధ్రముగుండ తనకాలివ్రేళుల నిరికించుకొని పాదములను చీరచే కప్పివయిచి వలయునప్పుడాతీగకొనను మెల్లగ నొక్కుచువచ్చెను. కాని కాలికదలికచే చీరయు కదలి చిత్రమును పలుమారులు చెడిపోయెను. తుదకెంతో మెలకువతో నతడీచిత్రమును ముగింపజాలెను.

---

## బొప్పాయిచెట్టు (CARICA PAPAYA)

ఆర్. లక్ష్మీనరసింహశాస్త్రి గారు

ఫలాహారముయొక్క ప్రాముఖ్య మనాదిగా గుర్తెరుంగబడి నవీనముగ మనదేశీయులచే ఆదరణలోనికి దేబడుచున్నను, కొన్ని ఫలములయొక్క యాహారపు విలువ (Nutritive value) గాని, సదరు చెట్లయొక్క పెంపుదలగాని యంతగా పాటింపబడకున్నది. దీనికిగారణము మన యశ్రద్ధయే యని యూహింపవలసి వచ్చుచున్నది.

నిర్లక్ష్యభావమున జూడబడిన ఉష్ణదేశమున నుత్పన్నములగు ఫలముల (Tropical fruits)లో బొప్పాయి యొకటి. దీనిచెట్టు అమెరికాలోని యుష్ణప్రాంతముల ననుకూలమైన లోయలలోను, ఇదితరప్రదేశములయందును పెంచబడుచున్నది. సాధారణముగా కొమ్మలులేక,

పెరుగైన కాండముగల యీచెట్టు ౨౫ అడుగులవరకును పెరిగి గుండ్రముగగాని యండాకారముగాని యుండు సువర్ణచ్ఛాయగల పండ్లనిచ్చును. ఒక్కొక్క పండు ౨౦ పౌనులవరకు బరువుతూగును. ఫ్లోరిడా, మైసూరు మొదలైన యెడల పెంచబడుచో టుల నీఫలము లుదయభోజనమందును, ఇదితరసమయములందు అపక్వమైన ఫలాహారము (Salad) గాను, పచ్చికాయలు శాకములుగాను వివిధపద్ధతుల నెక్కువగా నుపయోగింపబడుట విదితము.

సారవంతమైన వదులు, రేగడభూములు (Rich loamy soils) యీ బొప్పాయిచెట్టు ఉత్పత్తికి మిగుల అనుకూలములు. తోటలలో వీటిని నీటికాల్వల కిరుప్రార్శ్వముల వరుసగా నాటినయెడల వేరేపోషణ మవసరముండదు. దీనిఫలముల వాసన కొల్లరకు నంతగా నిష్టము లేకపోవచ్చును. మనదేశములోగల తేనెబుడ్డి (Honey Pot) మొదలైనరకములలో నీవాసనయుండదు. ఈచెట్లు సాధారణముగా నెల్లప్పుడు కాచుచునే యుండును. ఈచెట్లను రెండు సంవత్సరములకంటె నెక్కువయుంచుటవలన కాయలపరిమాణమును, ఒకప్పుడు రుచియు తగ్గును. అందువలన రెండుసంవత్సరములకు తరువాత చెట్లును తీసివేయుట మంచిది.

కాండమునగాక యంగుండి వచ్చు కొమ్మల చివర వ్రేలాడు చిన్నకాయలు గాచు చెట్లను మగచెట్లని చెప్పుదురు. అటువంటిచెట్లను వాటి మొదటిపూతచూచి గుర్తించినంతనే పెరికివేయుట మంచిది.

బొప్పాయి (పరంగిపండు) ఫలము బహుజనప్రియము గాకపోను. రుచిగానుండుటవలన, విటమినులు గలిగియుండుటవలన అవి యాకర్షకములే. వానిని అమితముగాగాని, కడుపునిండియున్నపుడుగాని తినకూడదు. కొంచెము ఆలస్యముగా జీర్ణమగును. వలువచేసి, నీరుపెంచి శరీరతత్త్వమును మార్చును. చలువశరీరము గలవారలకు కఫవాతముల పెంచును. కాని, మితముగా దినుటవల్ల అజీర్ణము నశించుట, పురాణ నీళ్లవిరేచనములు కట్టుట, రక్తస్రావసంబంధమైన మూలవ్యాధి నివారణమగుట, మూత్రద్వారమున గల్గిన పుండ్లు మాడ్చుట మొదలగు ననేకములయిన యుపయోగములు గలుగును. పండులోని గుంజును ఒడలికి రాచిన ప్రేలుడు (Prickly heat) నివారణయగును. గింజలయందు సైతము క్రిమిహరమగుపదార్థమున్నది.

పచ్చికాయలకూర శాకచేయును. వాతమును, వంటినీటిని హరించును. బాలెంతరాండ్రు క్షీరవృద్ధికై దీని నతిప్రియముగా వాడెదరు. ఈకాయముక్కలనే అల్కహాలులో వేసియుంచి, పిమ్మట ఎండబెట్టిపొడిచేయుదురు. ఈపొడినే పెప్సిన్ (Pepsin, a digestive enzyme resembling animal pepsin) అందురు. కార్యము, డబ్బు ప్రబ్బినప్పుడు యీపొడిని, బొప్పాయిపాలను ఉపయోగింతురు. బొప్పాయికాయ పాలచుక్కలు ఒకటి రెండువేసి వండినచో ఎంతకఠినపదార్థమైనను త్వరలో పక్వమై యుడికిపోవును. ఈపాలనే తామర, చీడ, తేలుకాటు మొదలగువాని నివారణలకు ఆయాప్రదేశములందు గట్టిగా మర్దనచేయుదురు. ఆకులను దంచికట్టినచో బోదకాలు తగ్గును. నొప్పులకుసయితము ఆకులను వెచ్చచేసి కట్టుట కలదు.

పైచెక్కును తీసివేసి కొబ్బరికోరువలెగాని, పనసకాయవలెగాని, ఆనపకాయవలెగాని కూరగా నుపయోగించుటకు అనుకూలమైన యీకాయల నెందువలన విరివిగా నుపయోగింపరు? మంచివిత్తనముల సంపాదించి ప్రతి పెరటియందును కొన్ని బొప్పాయిచెట్ల నెందుకు పెంచరాదు? తినుట కలవాటుపడినగదా కొనువారుగాని యమ్మువారుగాని! (No demand, no supply) ఇన్ని యుపయోగములుగల యీ చెట్టునకు ప్రతి యుద్యానపాలకుడును కొంత తావొసంగుట మిగుల సమంజసమగును.

---

## "స్వాతంత్ర్య" సుభాషితములు

ప్రజ లందరును సర్వజ్ఞులగుచో ప్రభుత్వ మంతర్ధానమగును. ప్రజలకు ప్రభుత్వము కుంటివానికి కర్రవంటిది. వికలాంగునకు దీర్ఘతరమగు దండము నొసగుట

కంటె అతని లోపభూయిష్ఠమగు వంగమును బాగొనర్చుట అతనికి మేలొనర్చుట యగును. మానవోన్నతి మానవుని సంస్కరించుటలో కలదు—కాని ప్రభుత్వము బలపరచుటవలన కాదు. (జె. యి. జి. క్రేస్టర్).

౨ మన తాతతండ్రులవలెనె స్వేచ్ఛాభిలాషులై! అందులకు ప్రయత్నించువారిని చంపుట మనకు కర్తవ్యమగునా? (ఇబిడ్.)

౩ ఎవరి స్వాతంత్ర్యమును వారి కొసగెదను. ఒకరిస్వేచ్ఛ నొకరి కొప్పజెప్పను—రోమనులుకానిండు—విఘీనియనులు కానిండు—బ్రిటిషువారు కానిండు—ఎవరైనను సరే. (ఛార్లెస్ I).

౪ ఓ ఆంగ్లేయులారా! మీరు మాకత్యుత్తమమగు పన్నులవిధానము నొసగినను, ప్రెస్బిటెరియన్, కాతలిక్, ఎపిస్కోపాలియన్ భేదముల నశింపజేసి సర్వసమత్వమును స్థాపించినను, మీ సెనేటుసభలో మాకు కావలసినంత ప్రాతినిధ్యము నొసగినను, మమ్ము ఋణవిముక్తుల జేసినను, అన్ని ఆర్థికలోపముల సవరించినను—ఇంతేకాదు—సర్వప్రపంచమును కొల్లగొట్టి బంగరు రాసుల మాయెదుట బెట్టినను, మీరందరును మమ్ముల నెంతగా గౌరవించినను—నేనొక్కటి చెప్పెదను—మా దేశముపేరిట, స్వేచ్ఛపేరిట, భూతభవిష్యద్వర్తమాన కాలముల సాక్షిగ— ఐర్లండు ఇంగ్లాండునకు సామంతరాష్ట్రమై యున్నంతవరకు — మే మా కానక్కల కాలదన్నెదము. (డేవిస్).

౫ మానవులు తమ కుగల వాంఛల దీర్చికొనుటకు తమశక్తులను సంపూర్ణస్వేచ్ఛతో నుపయోగించుచున్నచో, వా రత్యంతప్రతిభాశాలు లగుదురు. (ఇబిడ్)

౬ ప్రతిమనుజుడును మనుజుడుగా నుండుట కవకాశముండవలెను. (హింక్లే)

౭ విదేశసేనల నెదుర్కొనవచ్చును. నూతనభావముల నరికట్టజాలము. (విక్టర్ హ్యూగో)

౮ పెక్కురను భయపెట్టు నతడు పెక్కురకు భయపడవలెను (లిబీరియస్).

౯ విప్లవమును విప్లవముకొరకే ఎవ్వరును ప్రేమింపరు—బానిసత్వముతోపోల్చి విప్లవమును వరింతురు) విప్లవఫలితములకంటె, విప్లవకారణముల నెరుగుట వివేకవంతుని లక్షణము (కాంటు మామియాని).

౧౦. ఇంగ్లాండు కేవలము ప్రజాస్వామ్యపద్ధతి నెరుగని యూధాగ్రేసరుల కాటపట్టని తలపరాదు. వారికెంత పూజనీయులు, ఆదర్శప్రాయులో, మనకు నంత మాననీయులగు, సుప్రసిద్ధచరిత్రగల వీరులు, రాజకీయవేత్తలు, కవులకును జన్మస్థానమని మనము మఱవరాదు. (ఇబిడ్).

౧౧ ఓ క్రైస్తవులారా! నాంతుస్తు, మీరనెన్యమెంత ద్వేషించుకొనుచున్నారో! మీరతనుడు ప్రేమింపుడని యాజ్ఞాపించిన ప్రజను మీరెట్లనాదరణమొనర్చుచున్నారో గమనింపుడు. క్రీస్తువాక్యముల ననుసరింప యత్నించుచున్న జనసముదాయమును మీరెట్లు కారాగారముల బంధించి, పీడించి, హింసించుచున్నారో, ఒక్కసారి స్మృతిపథమునకు దెచ్చికొనుడు. మీ దేవుని మీరు కనుగొనునంతవరకు, 'కాన్స్టాంటునోపిలు' లోని మీ 'చర్చి'ని తిరిగి తీసికొనుయత్నము మానుట మంచిదికాదా! (నేషన్, 17-1-20).

౧౨ ఐర్లండునందలి మీ ప్రతినిధులు మానవమాత్రులుకాక స్వర్గమునుండి దిగివచ్చిన దేవాంశసంభూతులైనను, వారెంత సదయహృదయులైనను, ఐరిష్ దేశజులు అన్యదేశజులచే పాలింపబడగోరరు. స్వపరిపాలనము నె వాంఛింతురు (టి. పి. ఓకానర్).

౧౩ కళాశాలలలో నేర్పెడివిద్య రాజకీయముగ నెంత ఉపయోగపడునా యనునది సందేహాస్పదమగు విషయము. ప్రభుత్వనిర్వహణమునుగూర్చి తరిబీతునొసగ గలిగినది ప్రభుత్వమే. ప్రపంచము నంతటిలోను మహోత్కృష్టమగు విద్య నొసగెడి సంస్థ, అమెరికాలోని నాల్గు సంవత్సరముల కొకసారి జరిగెడి అధ్యక్షునియెన్నిక.

(యి. రూట్.

౧౪ బ్రిటిషుపార్లమెంటులోని సభ్యులలో నెవ్వరును బ్రిటిష్‌వారికితప్ప మరెవ్వరికిని స్వేచ్ఛయావశ్యకమని విశ్వసింపరు. (శిక్లత్వాలా.)

౧౫ మేము అమెరికాసంయుక్తరాష్ట్రములస్థాపించినది కేవలము మాకొరకేకాదు. ప్రపంచమునగల యందరను స్వతంత్రులుగ నొనర్చుటయే మాయాశయము. (అధ్యక్షుడు విల్సన్.)

౧౬ బాధ్యతలేనిస్వేచ్ఛ స్వేచ్ఛకాదు—దుర్మార్గమున్న, అర్థరహితమునగు యథేచ్ఛావిహారము, స్వేచ్ఛలేనిబాధ్యత బాధ్యతకాదు— పశుబలనిరంకుశత్వము. (ఇబిడ్)

౧౭ స్వతంత్రమానవములు ధైర్యయుతులగు మనుజుల నొనర్చును (జాన్‌మార్లే)

౧౮ దుర్మార్గములగు నిరంకుశప్రభుత్వము లుపయోగించెడి కుతర్కవాదమిది—"ప్రజలు దౌర్జన్యపరులైనచో వారు స్వతంత్రత కనర్హులు. వారు శాంతిగనున్నచో వారికి స్వాతంత్ర్య మనవసరము." (ఇబిడ్)

౧౯ "బ్రిటిష్‌పాలనమున మీరేల సౌఖ్యవంతముగ లేరని" మమ్ముల మీరడుగవచ్చును. ఇందులకు మేమొసగుసమాధానము మీకంతగ బోధపడదు. ఏలనన, అన్యుల సహజస్వత్వముల నదేపనిగ నణగద్రొక్కుటయే వృత్తిగాగల మీప్రకృతి మొద్దుబారినది. మేము బ్రిటిష్‌పాలనమున నేల సుఖులుగ లేమందురా? మేము రాళ్లురప్పలము కాము కనుక. మేము మానవులము కనుక, మాకు భావములు, అభిలాషలు, జాతీయగర్వము కలవు కనుక. మేము సౌఖ్యదూరులమగుటకు కారణమేమందురా? మాప్రభుత్వము పరప్రభుత్వము కనుక. మాయిచ్ఛకు భిన్నముగ నెత్తికెత్తినది కనుక. ఇది బ్రిటిష్‌పాలనము కనుక, మాది కాదు కనుక. (లజపతిరాయ్.)

౨౦ అన్యోన్యద్వేషముచే కలసియున్న ఏయిద్దరకును నశింపకతప్పదు. (బర్కు.)

—వడ్లమూడి గోపాలకృష్ణమూర్తి.

---

## స్వారాజ్యము

'స్వారాజ్య'శబ్దముయొక్క ప్రాక్కాలీనత యెంతవఱకు బోవుచున్నదియో తెలియరాకున్నది. కృష్ణయజుర్వేదసంహితాభాగమున నిది ముఖ్యముగ నున్నది. బ్రాహ్మణమున గొన్నియెడల గన్పట్టుచున్నది:—

(౧) ద్వితీయకాండ సప్తమప్రపాఠకనవమానువాకమున:—

రాడసి విరాడసీత్యాహ స్వారాజ్యమేవైనంగమయతి ఇతి.

ఈబ్రాహ్మణమునందలి స్వారాజ్యశబ్దమునకు సాయణాచార్యులు భాష్యమేమియు జేయలేదు. టూకిగా "రాడసీత్యాదింశ్చతురో మన్త్రాన్ పఠేత్తేన స్వారాజ్యప్రాప్తిః" అని మాత్రము వ్రాసినారు.

(౨) మరల ఉదాహృతద్వితీయకాండసప్తమప్రపాఠకైకాదశానువాకమున:—

స్వారాజ్యంవా ఏష యజ్ఞః। ఏ తేనవా ఏకయావాకాందమః స్వారాజ్య మగచ్ఛత్ ఇతి।

ఈ మంత్రభాష్యమునను స్వారాజ్యశబ్దార్థము చెప్పబడలేదు గాని "ఏష పంచశారదీయాఖ్యోయజ్ఞః స్వారాజ్యస్వరూపఫలప్రాప్తిహేతుత్వాత్। ఏతేనపంచశారదీయేనైవపురాకాందమో నామకశ్చిదృషిః స్వారాజ్యంప్రాప్తవాన్" (ఈ పంచశారదీయమువలన కాందముడను ఋషి స్వారాజ్యమును బొందెను) ఇత్యాదివచనము లున్నవి.

(3) పై ౨వ మంత్రము క్రిందనె "స్వారాజ్యం గచ్ఛతి। యఏతేనయజతే। యఉచైనమేవంవేద ఇతి" అను మంత్రమున్నది. ఈమంత్రభాష్యములోనను సారాజ్యశబ్దార్థము వివరింపబడియుండలేదు.

ఇక తైత్తిరీయశిక్షావల్లిలోని యాఱవయనువాకమున "ఆప్నోతిస్వారాజ్యం" అని యున్నది. ఇందలి స్వారాజ్యశబ్దమునకు శ్రీ శంకరభాష్య మిటులున్నది:—"స్వారాజ్యం స్వరాడ్భావం స్వయమేవ రాజా అధిపతిర్భవతి."

ఈ యుపనిషదర్థమును స్మరించియే కాబోలు శ్రీ శంకరాచార్యులవారు వివేకచూడామణియం దిట్లుపదేశించిరి.

స్వారాజ్యసామ్రాజ్యవిభూతిరేషా
భవత్కృపా శ్రీ మహిమప్రసాదాత్।
ప్రాప్తామయా శ్రీ గురవేమహాత్మనే
నమోనమస్తేస్తు పునర్నమోస్తు॥

పై నుదాహరింపబడిన వాక్యములలోని "స్వారాజ్యము" ఆధ్యాత్మికమనియు (Spiritual or religious) లౌకికమున హిందువులకు స్వాతంత్ర్యముయొక్కయు స్వాధిపత్యముయొక్కయు స్వారాజ్యముయొక్క ప్రబోధయే లేదనువాదము చేయతగదు. ఆధ్యాత్మిక ప్రపంచమున స్వారాజ్యాదిపదవు లూహింపదగియున్నను అట్టివి భౌతికధర్మముల ననుసరించి ఆలంకారికములుగ (Metaphorical sense) ఆధ్యాత్మికమున కెక్కియుండగలవు. రాజు, చక్రవర్తి, సార్వభౌముడు లోనగు బిరుదులు కవులకు, రాజులకు సామాన్యములుగ నున్నవి. "కవిరాజు", "శ్లేషయమకచక్రవర్తి", "కవిసార్వభౌముడు" అను బిరుదములు కవిపండితుల కీబడుచున్నవి. లౌకికమున లేనిదే యిట్టివి ఆధ్యాత్మికమున కెక్కజాలవు. అట్లు గానియెడల ఒకస్వారాజ్యమేగాక "సామ్రాజ్యం భోజ్యం। స్వారాజ్యం వై రాజ్యం। పారమేష్ఠ్యగ్ం రాజ్యం। మహారాజ్య మాధిపత్యం। అయగ్ంసముద్రపర్యాయాస్యాత్సార్వభౌమస్సార్వాయుష॥ *ధాతాపరార్థా పృథివీ సముద్రపర్యన్తాయా ఏకరాడితి."

ఇత్యాదిమంత్రములలోని పదంపరకు సార్థక్యము లభింపజాలదు. సామ్రాజ్యభోజ్యాదులన్నియు నన్నియంతస్తులగు రాజ్యపదవులుగ నుండవలెను. ఈగ్రంథములోని స్వారాజ్యము శ్రీ శంకరభాష్యమున జెప్పబడిన ప్రకారము స్వరాడ్భావముగలదిగ నుండవలెను. ఈ స్వరాడ్భావమె బహుశః ఇంగిలీషున రిపబ్లికు లేక కామన్‌వెల్తు (Republic or Common wealth) అను భావములకు సరిపోగలదు. గ్రీకుతత్త్వజ్ఞుడు ప్లేటో యూహించిన "రిపబ్లికు" ఇట్టిదిగనె యుండగలదు.

ఇట్టి యర్థమును, ప్రయోజనమును మనసునందుంచికొని మనువును "సర్వభూతేషుచాత్మానం సర్వభూతానిచాత్మని, సమంపశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి" అని శాసించియున్నారు (మనుస్మృతి ౧౨ అధ్యాయము శ్లో ౯౧). కామన్‌వెల్తులోగాక మరెచ్చటను ఇట్టి స్వారాజ్యము సిద్ధముగాజాలదు. ఈసంపద పొందవలయునన్న "ఆత్మయాజి"యగుట ప్రబలసాధనమగుచున్నది. ఆత్మయాగ మనగ స్వార్థత్యాగము కాగలదు. ఇదియె ఇంగిలీషున 'Self Sacrifice' అనిపించుకొనును. దానినుండి సర్వసమత్వము తప్పకపుట్టును. కామన్‌వెల్తునందలి ముఖ్యాభిప్రాయము సర్వసమత్వమెకదా! జాతిచేతగాని, జన్మచేతగాని, ధనముచేతగాని యొకడు తానితరులకంటె వరిష్ఠుడనకొనగలిగినచో (కామన్‌వెల్తు) స్వారాజ్యభావ మూర్జితముకాజాలదు. దుఃఖమనగ పరవశమె దుఃఖము. సుఖమనగ ఆత్మవశమె సుఖము. అని మనువు అ ౪ శ్లో ౧౬౦న జెప్పియున్నాడు.—

"సర్వం పరవశందుఃఖం సర్వమాత్మవశంసుఖం"

ఈయర్థము నుద్దేశించియేకదా సీతాదేవియు రావణునిచెరయందుండగ "ధిగస్తుపరవశ్యతాం" అని విలపించినది. (సుందరకాండ ౨౫-౨౦) సుఖదుఃఖములనుగూర్చియు, పరవశ్యతనుగూర్చియు నిట్టి యాశయములుగల ప్రజకు "స్వారాజ్య"భావము లేకుండదు. అనాదిసిద్ధమయి, వేదకాలమునుండి బుద్ధిస్థమయియుండు నీస్వారాజ్యసంపద ఈనాడు క్రొత్తగ కాంగ్రెసు ప్రచారములవలనగాని ఆంగ్లేయనాగరకతతోడి సంపర్కమువలన గాని యుదయించినది కాదు.

ఇంకొకమాట—పైన జెప్పిన వివేకచూడామణి శ్లోకమును కొంచెము మార్చినయెడల గాంధిమహాత్ముని కేరునకు సరిపోగలదు.

స్వారాజ్యసామ్రాజ్య విభూతిరేషా
భవత్కృపా శ్రీ మహిమప్రసాదాత్।
ప్రాప్తాద్య గాంధీగురవే మహాత్మనే
నమోనమస్తేస్తు పునర్నమోస్తు॥

మహాసభలలో జదువు మంగళశ్లోకములలోనిది చెప్పదగునని మనవి. విజ్ఞులు వాఙ్మయశోధనచేసి స్వారాజ్యభావవ్యాప్తి యెందెందుగాననయ్యెడినో అట్టి యాకరములనెల్ల నీపత్రికాముఖమున ప్రకటింపదగుదురు.

—వంగోలు వెంకటరంగయ్య, బి.ఏ., బి.యల్.

* ఖిలమంత్రము.

# కాకులు-హంసలు

చిలుకూరి లక్ష్మీనరసమ్మ గారు

"నికటముననుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టుపై ద్దఱచినప్పు
డుడిగి రాయంచ యూరక యుంట లెస్స
సైపరాకున్న నెందేని జనుట యొప్పు."

—శ్రీనాథుడు.

కాకులు, కాకులు-కావ్ కావ్
హంసా, హంసీ ముచ్చటలు.
ఆకాశానికి
అందనికోట
ఆశనిరాశల
అమరినకోట
అందరికీ ఒక
తీరాకోట
దానికి తొమ్మిది వాకిళ్లు
కోటకు నడుమను
కొలనులోపల
హంసా, హంసీ
ఆనందముతో
చక్కని నడకల
సంచరించుతూ
మురిపెముమీరగ ఉన్నాయి.
కోటకు ఉన్నవి
అయిదు బురుజులు
ఒకొక్క బురుజుకు
ఒకొక్క కాకి
కావలి కాస్తే
కాకులమీద
కొంగ ఒక్కటి కొత్వాలు.
కాకులు, కొంగ
కలిసి తిరుగుతూ
గడబిడ చేయగ
హంసా, హంసీ
సద్దు చేయగా
వద్దని తెలుపగ
కొంగకు కోపము వచ్చింది.
కోపం రాగా
కాకుల పిలిచి
కన్ను గీటగా
కిక్కురు మనక
బురుజుల మీదను
వరుసగ కూర్చొని
సభ ఒక్కటి అవి సాగించె.
హంసను హంసిని
అవమానించడ
మొట్లని అన్నీ
ఎన్నో అనుకొని
ఒక్కొక్కటిగా
ముందుకు వచ్చి
టక్కరిగా కకలించినవి.

వాటికి మరొక
మాట తోచక
కావు, కావు మని
కలిసి అరుస్తే
హంసకు హంసికి
అవమానము అని
తమలో తాము తలంచినవి.
కావు, కావు మని
కాకు లరువగా
కాచితిమని, ఆ
హంసా, హంసీ
అభయం ఇచ్చి
ఆనందముతో
పద్మసరస్సును పట్టినవి.

*     *     *     *

కావు మన లేదోయ్
'కావు' మన్నా మోయ్
చావు తప్పిందోయ్
కావ్, కావ్, కావ్, కావ్
అంటూ కాకులు ఎగిరినవి.

---

## నారహాస్యము

వేంకటకాళిదాసకవులు

(ఆం. గీ. సా. పరిషత్తు)

నా దరిద్ర కుటీరాంగణమ్మునందు
యౌవనవసంతపుష్పభాగ్యములతోడ
నిలువఁబోకుము నాదైన్యనిభృతమైన
జీవితము నెంచుకొన నాకె సిగ్గువోడము.

ఆఁకలింగొన్న కనులతో నచట నిల్చి
యడుగఁబోకుము నారహాస్యమ్ము కొఱకు;
నారహాస్యమ్ము రాగారుణప్రకాశ
సంగతవ్యథాకఠినపాషాణము సుము.

---






శ్రీ రాజా విక్రమదేవ వర్మగారు

జయపురము నూతనసంస్థానాధీశులు.



యం. కనకాద్రి రావుగారు

వీరు నెల్లూరువాస్తవ్యులు. ముష్టియుద్ధమున మంచి ప్రావీణ్యము గలవారు. ప్రకృత మమెరికాలో వ్యాయామప్రదర్శనముల గావించుచున్నారు. అమెరికావారు వీరికి 'హిందూ హెర్కులీస్' అను బిరుదము నిచ్చిరి.

---

# శ్రీ. శే. ప్రతివాది భయంకరము రంగాచార్యులుగారు

భారతీ వ్యాసకర్తలలో నొకరగు రంగాచార్యులుగారి యకాలమరణవార్తను పాఠకలోకమునకు దెలుప మిక్కిలి చింతిల్లు చున్నాము. పిన్నవయసువారయ్యును వీరు సహజపాండిత్యభూషితులు. మృదుమధురములగు వీరి వివిధవ్యాసములను మక్కువతో నలంకరించుకొని భారతి మురియుచుండినది. కాని నేటితో నామె కా భాగ్య మంతరించినది.

ఆచార్యులవారి నివాసము పశ్చిమగోదావరీ మండలములోని విజయరాయి. విద్యార్థిదశయందుత్తమవిద్యార్థులలో నొకరుగ పేరుగాంచి యుపాధ్యాయుల ప్రశంసాదరములకుపాత్రులయ్యు దేశాభిమానప్రేరితులై వీరు కడచిన 1921 లో సహాయనిరాకరణోద్యమ సందర్భమున పాఠశాలలను విడనాడి దేశసేవకు గడంగిరి. హిందీభాషయందు చక్కని పాండిత్యము సంపాదించిరి. కర్ణాటగానమున చక్కని కృషి సల్పిరి. రాజకీయవిషయములందు వీరికి మితిలేని యభిరుచి. తచ్ఛాస్త్రమున నెక్కువ పరిచయము సంపాదించుటకే వీరు సకలసాకర్యములుగల మద్రాసుచేరిరి. దేశోద్ధారకులు శ్రీ నాగేశ్వరరావుగారి యాదరమున విజ్ఞానసర్వస్వ కార్యాలయమున ప్రవేశించిరి. కాంగ్రెసు సంపూర్ణచరిత్రనుగుఱించియు, తూర్పు ఇండియా కంపెనీవారి కాలమునుండి యిప్పటివఱకు హిందూదేశ రాజ్యాంగవిధానమెట్లు మాఱుచువచ్చినదియు సూచించుచు, ఇప్పటి రాజ్యతంత్రమును గుఱించియు, మారకపుపద్ధతి — ఆర్థికవిధానములను గుఱించియు తేటతెలుగున సవిస్తరముగ వ్రాయవలె నని వీరి యభిలాష. అందులకుగాను పెక్కు గ్రంథములను చదివిరి, చదువుచుండిరి.



శ్రీ. శే. ప్ర. భ. రంగాచార్యులుగారు.

ఇంతలో గొంతకాల మాంధ్రపత్రికా సంపాదకవర్గమునగూడ జేరి యందుత్సాహముతో పనిచేయుచు సంపాదకుల ప్రశంసను బడసిరి.

ఆచార్యులుగారికి చాలకాలమునుండియు నారోగ్యము సరిగా నుండలేదు. కాని యాకస్మికముగ నిట్లు మరణము సంభవించువని వారు కడపటి నిమిషమువఱకు తలచి యుండ

లేదు. హఠాత్తుగ వీరు కడచిన 29 వ తేదిన పరమపదించిరను వార్త పిడుగుతాకున తెలియవచ్చినది.

కోరిక లింకను కార్యరూపమును దాల్చక మునుపే వీరిటు లిహలోకమును వీడుట శోచనీయము. గొప్ప దేశాభిమానియై దేశసేవయందే తనువుదొరగిన యీ సహృదయుని నిర్యాణమున కెంతయు వగచెదము. వీరి యాత్మకు సర్వేశ్వరుడు శాంతినొసగుగాక!

—సంపాదకుడు, 'భారతి'.

అమృతాంజనపుమందు నమృతాంధసులలోకములను బ్రచారంబు సలుపఁగోరి
ఆంధ్రపత్రికకు వార్తావళి స్వయముగా పరలోకములనుండి పంపఁగోరి
సుః రాజరాజ్యవైఖరిఁగూర్చి భారతీపత్రికామణి కింత వ్రాయఁగోరి
అమరావతీపట్టణముగూర్చి విజ్ఞానసర్వస్వమునకు వ్యాసంబుగోరి
తలవనితలంపుగా నతిత్వరితగతిని-చుట్టపక్కాల మిత్రుల నట్టె వదలి
స్వర్గపురికిఁ బోయితివె యుజ్జ్వలగుణాకర, ప్రతివాది భయంకర రంగవర్య.

—వే. సు.

---




## Industry year Book and Directory 1931.

### (ఇండస్ట్రీ ఇయర్ బుక్ అండ్ డైరెక్టరీ)

ప్రకాశకులు: ఇండస్ట్రీ బుక్ డిపార్టుమెంటు వారు, కేశ భవనము, ౨౨, శ్యామ్‌బజారు బ్రిడ్జిరోడ్డు, కలకత్తా.

ఇదివరకు ప్రకటింపబడిన డైరెక్టరీ పరివర్తింపబడి యీరూపమున వెలువడినది. హిందూదేశమునందలి వాణిజ్యపారిశ్రామికాదిబహువిధసంస్థలను గురించినసమాచారము లనేకము లేర్చి కూర్పబడినవి. క్రొత్తక్రొత్తగ నెలకొల్పబడిన సంస్థల విలాసములును, అవి నిర్వర్తించుచుండు కృత్యములును వివరముగ తెలుపబడియున్నవి. తపాలాఫీసులు, రైల్వే, ఫ్యాక్టరీలు, పారిశ్రామికవిద్యాలయములు మొదలగు సంస్థలను గురించిన వివరము లిందు చక్కగ నిరూపింపబడినవి. సులభపరామర్శార్థము అకారాదివిషయానుక్రమణికలును జేర్చబడినవి. ఇట్లు పలువిధములుగ నుపయోగకారియగు నీగ్రంథము ప్రతి హైందవవ్యాపారియు నుంచుకొనదగియున్నది. ఈపుస్తకమున సుమారు ఎనిమిదివందలపుటలు గలవు. వెల రు ౫-౦-౦.

---

### పతివ్రతాశతకము

సంపాదకురాలు: శ్రీ చేబ్రోలు సరస్వతీదేవి గారు. గవర్నెస్ (రాజభవనము) మీర్జాపురము ఎస్టేటు, నూజవీడు.

పతివ్రతాధర్మములను నిరూపించు చక్కని పద్యములు నూటయెనిమి దిందు గలవు. పద్యము లన్నియు పూర్వకవిశిఖామణుల గ్రంథములనుండి సంగ్రహింపబడినవి. ఈచిన్నగ్రంథ మాంధ్రము నెరిగిన ప్రతి యువతియు చదువదగినది. వెల నాలుగణాలు.

---

### మక్కళపుస్తక (ఉగాదిసంచిక)

చిన్నపిల్లల జ్ఞానాభివృద్ధికై బయలువెడలిన 'మక్కళపుస్తక' (పిల్లలపుస్తకము) అను కర్ణాటక మాసపత్రికయొక్క వార్షికానుబంధ మిది. చక్కని కాగితములయందు ముచ్చటలు గూర్చు అచ్చుతో సచిత్రముగ ప్రకటితమయిన యీ యనుబంధము బాలుర కెంతయు నానందమును,జ్ఞానమును గూర్చునదిగ నున్నది. నీతిదాయకములగు కథలు, పద్యములు, చిత్రములు పెక్కిందు గలవు అందమైన బైండు. ప్రకాశకులు: కృష్ణాకంపెనీ, బళేపేట, బెంగుళూరుసిటీ.

---

## స్వీకారము

### బీడీపురాణము

గ్రంథకర్త: వేద శ్రీరాములుగారు, రాయదుర్గము బళ్లారిజిల్లా. వెల రెండణాలు.

---

### నారిగొప్పతనము

క్రౌను, పుటలు ౧౮, వెల రెండణాలు. తెనాలి వాస్తవ్యులు త్రిపురనేని గోపిచందుగారు వ్రాసినది.

---

## స్వార్థత్యాగము. (నవల)

క్రౌను సైజు, పుటలు ౮౧ గ్రంథకర్త: ఘూళీ కృష్ణమూర్తిగారు. బళ్లారి కృష్ణదేవరాయ గ్రంథమాలా ప్రథమపుష్పము. ఈ గ్రంథమాలయందు సంవత్సరమునకు మూడు పుస్తకములు వెలువడుచుండును. ఆమూడుపుస్తకములకును చందాదారులు ఒకరూపాయను, తదితరులు ఒకటిన్నర రూపాయను చెల్లించవలసియుందురు. వలయువారీ విలాసమునకు వ్రాయవలయును:—

మేనేజర్, భారతీభవనము, కౌలుబజారు, బళ్లారి.

## రఘువంశము

(కాళిదాసకృతికి తెలుగువచనము)

నెల్లూరు కలానిధి గ్రంథమాలా ద్వితీయకుసుమము. క్రౌనుసైజున పుటలు ౧౬౩, వెల రు. ౦-౧౨-౦ అనువాదకులు: దీపాలపిచ్చయ్యశాస్త్రిగారు. గ్రంథము కలయువారు మేనేజరు 'కలానిధి,' నెల్లూరు అను చిరునామాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

## కల్పమంజరి

క్రౌనుసైజు, పుటలు ౩౧, వెల నాలుగణాలు. గ్రంథకర్త: అల్లంరాజు రంగనాయకులుగారు, పిఠాపురము.

## పరీక్షిత్తు

క్రౌనుసైజు, పేజీలు ౧౧౯, వెల రు. ౦-౧౨-౧. గ్రంథకర్త: పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. చిరునామా—కౌండిన్యనిలయము, పిఠాపురము.

## పల్లెటూరికథలు

క్రౌనుసైజులో ౭౪ పేజీలు, వెల రు. ౦-౪-౦ గ్రంథకర్త: శనివారపు సుబ్బారావుగారు, కొవ్వూరు, (ప. గోదావరి)

## తిరుప్పావుత్సవకము

డిమ్మి ౧౬ సైజు, ద్రావిడభాషలోని తిరుప్పావుకు తెలుగు. అనువాదకులు: మధుర నరహరి వేంకటేశము సెట్టిగారు ౨౮, సుబ్రమణ్యముదలివీథి, మదరాసు. పుస్తకము వెల రెండు అణాలు.

## ఇటావా-సమాధి

(Burial of Itawa)

క్రౌనుసైజు, పుటలు ౮; వెల తెలియదు. దొరకుచోటు:—సెక్రిటరీ, యూత్ లీగ్, మునిఖండ, అంబాజీపేట పోస్టు (తూ గోదావరి).

# భారతి చందాదారుల కొక ముఖ్యమైన విజ్ఞప్తి

---

ఈ దిగువ నమోదుపఱచినసంఖ్యలుగల చందాదారులచందాలు ఈ ప్రజోత్పత్తి సం॥ చైత్రమాస సంచికతో ముగియుచున్నవి. ఆయాసంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మనీఆర్డరుద్వారా పంపుటగాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు మే నెల ౧-వ తేదీ లోగా మాకు మనీఆర్డరు గాని వి. పి అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము. చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

3600 4033 4036 4040 4044 4087 4259 4517 4766 4787 4796 5142 5146
5533 5579 5580 5590 5598 5599 5602 5604 5608 5611 5615 5617 5618
5620 5626 5635 5641 5660 5665 5898 5906 5917 6200 6208 6232 6234
6235 6247 6249 6251 6252 6256 6257 6266 6272 6285 6312 6314 6326
6407 6415 6418 6419 6423 6428 6430 6433 6434 6440 6441 6445 6451
6502.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుప ప్రార్థితులు.

—మేనేజరు, భారతి.

---




# స చి త్ర మా స ప త్రి క

## ప్రతి చాంద్రమాసాదిని ప్రచురింపబడును.

ప్రతి సంచికయందును 3, 4 వర్ణచిత్రములు, ఇతరచిత్రములు నుండును.

చందా సం॥౧-కి రూ. 6-0-0. విడిపత్రిక వెల రూ. 0-8-0

మాదిరి పత్రిక అణాలు 0-8-0.

స్టాంపులను పంపిననే పంపబడును. ఉచితముగ పంపబడదు.

మాదిరిపత్రిక తెప్పించుకొన్నతర్వాత చందాదార్లుగ చేరువారు ఆసొమ్మును మినహాయించుకొని తక్కినసొమ్ము మాత్రము పంపవచ్చును.

ప్రకటన ధరలు:—

ఒకనెలకు మాత్రము సాధారణ పుట 1-కి రూ 30-0-0

సాధారణపుట $\frac{1}{2}$ కి రూ. 15-0-0; సాధారణపుట $\frac{1}{4}$ కి రూ. 8-0 0

6 నెలలకు అంతకుపైన సాధారణపుట 1-కి నెలకు 1-కి రూ. 25-0-0

నెలకు $\frac{1}{2}$-కి, రూ. 12-0-0; నెలకు $\frac{1}{4}$-కి, రూ. 7-0-0

మేనేజరు, "భా ర తి"

తపాలపెట్టె నెంబరు 212, మదరాసు.

